అపరాధ పరిశోధన అనుబంధం—35

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఈశ్వరానంద శిష్యులు

రచన : కంచర్ల రమణ

## ఓడలో తుఫాన్

రచన : సంపత్

## ముగ్గురు బాస్‌లు

రచన : ఏ. వీ. మోహన్రావ్

## తిరుగులేని అబద్ధాలు

రచన : వసుంధర

అపరాధ పరిశోధన సప్లిమెంట్ —35

అక్టోబర్, 1976
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

గెడా రంగారావు

# ఈశ్వరానంద శిష్యులు!

కంచర్ల రమణ.

తన యింటిముందు పోలీసు కారాగడం, అందులోంచి డి. యస్. పీ. రంగనాథరావు దిగడం చూసి ఆశ్చర్య పోయాడు కమర్షియల్ టాక్స్ ఆఫీసరు సుగుణాకర్. తన మీద యేదన్నా లంచాల కేసు వుందేమోనని, యింకో ప్రక్కనుంచి అతనిలో సన్నగా భయంకూడా మొద లయ్యింది.

"గుడ్ యీవెనింగ్! ... వెల్ కమ్ టు మై హంబుల్ హోమ్!" అన్నాడు సుగుణాకర్, పేపరు మడిచి, టీపాయ్‌మీద పెట్టి, లేచి నిలుచుని నవ్వుతూ.

"గుడ్ ఈవెనింగ్!...మీ సాయంసమయాన్ని పాడు చేసాను," వరండాలోకి వచ్చిన రంగనాథరావు నవ్వి అన్నాడు.

4

రంగనాథరావు వచ్చింది లంచాల కేసుమీద కాదు, వేరే కారణంవల్ల అని గ్రహించాడు సుగుణాకర్. ఇందాకటి భయం యిప్పుడు అతనిలో లేదు.

"నా పెటాల్! నా పెటాల్!...కూర్చోండి" అంటూ తను అంతవరకూ కూచున్న వాలుకుర్చీ రంగనాథరావుకి ఆఫర్ చేసాడు సుగుణాకర్.

రంగనాథరావు కుర్చీలో కూచుంటూ "ఐదు నిముషాలంటే అయిదునిముషాలు మీతో మాట్లాడాలి. మీరూ కూచుంటే బావుంటుంది" అన్నాడు.

ప్రక్కగదిలోంచి ఓ కుర్చీ తెచ్చుకుని కూచున్నాడు సుగుణాకర్.

"బియ్యం టోకు వ్యాపారస్తుడు తాతారావుమీద టేక్స్ కేసులేమైనా వున్నాయా?" అడిగాడు రంగనాథరావు.

"ఎవరాయన?" నొసలు చిట్లించి అన్నాడు సుగుణాకర్, చప్పున ఆ వ్యక్తి యెవరో గుర్తుకు రాక.

"అదే! ... అన్నపూర్ణా ఎంటర్ ప్రైజెస్ ... డబుల్ రోడ్ లో వుంది గదా," చెప్పాడు రంగనాథరావు.

దాంతో గుర్తొచ్చింది సుగుణాకర్ కు, తాతారావు యెవరో. "ఆఁ...గుర్తొచ్చింది...ఎందుకూ?" అన్నాడు సుగుణాకర్ మెరిసే కళ్ళతో.

"మాకో కేసు విషయంలో తాతారావు సాయం కావాలి. అంచేత, అతడిమీద టేక్స్ కేసులున్నాయేమో చెప్పగలరా?"

"తాతారావు చాలా కరెక్టు మనిషండీ! లెక్కలు పక్కాగా, మెయిన్ టెయిన్ చేస్తాడు. ఇహ, టేక్స్ కట్ట

డంలో యెప్పుడూ జాప్యం చెయ్యడు. అయితే, మొన్న సడెన్‌గా చెక్ చేస్తే స్టాకుకీ, ఎకౌంట్ బేలన్స్‌కీ తేడా వచ్చింది. ఫార్మల్‌గా కేసు బుక్ చేసాం."

"అమ్మయ్య! బ్రతికించారు. ఏ కేసులూ లేవని చెప్తుంటే బెంగపడ్డాను. చాలు! ఆ మాత్రం చాలు! ఇంతకూ అంత కరెక్టు మనిషి ఆ తప్పెలా చేసాడంటారు?"

"నిజానికి అది తప్పు కాదు. వ్యాపారస్తులకో అలవాటుంది. రాత్రికి యిళ్ళకు పోయిగాని అవాల్టి ఎకౌంట్స్ సరి చేసుకోరు. కొన్ని వస్తువులకి బిల్లు అడగడం మన కస్టమర్స్‌కి అలవాటు లేదు. తరువాత బిల్లు కట్ చెయ్యొచ్చులే అని ముందు సరుకు యిచ్చేస్తారు వ్యాపారస్తులు... అదే తెచ్చింది చిక్కు యిప్పుడు అతనికి."

"అంటే, అదో పెద్ద నేరం కాదన్నమాట."

"కాదు. సామాన్యంగా వ్యాపారస్తులు చేసే తప్పు అది."

"అయితే, ఆ కేసు మేం కొట్టెయ్యమంటే కొట్టెయ్యగలరన్నమాట?"

"ఏమిటి? తాతారావు సిఫార్సు పంపాడా మీ ద్వారా?" నవ్వాడు సుగుణాకర్.

"నో! నో! అదేం కాదు. మా డిపార్టుమెంటుకే అతనితో అవసరం పడింది. అతని అండర్‌గ్రౌండ్ గోడౌన్సు మేం వాడుకోవాలి కొన్నాళ్ళు."

"ఏమిటో విశేషం?" కుతూహలంగా అడిగాడు సుగుణాకర్.

"దయచేసి ఆ వివరాలేవీ అడగవద్దు. అది టాప్ సీక్రెట్. అందుకే మీ ఆఫీసుకు రాకుండా, యిక్కడి

కొచ్చి మాట్లాడుతున్నాను మీతో. అసలు అదేమిటో నాకుకూడా పూర్తిగా తెలీదు. నేను యిప్పుడు ఎస్. పీ. గారి ఆదేశంమీద యిక్కడికి వచ్చాను. మీకు కావాలంటే, ఆ కేసు డ్రాప్ చెయ్యమని, మా డిపార్టుమెంటు ఆర్డర్స్ తీసుకురాగలను.''

''నో! నో! అవసరంలేదు. ఆ కేసు డ్రాప్ చెయ్యగలను.''

''అయితే, రేపోసారి, తాతారావు షాపుకి వెళ్దాం. రాగలరా?''

''రాగలను. ఎన్ని గంటలకు?''

''మీరు రావద్దు. నేనే వస్తాను. ఉదయం ఎనిమిదిన్నర ప్రాంతంలో యిక్కడకు వస్తాను. మన పోలీసుకారులోనే వెళ్దాం. సిద్ధంగా వుండండి'' అంటూ లేచాడు రంగనాథరావు.

''అలాగే...తప్పకుండా వెళ్దాం...ఐ ప్రామిస్ యూ'' అన్నాడు సుగుణాకర్.

రంగనాథరావు కదిలి వెళ్ళి కారులో కూచోగానే, కారు బయలుదేరింది.

## 2

తన షాపుముందాగిన పోలీసు కారులోంచి దిగిన డి. యస్. పి. రంగనాథరావుని, సీ. టీ. ఓ. సుగుణాకర్ నీ చూడగానే, తాతారావు ప్రాణాలు కడబట్టిపోయాయి.

మూడురోజుల క్రితం జరిగిన సర్ప్రైజ్ చెక్ లో తను దొరికిపోయిన దగ్గర్నుండీ, తాతారావుకు రాత్రిళ్ళు నిద్ర పట్టడంలేదు. ఈ కేసులోంచి బయటపడితే, వెంకటేశ్వర స్వామికి తలనీలాలు యిచ్చి హుండీలో వెయ్యిన్నూట పదహార్లు వేస్తానని మొక్కుకున్నాడుకూడా.

సీ. ఐ. ఓ., డి. యస్. పీ. ని వెంటబెట్టుకుని రావడం చూస్తుంటే, స్టాకు వేలన్నులో వున్న డిస్ట్రిక్ పెన్సీమీద డిపార్టుమెంటు గట్టి యేక్షనే తీసుకోబోతోందని అర్థం చేసుకుని క్రుంగిపోయాడు పూర్తిగా.

అయినా—"రండి సార్! దయచెయ్యండి!" మొహం మీద తెచ్చిపెట్టుకొన్న నవ్వుతో, ఆ ఆఫీసర్లని లోనికి ఆహ్వానించి కుర్చీలు చూపాడు తాతారావు.

తమని చూడగానే తాతారావు మొహం కళ తప్పిపోవడం రంగనాథరావు గ్రహించాడు. తనకు అవసరమయ్యే మూడ్ తాతారావులో యేర్పడినందుకు లోలోన సంతోషించాడు.

తాతారావు చూపిన కుర్చీలో కూచోకుండా "లోన మీకు ఓ ప్రైవేట్ రూం లేదా?" అన్నాడు రంగనాథరావు.

ఉందనాలో, లేదనాలో తెలీక కాసేపు తటపటాయించాడు తాతారావు. "ఉంది సార్! పదండి" అన్నాడు.

తాతారావు ముందు దోవ తియ్యగా, అతడ్ని అనుసరించారు డి. యస్. పీ., సీ. ఐ. ఓ.

అదో చిన్న గది. దాని తీరు చూడగానే, అదో ఆఫీసు రూం కమ్ డ్రాయింగ్ రూం అని అర్థం చేసుకోవచ్చు. ఓ టేబిలుకు అటు ఓ కుర్చీ, యిటు రెండు కుర్చీలు వున్నాయి. టేబిలుమీద, ఏవో పుస్తకాలు, ఫైళ్ళు వున్నాయి. దగ్గరలోవున్న రేక్‌లోకూడా పుస్తకాలు, ఫైళ్ళ దొంతర్లు వున్నాయి.

"వెరీ గుడ్! ఇక్కడికి ఎవరూ రారు గదా? లేకపోతే, ఎవరూ రాకుండా, కాసేపు యేర్పాటు చెయ్యండి,"

అన్నాడు రంగనాథరావు, ఆ గదిలోకి రాగానే.

"ఎవరూ రారు సార్!" అంటూ హామీ యిచ్చాడు తాతారావు.

డి. యస్. పీ., సీ. టీ. ఓ. కుర్చీల్లో కూచున్నారు. తాతారావు మాత్రం నిలుచునే వుండిపోయాడు.

"మీరూ కూచోండి శెట్టిగారూ!" అన్నాడు సుగుణాకర్.

బెరుగ్గానే కూచున్నాడు తాతారావు.

"మొన్న మీరు స్టాక్ బేలన్సు చూపడంలో దొరికి పోయారట?" ఆరంభించాడు రంగనాథరావు.

"అవును సార్! పొరబాటయిపోయింది" తాతారావు గొంతులో ఏడుపు జీర కన్పించింది.

"మీకు తెలుసా? కలకత్తాలో అక్రమ వ్యాపారస్తుల్ని అరెస్టుచేసి వీధుల్లోంచి ఎలా యీడ్చుకెళ్ళారో?", అన్నాడు రంగనాథరావు చాలా సీరియస్‌గా.

తాతారావు దాంతో బేలయిపోయేడు మానసికంగా.

"సీ. టీ. ఓ. గారు యిక్కడే వున్నారు అడగండి సార్. ఇంతకుముందు నామీద యెప్పుడూ కేసులు లేవండి. ఇదే మొదటి కేసు. ఇదే ఆఖరి కేసుకూడా" అన్నాడు తాతారావు.

"ఆల్ రైట్! అలాగంటున్నారు కాబట్టి, మిమ్మల్ని కేసులోంచి తప్పించేస్తాను. అయితే, మీరు నాకో సాయం చెయ్యాలి" అన్నాడు రంగనాథరావు, తాతారావు పూర్తిగా షేక్ అయ్యాడని నిర్ధారించుకున్నాక.

అలాంటి అవకాశం యెప్పుడొస్తుందా ఉపయోగించు కుందామా అని ఎదురుచూస్తున్న తాతారావు, "చెప్పండి

సార్! మీకు నాశక్తి మేరకు సాయం చేస్తాను,'' అన్నాడు ఆలస్యం చెయ్యకుండా.

''నాకంటే నాకు కాదు. మా డిపార్టుమెంటుకు'' మాట సవరించుకున్నాడు రంగనాథరావు.

''ఎవరికయినా సరే, చెయ్యడానికి సిద్ధమే. చెప్పండి సార్'' అన్నాడు తాతారావు ఆనందంగా.

''ఏమీలేదు. మీ అండర్‌గ్రౌండ్ గొడౌను కొన్నాళ్లు మా డిపార్టుమెంటువాళ్ళం వాడుకుంటాం'' అని మొదలు పెట్టి ఆగాడు రంగనాథరావు, తాతారావు రియాక్షన్ కోసం యెదురుచూస్తూ.

''అదెంత మాట సార్! తప్పకుండా. కానీ, అందులో నా స్టాకు వుందే!'' అన్నాడు తాతారావు సందేహంగా.

''సరుకు ఉండనివ్వండి, కావలసి వచ్చినపుడు తీసుకోండి. దాంతో మాకేం యిబ్బంది వుండదు,'' చెప్పాడు రంగనాథరావు.

''అలాగయితే, ఎన్నాళ్ళు కావలిస్తే అన్నాళ్ళు నా గొడౌను వాడుకోండి. నా కభ్యంతరంలేదు.''

''అయితే ఒక షరతు. ఇలా మీ గొడౌను తీసుకొన్నట్టు మీ యింటి ఆడవాళ్ళకుకూడా తెలియగూడదు తెలిసిందా! చాలామంది పీకలు తెగిపోతాయి. అందులో మీదీ ఒక పీక అని గుర్తుంచుకోండి,'' అన్నాడు రంగనాథరావు తీవ్రంగా.

''అమ్మమ్మ! ఎంత మాట. దేవుడి తోడు సార్! ఈ రహస్యం నాలోనే ఉండిపోతుంది,'' ఒట్టుపెట్టాడు తాతారావు.

''ఓ.కే! అయితే, రేపు మా వాళ్ళు యిద్దరు వస్తారు

మప్టీలో. వాళ్ళు ఉండడానికి యేర్పాట్లు చెయ్యండి. అయితే, వాళ్ళు లేనట్టుగానే, మీ వ్యవహారాలు సాగించండి,'' లేచి అన్నాడు రంగనాధరావు. సీ. టి. ఓ. కూడా లేచాడు.

# 3

ఉదయం పది గంటలయింది. బియ్యం కొనుక్కోవడానికి వచ్చిన మనుషులతో చాలా బిజీగా వున్నాడు తాతారావు.

''తాతారావుగారూ!''

ఆ పిలుపు తన కస్టమర్స్ పిలిచినట్టుగా లేకపోయేసరికి, తలెత్తి చూసాడు తాతారావు.

''రంగనాధరావుగారు నిన్న మీతో మాట్లాడేరు గదూ!'' అన్నాడు ఓ చేతిలో సూట్‌కేసు పట్టుకుని నిలుచున్న వ్యక్తి.

అతని ప్రక్కన యింకో వ్యక్తి వున్నాడు. అతని చేతిలో పెద్ద సంచీ వుంది.

ఆ వచ్చింది పోలీసు డిపార్టుమెంటు మనుషులని గ్రహించేడు తాతారావు. చేస్తున్న పని సగంలోనే ఆపేసి లేచి, ''రండి'' అంటూ లోనికి దారితీసాడు.

ఆ యిద్దరు వ్యక్తులు తాతారావుని అనుసరించారు.

తిన్నగా వాళ్ళని గొడౌనులోకి తీసుకెళ్ళాడు తాతారావు.

''ఇదీ మా అండర్‌గ్రౌండ్ గొడౌను. దీన్ని మీకిమ్మని చెప్పారు రంగనాధరావుగారు,'' అన్నాడు తాతారావు.

"ఓ.కే! మాకో టేబిలు, రెండు కుర్చీలు కావాలి" అన్నాడు సూట్ కేసు పట్టుకున్న వ్యక్తి.

"అలాగే!" అంటూ వెంటనే వెనక్కి పరుగెత్తి, తన ప్రైవేట్ రూంలోని టేబిలు, రెండు కుర్చీలు పనివాళ్ళ చేత తెప్పించి వేయించాడు తాతారావు.

"ఇంకా ఏమైనా కావాలా?" అన్నాడు తాతారావు తన పని చూసుకోవడానికి వెళ్ళిపోబోతూ.

"తరువాత వచ్చి అడుగుతాం లెండి" చెప్పాడు చేతిలో సంచీ పట్టుకున్న వ్యక్తి.

తాతారావు వెళ్ళిపోయాడు.

గొడౌను తలుపులు దగ్గరగా లాగి, గడియపెట్టాడు సంచీ పట్టుకున్న వ్యక్తి,

ఆ యిద్దరు వ్యక్తులు యిద్దరు ఇంటెలిజెంస్ ఆఫీసర్లు. వారి చేతుల్లోవున్న సూట్ కేసు, సంచీల్లో టెలిఫోను కాల్స్ రిసీవ్ చేసుకునే సెట్ వుంది.

ఆ తాతారావు రైస్ షాపుకు పదిగజాల దూరంలో స్నొ వైట్ అనే బార్ అండ్ రెస్టారెంట్ వుంది.

ఆ రెస్టారెంట్ ఇంచుమించు ఇరవైనాలుగు గంటలూ తెరిచే వుంటుంది. ఏవేళప్పుడయినా ఊర్లో టీ, టిఫిన్, భోజనం దొరక్కపోవచ్చు గాని, ఆ రెస్టారెంట్ లో మాత్రం అవి అన్నివేళల్లోనూ దొరుకుతాయి. ఆ కారణం వల్లనో, మరే కారణంవల్లనో, ఆ రెస్టారెంట్ యెప్పుడూ రద్దీగానే వుంటుంది.

ఆ రెస్టారెంట్ ప్రొప్రయిటర్ నూకరాజు యెంతో మర్యాదస్తుడు, మంచివాడు అని ప్రతీతి. టౌనులో వున్న పెద్ద ఆఫీసర్లందరూ నూకరాజుకు పరిచయస్తులే. ఏదో సందర్భంలో అతని సహాయాన్ని పొందినవారే.

సెంట్రల్, స్టేట్ కేబినెట్ మంత్రుల్లో చాలామంది అతనికి తెలుసంటారు అందరూ. అది నిజమే అన్నట్టుగా, టౌనులోకి వచ్చిన ప్రతీ మంత్రీ, నూకరాజు ఆతిధ్యం పొందక, నూకరాజుతో రెండు నిముషాలయినా మాట్లాడక తిరిగి వెళ్ళిపోరు వెనక్కి.

అలాంటి నూకరాజు నడుపుతున్న రెస్టారెంట్‌లో 'హిరోయిన్' అనే మత్తుమందు వ్యాపారం పెద్ద యెత్తున సాగుతోందని, ఓ గాలివార్త పోలీసు డిపార్టుమెంటుకు చేరింది.

అయితే, గాలివార్తలను బట్టుకుని యేక్షన్ తీసుకుంటే చాలా ప్రమాదాలున్నాయి, ముఖ్యంగా నూకరాజువంటి పలుకుబడి గల పెద్దమనిషి విషయంలో.

విశాఖలోనూ, అంతేగాదు, ఆంధ్రదేశంలో కొన్ని ముఖ్యపట్టణాల్లో యిటీవల విస్తారంగా మత్తుమందులు దొరుకుతున్నాయన్నది నిర్వివాదాంశం. అయితే; యెక్కడ్నించి, ఎవరూ, ఎలా తెచ్చి పంపిణీ సాగిస్తున్నారన్నది అంతు తేలకుండా వుంది.

చిన్న చిన్న మొత్తాలమ్మే, కిల్లీ కొట్టువాళ్ళనో, టీ దుకాణాలవాళ్ళనో, అడపా దడపా అమాయకంగా దొరికిపోయే 'డెలివరీ బోయ్స్'నో పట్టుకుని శిక్షించడం వల్ల లాభం లేదన్నది పోలీసు డిపార్టుమెంటుకు అనుభవం అయిపోయింది.

'మూలవిరాట్టులు' పట్టుబడనంత కాలం, యీ డ్రగ్ ట్రాఫిక్ ఆగదని నిలకడమీద అర్థమయిపోయింది పోలీసులకు.

అందుచేత, ఓ సుదీర్ఘమైన, పటిష్టమైన పథకం ఒకటి

తయారుచేసారు. దాని ప్రకారం వెళ్ళితే, మూలవిరాట్టులు వలలో చిక్కుకుపోవచ్చు.

ఆ పథకంలోని మొదటి అంశమే సాఫ్ట్ వైట్ బార్ అండ్ రెస్టారెంట్‌కు వచ్చేపోయే కాల్స్‌ని టేప్ చెయ్యడం. నెల క్రితం, పోలీసులు అతి నేర్పుగా ఫోన్ టాపింగ్ డివైస్ ఆ రెస్టారెంట్‌లో బిగించారు.

తాతారావు అండర్‌గ్రౌండ్ గొడౌన్‌నుండి ఆ డివైస్‌కి మోనిటర్ చేయడానికి నిశ్చయించుకుంది పోలీసు డిపార్టు మెంటు.

## 4

వారంరోజులు గడిచాయి.

జగ్గూ, రామూ—ఇంటెలిజెంస్ ఆఫీసర్లు తాత్కాలికంగా తమకు పెట్టుకొన్న పేర్లు—అనుమానాల్ని రేకెత్తించే ఒక్కటంటే ఒక్కటి కాల్ సాఫ్ట్ వైట్ రెస్టారెంట్‌కు రాలేదు యీ వారం రోజుల్లో.

అప్పుడే రాము ఓర్మి తరిగిపోయింది.

ఓ రోజు రాత్రి తన తలకు తగిలించుకున్న రిసీవింగ్ సెట్‌ని టేబిలుకేసి కొట్టి "ఎవడో పోలీసు డిపార్టు మెంట్‌కి తప్పుడు భోగట్టా అందించి బురిడీ కొట్టించాడు" అన్నాడు కోపంగా.

"పేషెన్స్ ఫ్రెండ్! పేషెన్స్! ఇప్పుడే మనం పట్టు వదలగూడదు" అన్నాడు జగ్గు, తను చదువుతూన్న పుస్తకంలోంచి తలెత్తి.

"మనం పిచ్చివెధవలంగాని, ఎవడైనా ప్రమాదకరమైన విషయాలు ఫోనులో మాట్లాడతాడా?" అన్నాడు రాము విసుగ్గా.

"ఆల్ రైట్! నువ్వన్నది కాదనడంలేదు. కాని మన 'సద్గురు' ఆ విషయం ఆలోచించలేదంటావా?" అడ్డు తగిలాడు జగ్గు.

సద్గురు అంటే సూపరెన్టెంట్ ఆఫ్ పోలీస్. డిపార్టుమెంట్‌లో తమ బాస్ గురించి మాట్లాడుకునేటప్పుడు 'సద్గురు' అనడం వాళ్ళకు అలవాటు.

"నువ్వేం చెప్పు, ఇహ నావల్ల గాదు. ఆ నాన్సెన్స్ వినే ఓపిక నాకు లేదు, రాసే శక్తి అంతకన్నా లేదు" అంటూ టేబిలు ముందునించి లేచిపోయాడు రాము.

ఈ వారంరోజులూ, సాఫ్టు వైట్ రెస్టారెంట్‌కు వచ్చే కాల్స్ వినడమే గాకుండా, ఫోను చేసేవారి పేర్లు, వారిచ్చిన ఫోను నెంబర్లు ఓపిగ్గా జాబితా రాస్తూ వచ్చారు.

"బ్రదర్! రెస్టు తీసుకో! ఇంటెలిజెంస్ బ్రాంచి అంటే ఎంతో ఓపికతో కూడిన వ్యవహారం. ఒక్కోసారి చిన్న భోగట్టాకోసం నెలలుకూడా గడపాల్సి వస్తుంది" అంటూ తను వెళ్ళి, టేబిలు ముందు కూచుని, తలకు సెట్ తగిలించుకుని, కాల్స్ వినసాగాడు జగ్గు.

ఆ రాత్రి గడిచిపోయింది. ఇంకో రోజుగూడా గడిచిపోయింది, ఫలితం లేకుండా.

ఆ రెండవరోజు రాత్రి పదిగంటలవుతుండగా, చిత్రాతిచిత్రమైన ఫోను కాలొకటి వచ్చింది సాఫ్టు వైట్ రెస్టారెంట్‌కి.

"సుబ్బారావుగారూ! సుబ్బారావుగారూ!" అవతలినించి ఓ గొంతుక.

క్షణం పోయాక—

"నేనే సుబ్బారావుని. ఏం కావాలి చెప్పండి?"

ఆ గొంతుక, రెస్టారెంట్ ప్రొప్రయిటర్ సూకరాజుది.

నూకరాజు తను సుబ్బారావు అంటూ చెప్పుకోవడమే డ్యూటీలో వున్న రాము అనుమానాల్ని రెచ్చగొట్టింది.

“పాపాయి వచ్చిందా ఊరునించి” అవతలి గొంతు.

“వచ్చింది నిన్ననే” నూకరాజు గొంతు.

“అమ్మయ్య...” అవతలి గొంతు నిట్టూర్పు.

“ప్రెజెంట్ అరకేజీ కేకు తక్కువైతే తీసుకు రాకండి” నూకరాజు గొంతు.

“అర కేజీ యేం కర్మ? కేజీ కేక్ పట్టుకొస్తున్నాను. అవునూ; బజారులో కేక్ ధర అలాగే వుందా? పెరిగిందా?” అవతలి గొంతు.

“అంతే! రేట్ లో మార్పు లేదు” నూకరాజు గొంతు.

“మరి ప్రెజెంట్ యెప్పుడు తీసుకురాను?” అవతలి గొంతుక ప్రశ్న.

“రేపు రాత్రి తొమ్మిది గంటలకు” నూకరాజు జవాబు.

“థేంక్యూ! కిస్సెస్ టు బేబీ” అవతలి గొంతు.

మరోమాట మాటాడకుండా నూకరాజు ఫోను పెట్టేసాడు.

చల్లగా ఆ సంభాషణ వినడమే గాకుండా, దాన్ని ఓ కాయితంమీద రాసి జగ్గూకు పాసాన్ చేసాడు రాము.

సెట్ ని తలమీంచి తీసేస్తూ, “ఇన్నాళ్ళూ మనం వెయిట్ చేస్తున్నది, చివరకి దొరికిం దనుకుంటున్నాను. నువ్వేమంటావ్” అన్నాడు.

తన చేతికొచ్చిన కాయితాన్ని రెండు నిముషాలు ధ్యానంగా చదివి “ “పాపాయి”, “ప్రెజంట్” అన్న మాటలు తీసేసి “హిరోయిన్”, “డబ్బు” అన్నమాటలు పెట్టుకుంటే, మనకు కావాల్సింది దొరికిందనే అనిపిస్తోంది” అన్నాడు జగ్గు సంతోషంతో మెరిసే కళ్ళతో.

"దెన్ లెట్ అజ్ గో టూ సద్గురు ఫర్ ఫర్దర్ ఆర్డర్స్" రాము ఉత్సాహంగా లేచాడు.

# 5

ముందరుంచిన కాయితాన్ని అందుకుని, నిదానంగా రెండుసార్లు చదివాడు ఎస్. పి. సుందర్రామ్.

"మనవాళ్లు సాధించినట్టుగానే అగపడ్తోంది" అన్నాడు తలెత్తి.

"అదే నేనూ అనుకుంటున్నాను సార్!" అన్నాడు డి. ఎస్. పి. రంగనాథరావు హుషారుగా.

"దెన్ వాట్ నెక్స్ట్?" అంటూ కుర్చీలో విశ్రాంతిగా వెనక్కి వాలాడు సుందర్రామ్.

"మీరు ఓకే అంటే, ఇవాళ డెలివరీ జరుగుతుండగా రెడ్ హేండెడ్ గా వాళ్ళని పట్టుకుని అరెస్టు చేస్తాం," చెప్పాడు రంగనాథరావు ఆవేశంగా.

'తప్పు! తప్పు!' అన్నట్టుగా చెయ్యి ఊపుతూ, "మనుషులు గాని, డిపార్టుమెంటులు గాని ఒకసారి చేసిన తప్పులు మళ్ళా చేస్తే, స్టుపిడ్స్ అనాల్సి వస్తుంది. గతంలో చేసిన తప్పుల్నుంచి గుణపాఠం నేర్చుకోకపోతే వాళ్ళ లాంటి ఫూల్స్ ఇంకోళ్ళుండరు. ఒకసారి రికార్డ్స్ చదువు. స్ట్రి కేసెస్‌ని పట్టుకోవడంవల్ల ఫలితం లేదు. ఈ బిజినెస్‌ని వేళ్ళతో పీకెయ్యడం నాకు కావాలి. ఇవాళ మీరు చెయ్యాల్సిందంతా యేమంటే, అసలు ఆ డెలివరీ వగైరా ఎలా జరుగుతున్నాయో చూసి రండి" అన్నాడు సుందర్రామ్ తాపీగా, హుందాగా.

"అంతేనంటారా?" నిరుత్సాహంగా అన్నాడు రంగనాథరావు.

"అంతే! అంతకుమించి ఒక్కడుగు మీరు ముందుకు వేసినా, మీ కెరియర్స్ రిస్క్‌లో వుంటాయని గుర్తు పెట్టుకోండి" సుమారు ఆరంగుళాల పొడవున్న తన కుడి చేతి చూపుడువేలు తాటిస్తూ అన్నాడు సుందర్రామ్ తీవ్రంగా.

"అయితే, నాతో ఎవర్ని తీసుకెళ్ళమంటారు సార్!" అడిగాడు రంగనాథరావు, మనుషుల ఎన్నిక విషయంలో కూడా, సుందర్రామ్ ఆర్డర్స్ తీసుకోవాలేమోనన్న అనుమానంతో.

"అది నీ యిష్టం. యూ వర్కౌట్ డిటెయిల్స్! నా ఆర్డర్స్ మాత్రం స్పష్టంగానే వున్నాయి కదా. అక్కడేం జరుగుతోందో, ఎలా జరుగుతోందో చూసి, అన్ని వివరాలతో నాకు రిపోర్టు చెయ్యడంవరకే మీ డ్యూటీ, తెలిసిందా?" మరోసారి జాగ్రత్త చెప్పాడు సుందర్రామ్.

"తెలిసింది సార్!" అన్నాడు రంగనాథరావు, సుందర్రామ్ చెప్పింది మననం చేసుకుంటూ.

తన ఛాంబర్‌కు తిరిగివచ్చాడు డి. ఎస్. పి. రంగనాథరావు.

చాలాసేపు ఆలోచించినమీదట, సబిన్స్పెక్టరు సీతాపతిని తనతో తీసుకెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు.

కాలింగ్ బజ్జర్ నొక్కాడు.

మెసెంజర్ అప్పారావు వచ్చాడక్కడికి.

"పోయి సబిన్స్పెక్టరు సీతాపతిని నేను రమ్మన్నానని ఉన్నపళంగా తీసుకురా" అన్నాడు రంగనాథరావు.

"అలాగే సర్!"

మెసెంజర్ అప్పారావు వెళ్ళిపోయాడు.

అయిదు నిముషాలు గడిచాయి.

"సార్! పిలిచారుట!" అంటూ సన్నగా, పొడుగ్గా, యెర్రగా, అయిదడుగుల పదంగుళాల పొడవు, ముప్ఫై రెండేళ్ళ వయస్సున్న సబిన్స్పెక్టరు సీతాపతి, చురుకైన చూపులతో, నిదానమైన అవయవాల కదలికతో లోనికి అడుగుపెట్టాడు.

తను చేసే ప్రతి పనీ, విజయవంత మయ్యేంతవరకూ అచంచల దీక్ష, నిర్విరామ కృషి సలపడంలో వెనుకంజ వెయ్యడని, అతని ప్రతి కాన్ఫిడెన్షియల్ రిపోర్టులోనూ పై ఆఫీసర్లు రిమార్కుల్స్ రాసారు.

స్పెషల్ ఎసైన్మెంట్స్ యివ్వాల్సి వచ్చినప్పుడల్లా అతన్ని పిలుస్తారు, అతని గురించి తెలిసిన ఆఫీసర్లు.

"ప్లీజ్ సిడౌన్! నీతో ఓ అర్జంటు విషయం మాట్లాడాలి" అంటూ తన ముందున్న కుర్చీ సీతాపతికి ఆఫర్ చేసాడు రంగనాథరావు.

'థేంక్స్' చెప్పి కూచున్నాడు సీతాపతి.

"ఇవాళ మనం ఇద్దరం డ్యూటీలో వుండబోతున్నాం" అంటూ రాత్రికి తాము నెరవేర్చబోయే వాచింగ్ ఆపరేషన్ గురించి వివరంగా చెప్పి, "నీ ఐడియాస్ ఏమిటి?" అంటూ ముగించాడు రంగనాథరావు.

ఐదు నిముషాల మవునానంతరం "మన పోలీసు కార్లో వెళ్ళే విషయం మర్చిపోండి సార్! మనవాళ్ళ దెవరిదో ఓ కారు ఎరువు తీసుకుందాం. ఐతే, దానికో ఫేక్ నెంబరు ప్లేట్ తగిలిద్దాం," అంటూ చెప్పడం ఆరంభించాడు సీతాపతి.

"ఫేక్ నెంబరు ప్లేటెందుకు?" సీతాపతి మాటల్ని కట్ చేసాడు రంగనాధరావు.

"సింపుల్! మనం వాళ్ళని వాచ్ చేస్తున్నట్టుగానే, వాళ్లెవరయినా, తమని పోలీసులు వాచ్ చెయ్యడంలేదు గదా అని వాళ్ళూ వాచ్ చెయ్యవచ్చు. అలాంటప్పుడు మన కారు నెంబరు వాళ్ళు నోట్ చేసుకోవచ్చు. కారు మన స్నేహితులిది కాబట్టి, వాళ్ళు చిక్కుల్లో పడతారు" వివరించాడు సీతాపతి.

"వెరీ గుడ్. ప్రొసీడ్ ఫర్దర్!" రంగనాధరావు ప్రోత్సహించగానే, సీతాపతి చెప్పసాగాడు మళ్ళా.

"రెస్టారెంట్‌కు కాస్త దూరంలో, మనం యెవరి రాక కోసమో యెదురుచూస్తున్నట్టు కనిపించేలా ఆపాలి. మనతో బైనాక్యులర్స్ తీసుకెళ్ళడం మంచిది. మనకు కావాల్సిన వ్యక్తి వచ్చి వెళ్ళాకకూడా, మరో అరగంట ఆగి వెళ్ళాలి. వీలైతే, మన డిపార్టుమెంటు మనిషే మఫ్టీలో ఆ సమయానికి అక్కడకు వచ్చి కలిసే యేర్పాటు చేసుకుంటే, అతడు రాగానే బయలుదేరి వెళ్ళడం సరిగ్గా అతికినట్టుగా వుంటుంది" తన ఊహాలు తెలియజేసాడు సీతాపతి.

# 6

రాత్రి ఎనిమిదిన్నరయింది.

సాఫ్టు వైట్ బార్ అండ్ రెస్టారెంట్ చాలా రద్దీగా వుంది, వచ్చీపోయే జనంతో.

నియోన్ దీపాల్తో అలంకరించిన రెస్టారెంట్ పేరు, ఉండి ఉండి ఆరి వెలుగుతూ, దారినపోయేవాళ్ళ చూపుల్ని ఆకర్షిస్తోంది.

రెస్టారెంట్ ముందరభాగం అంతా సుమారు పాతిక, ముప్పై కార్లు; పది, పదిహేను స్కూటర్లతో నిండివుంది.

వాటికి కాస్త దూరంలో తమ కారు ఆపి ఉంచడం విడ్డూరంగా లేకపోయినా, రెస్టారెంట్‌కు వచ్చే అంత మంది జనంలో తమకు కావాల్సిన వ్యక్తిని యెలా గుర్తు పట్టడం? అనుకున్నాడు రంగనాధరావు, బైనాక్యులర్స్‌తో పరిశీలిస్తూ.

క్షణాలు దొర్లిపోతున్నాయి. తొమ్మిది గంటలయింది. రెస్టారెంట్‌కు వచ్చే మనుషుల్ని నిశితంగా పరిశీలించసాగాడు, సీతాపతి.

అయిదు, పది, పదిహేను నిముషాలు గడిచాయి. రంగనాధరావుకేదీ విడ్డూరంగానూ, అనుమానాస్పదంగానూ కనిపించలేదు.

తొమ్మిది గంటలకు ఎప్పాయింట్‌మెంట్ యిచ్చిన వ్యక్తి, వచ్చి వెళ్ళిపోయి వుంటాడని, నిశ్చయించుకుని, నిరాశ పడసాగాడు సీతాపతి.

అదే సమయంలో నల్లగా, పొడుగ్గా, సన్నగా వుండి, పొడుగాటి జులపాలు, హేండిల్‌బార్ మీసాలు, అధునాతనంగా డెనిమ్ బట్టల్లో డ్రెస్సప్ అయివున్న, సుమారు ముప్పైయేళ్ళున్న వ్యక్తి, రెస్టారెంట్ ద్వారంవద్ద అగపడ్డాడు.

ఆ వ్యక్తి మెల్లగా బయటకు వచ్చాడు. యధాలాపంగా నిలుచుని, రోడ్డు కటూ యిటూ చూసాడు.

తరువాత మెల్లిగా కదిలి, రెస్టారెంట్‌వద్ద పార్క్ చేసిన ఓ కారువద్దకు కదిలి వెళ్ళాడు.

రెస్టారెంట్‌కు వచ్చినపుడు ఆ వ్యక్తి మోటర్ సైకిల్

మీద వచ్చాడన్న విషయం రంగనాథరావు మెదడులో క్షణం మెరిసి ఊరుకుంది.

ఆ కారు తనదే అయినట్టు, యధాలాపంగా వెళ్ళి కారు డిక్కీ తెరిచాడు.

కారు డిక్కీ చూస్తుంటే, ఆ వ్యక్తి చేతిలో ఓ పాకెట్టు వుండడం చూసారు రంగనాథరావు, సీతాపతి.

అదేం పాకెట్టు?

క్షణంలో ఆ వ్యక్తి, పాకెట్టుని, చొక్కా లోపల పెట్టుకొన్నాడు. అంతే! ఆ తరువాత చకచకా లోనికి వెళ్ళి తిరిగొచ్చి, తన మోటార్ సైకిలెక్కి వెళ్ళిపోయాడు మరు నిముషంలో.

ఆ వ్యక్తి డిక్కీ తెరిచిన కారు నెంబరు, మోటార్ సైకిలు నెంబరు నోట్ చేసుకొన్నాడు సీతాపతి.

## 7

తన రివాల్వింగ్ ఛెయిర్‌లో వెనక్కి వాలి డి. ఎస్. పి. రంగనాథరావు చెప్పిందంతా నిశ్శబ్దంగా విన్నాడు ఎస్. పి. సుందర్రామ్.

రెండు క్షణాలు పోయాక, ముందుకు వంగి నిటారుగా కూచున్నాడు. టేబిలుమీద వ్రేళ్ళు అల్లుకొన్న అతని చేతులు, అర్ధచంద్రాకృతిగా మారాయి.

"నీ ఐడియాస్ యేమిటి? ఈ కేసు విషయంలో" అన్నాడు తాపీగా, ఆలోచనల్లోంచి తేరుకుని.

"ఈ రిజిస్ట్రేషన్ నెంబర్లున్న వాహనాలు యెవరివో తెలుసుకుని, సాఫ్టు వైట్ రెస్టారెంట్ మీద, మోటర్ సైకిల్ వ్యక్తిమీద దాడిచేసి పట్టుకుంటాం," చెప్పాడు రంగనాథరావు.

సుందర్రామ్ సన్నగా నవ్వాడు. పాలరాయికన్నా సాఫుగా నున్నగావున్న గెడ్డాన్ని, బట్టతలని ఓసారి తీరిగ్గా తడుముకున్నాడు.

"ఒకటి, మనం ఫేక్ నెంబరు ప్లేట్లతో వెళ్ళినట్టే, వాళ్ళూ రాలేదని గేరంటీ ఏమిటి?" అన్నాడు సీరియస్‌గా రంగనాథరావు కళ్ళల్లోకి చూసి.

"నెంబర్లు చెక్ చేస్తే ఆ సంగతి తెలిసిపోతుందిగా" అన్నాడు రంగనాథరావు.

"ఓకే! తెలిసిపోతుంది. కాదనను. అదే...యింకో అమాయకుడి వాహనం నెంబరు తను తగిలించుకుంటే, ఆ అమాయకుడు అన్యాయంగా శిక్షింపబడడా?" అన్నాడు సుందర్రామ్.

రంగనాథరావు నిరుత్సాహపడ్డాడు.

"డోంట్ గెట్ డిజప్పాయింటెడ్! నేను చెప్పింది పాజబిలిటీస్ గురించి. అయితే, నేను చెప్పేదేమంటే, మనం మరీ తొందరపడి చర్య తీసుకోకూడదు. రేపొద్దున్న వీళ్ళందర్నీ అరెస్టుచేసి కోర్టులో నిలబెడితే, వాళ్ళు చచ్చినా కాదనలేని, తిరుగులేని ఎవిడెన్స్ మెటీరియల్ ముందు సంపాయించాలి," అన్నాడు మృదువుగా.

"అయితే, యిప్పుడు యేం చేద్దామంటారు సార్?" అన్నాడు రంగనాథరావు నెమ్మదిగా.

"నువ్వు చెప్పినట్టుగానే, ముందు, ఆ నెంబర్లు ఎవరివో కనుక్కో. ఆ వ్యక్తులు డ్రగ్స్‌తో సంబంధం వున్న వాళ్ళని తేలితే, వాళ్ళు వెళ్ళే స్థలాలు, కలిసే మనుషులు వగైరా వివరాలన్నీ సేకరించాలి. ఈలోపున సాఫ్ట్ నైట్ రెస్టారెంట్‌ని దర్శించే మనుషులందర్నీ ఫిల్మ్ తీసి, వాళ్ళ

వివరాలు సంపాయించు. ఆ తరువాత చెయ్యాల్సిందేమిటో చెప్తాను."

"ఓ కే! అలాగే సార్!" అంటూ లేచి బయటకు కదిలాడు రంగనాధరావు.

# 8

సాఫ్రు వైట్ బార్ అండ్ రెస్టారెంట్ మూడవ అంతస్తులో దాని ప్రొప్రయిటర్ నూకరాజుకు ఓ ప్రైవేటు రూం వుంది. అది ఫుల్లీ ఎయిర్ కండిషన్డ్. వెల్ ఫర్నిష్డ్.

రోజులో ఇరవై గంటలు రెస్టారెంట్ తెరిచివుంటుంది. అందులో సుమారు పదహారు గంటలు నూకరాజు రెస్టారెంటులోనే వుంటాడు. మిగతా నాలుగు గంటలు, రెస్టారెంట్ని మేనేజరు రంజిత్ కు అప్పజెప్పి, అప్పుడయినా, అర్జంటు పనులుంటే తన బంగ్లాకు ఫోను చెయ్యమని చెప్పి మరీ వెళ్తాడు.

అయితే, ఉన్న ఆ పదహారు గంటల్లో, ఎక్కువసేపు తనకంటూ పెద్దగా పని వుండదు. అలాగని యింటికి పోతే, రెస్టారెంట్ నిర్వహణ కుంటుబడుతుందని నూకరాజుకు తెలుసు. అందుకే రెస్టారెంట్ లో పచార్లు చెయ్యాని సమయాల్లో, తన ప్రైవేట్ రూంకి పోయి కూచుంటాడు.

ఆవాళ ఉదయం ఎనిమిది గంటలకు రెస్టారెంట్ కు వస్తూ, రోడ్డుమీద బ్రేక్ డౌను అయి నిలిచివున్న ఆంధ్రా మెరైన్ ప్రోడక్ట్సు వారి వెహికిల్ ని చూసాడు.

అది, మధ్యాహ్నం ఒంటిగంట తర్వాత, నూకరాజు తనగదికి పోయి ఒక కునుకు తీద్దామని వెళ్ళినపుడుకూడా, యింకా అక్కడే వుంది.

మేడమీది తన గదిలోంచి చూస్తుంటే, ఆ వాహనం

అలా ఆగడంలో ఏదో ప్రత్యేకత వుందనుకున్నాడు సూకరాజు.

చకచకా డెస్క్‌లోంచి బైనాక్యులర్స్ తీసి, ఆ వెహికిల్ మీద కేంద్రీకరించాడు.

ఆ వెహికిల్ తన రెస్టారెంట్ ముఖద్వారానికి యెదురుగా ఆగి వుంది. దాని వెనుక బాడీ అంతా పెట్టెలా మూసేసి వున్నా, పైన చిన్నచిన్న కన్నాలున్నాయి, గాలి పోవడానికి.

అంతేకాదు. తన రెస్టారెంట్ వైపున్న భాగంవైపు, లోన వెలుతురు రావడానికి అన్నట్టుగా, ఓ గ్లాసు ఫ్రేము వుంది.

అది నిజంగా మెరైన్ ప్రోడక్ట్స్ తీసుకెళ్ళే వాహనమైతే బాడీకి అన్నివైపులా పెట్టెలాగు మూసివుంటుంది గాని, పైన కన్నాలున్న సీలింగ్, ప్రక్కన గ్లాసు ఫ్రేములు వున్నాయేం?

గ్లాసుఫ్రేము ఉన్నచోట బైనాక్యులర్స్ కేంద్రీకరించి, వ్యూ మేగ్జిమమ్ కనిపించేలా అమర్చి చూసాడు నిశితంగా.

గ్లాసుఫ్రేములోని గ్లాసు ఉండుండి ప్రక్కకు తప్పుకుంటోంది. తప్పుకున్నప్పుడు అక్కడ నల్లని గుండ్రని మూతిగలదేదో వున్నట్టూ, దాన్నెవరో కదిలిస్తున్నట్టూ, అగపడుతోంది.

ఓ మైగాడ్! తన రెస్టారెంట్‌కు వచ్చే కస్టమర్స్‌ని ఫిల్మ్ తీస్తున్నారు ఎవరో!...ఎవరో యేమిటి? పోలీసులే అయ్యుండాలి.

సూకరాజుకు ఒక్కసారిగా రక్తపుపోటు యెక్కువైపోయింది.

వెంటనే మేనేజరు కౌంటర్ దగ్గర గంటమ్రోగే బజ్జర్ నొక్కాడు.

అయిదు నిముషాల్లో మేనేజర్ రంజిత్ అక్కడ ప్రత్యక్షమయ్యాడు.

"మనం యిప్పుడు ఓ బాంబ్ మీద కూచున్నాం. నువ్వో ఓసారి చూడు" అంటూ బైనాక్యులర్స్ రంజిత్ కు అందించి, రోడ్డుకు అవతలవైపు, తమ రెస్టారెంట్ కు ఎదురుగా నిలిచివున్న వాహనంవైపు వేలితో చూపాడు నూకరాజు.

బైనాక్యులర్స్ అందుకుని రెండు నిముషాలసేపు యజమాని చూపిన వెహికిల్ వైపు చూసి, "మీ రూహించింది నిజమే సార్! మొన్న మన ఖాతాదారు రమాకాంత్ సరుకు పట్టుకెళ్ళినపుడు తనని ఎవరో వాచ్ చేసారని గోల పెట్టాడు, మర్నాడు నా దగ్గరకొచ్చి" అన్నాడు రంజిత్.

"యూ ఫూల్! ఆ విషయం నాతో చెప్పలేదేం?" అన్నాడు నూకరాజు మండిపోయి.

"అవును సార్! చెప్పలేదు. మనవాళ్ళు ఒక్కోసారి వాళ్ళ నీడను చూసికూడా జడుసుకుంటారు సార్. అందుకే చెప్పలేదు. అయినా పరిస్థితి చెయ్యి దాటి పోలేదు. కాబట్టి యేం చెయ్యమంటారో చెప్పండి" అన్నాడు రంజిత్.

"క్షణంగూడాఆలస్యం చెయ్యకుండా మనవాళ్ళందరికీ, ఎలారమ్ సిగ్నల్స్ పంపించు. వాళ్ళ మువ్ మెంట్స్ ఆపొద్దని చెప్పు. కాని, యీ వ్యవహారాలు పూర్తిగా నిలిపెయ్యమని చెప్పు" అరిచాడు నూకరాజు.

పరుగులాంటి నడకతో బయటికి నడిచాడు మేనేజరు రంజిత్, యజమాని ఆర్డర్స్ అమలు జరపడానికి.

# 9

పోలీసు హెడ్ క్వార్టర్స్ రెండో అంతస్తులో ఓ మూలగా వున్న డార్క్ రూం అది.

పదిరోజులుగా స్కైప్రైట్ రెస్టారెంట్ కు వచ్చిన వ్యక్తులపై తీసిన ఫిల్మ్ స్క్రీన్ చెయ్యబడుతోంది.

ఆ రూంలో ఎస్. పీ. సుందర్రామ్, డి. ఎస్. పి. రంగ నాథరావు, ఫిల్మింగ్ చేసిన ఇద్దరు ఇంటెలిజెంస్ ఆఫీసర్లు, సబిన్స్పెక్టరు సీతాపతి, ప్రొజెక్టర్ ఆపరేటర్ వున్నారు.

తెరమీద అవుపించేవాళ్ళల్లో పాత కేడీలు ఎవరెవ రున్నారు, ఉంటే వారిమీద నిఘా వుంచాలా, అక్క ర్లేదా, కొత్తవాళ్ళల్లో ఎవరెవరు అనుమానాస్పదంగా అవుపిస్తున్నారు? వారిలో ఎవరిమీద నిఘా వుంచాలి వగైరా విషయాలు సుందర్రామ్, సీతాపతి రికార్డ్స్ చూసి చెప్పే భోగట్టా ఆధారంగా చెబుతుంటే, నోట్ చేసు కుంటున్నాడు రంగనాథరావు.

సుమారు నాలుగు గంటలు ఏకబిగిన సాగింది ఆ సమా వేశం.

ఆ తరువాత రెస్టారెంటులో మారుమూలల రహస్యంగా పోలీసు డిపార్టుమెంటు అమర్చిన బగ్గింగ్ యెపేరటస్ అందించిన టేప్స్ లోని సమాచారం వినడం మొదలైంది.

టేపు తరువాత టేపు అయిపోతోంది గాని, తమకు కావాల్సిన సమాచారం రవంత చిక్కలేదు.

"వాట్ హేపెన్డ్ మై డియర్ ఫ్రెండ్ ?" ఆఖరి టేపు వినడం అయ్యాక ఎర్రబడిన మొహంతో అరిచాడు సుందర్రామ్, రంగనాథరావు నుద్దేశించి.

పులిని చూసిన లేడిలా వణికిపోసాగాడు రంగనాథ రావు.

"అదే నా కర్థం గావడంలేదు సార్!" అన్నాడు ఎలాగో వణికే కంఠంతో.

"అంటే, మనం వాళ్ళమీద నిఘా పెట్టినట్టు మళ్ళా మనల్ని మనం బైట పెట్టుకున్నామన్న మాట?" పిచ్చిగా అరిచాడు ఎస్. పి. సుందర్రామ్.

"ఏర్పాట్లన్నీ పక్కాగా చేసాం సార్! మనవాళ్ళు ఒక్క తప్పుగూడా చెయ్యలేదు. బగ్గింగ్ యెపేరటస్ కూడా రాత్రిపూట, రెస్టారెంటు మూసివున్న సమయంలో మనవాళ్ళు లోనకు చొరబడి చాలా జాగ్రత్తగా ఫిక్స్ చేసారు" దడదడలాడిపోతున్న గుండెల్ని ఎలాగో చిక్క బట్టుకుని అన్నాడు రంగనాథరావు.

"అంతే సార్!...అంతే సార్!" వంత పలికారు, ఇంటెలిజెన్స్ ఆఫీసర్లు, సబిన్స్పెక్టరు సీతాపతీ.

"ఏమిటి లాభం? ... ఆపరేషన్ సక్సెస్ ఫుల్ బట్ పేషెంట్ డైడ్" గదిలో పచార్లు మొదలుపెట్టాడు విసురుగా సుందర్రామ్.

పావుగంట _ అరగంట _ గడిచింది.

సుందర్రామ్ అలా తిరుగుతున్నాడంటే, యేదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడని అర్థమవుతోంది.

నిస్సహాయంగా ఎస్. పి. సుందర్రామ్ వైపు చూస్తూ నిలుచున్నారు అందరూ.

ఇంకో పావుగంట గడిచింది.

సుందర్రామ్ ఆలోచనల్లోంచి తేరుకొన్నాడు. టకీమని పచార్లు కట్టిపెట్టాడు.

"నూకరాజు, అతని ఖాతాదారు రమాకాంత్ మువ్ మెంట్సు వాచ్ చెయ్యించండి. తతిమ్మా ఆపరేషన్స్ అన్నీ సస్పెండ్ చెయ్యండి," అంటూ ఆర్డర్సు వేసి చివా

లున బయటకు వెళ్ళిపోయాడు తలుపు తోసుకుని.

ఉరుము ఉరిమి, వాన కురిసి వెలిసినట్టయింది, అక్కడున్నవా రందరికీ. పెద్ద నిట్టూర్పు విడిచారు, సుందర్రామ్ వెళ్ళిపోగానే.

# 10

ఎస్. పీ. తీసుకొన్న నిర్ణయం ప్రకారం అన్ని ఆపరేషన్స్ సస్పెండ్ చెయ్యబడ్డాయి. కాని, నూకరాజు, రమాకాంత్ లమీద మాత్రం నిఘా వుంచబడింది.

అయితే, పోలీసు డిపార్టుమెంట్ ఊహాల్ని, అంచనాల్ని పూర్తిగా తల్లక్రిందులు చేసే సంఘటన ఒకటి జరిగింది.

పదిరోజులు తిరగకుండానే, సాఫ్ట్ వైట్ బార్ అండ్ రెస్టారెంటు మూతబడింది. కారణం! సుమారు రెండు లక్షల విలువచేసే నగదు పట్టుకుని, రెస్టారెంటులో పని చేసేవా డొకడు రాత్రికి రాత్రి ఎక్కడికో ఉడాయించాడట.

వాడ్ని పట్టుకోమనీ, తన డబ్బు తన కిప్పించమనీ, ఆ డబ్బు పోవడంతో, తన జీవనాధారం అయిన రెస్టారెంటు మూతబడిందనీ ఓ కంప్లెయింటు యిచ్చాడు నూకరాజు పోలీసులకు.

ఆ తరువాత మనశ్శాంతికోసం బదరీనాథ్, హరిద్వార్ వగైరా ఉత్తరదేశ యాత్రలకు వెళ్ళిపోయాడు.

దాంతో డ్రగ్ ట్రాఫిక్ కేసులో పోలీసులకు మిగిలిన ఒకే ఒక్క లింకు రమాకాంత్, వారం తిరక్కుండానే అతను హత్య చేయబడ్డాడు.

సాఫ్ట్ వైట్ అండ్ రెస్టారెంట్ మూత బడిందనీ, దాని యజమాని నూకరాజు ఉత్తరాది యాత్రలకు వెళ్ళి

పోయాడనీ, రమాకాంత్ అతని గదిలో చచ్చిపడి వున్నాడనీ - రంగనాథరావు యిచ్చిన రిపోర్టు - ఎస్. పీ సుందర్రామ్‌కు కోపం తెప్పించలేదు సరిగదా, ఫెళ్ళున నవ్వసాగాడు, విరగబడి.

ఆశ్చర్యంగా నోరు వెళ్ళబెట్టాడు రంగనాథరావు.

"మన ప్లాన్స్ అన్నీ అప్సెట్ అయ్యాయనీ మేమంతా కంగారు పడుతుంటే, మీరు నవ్వుతారేమిటి సార్?" అనేసాడు ధైర్యంగా రంగనాథరావు.

"అడిగావా?... అడుగుతావని నాకు తెలుసులే" అని ఆగి ఒక్క క్షణం మౌనం వహించి "మనం వెంటాడుతున్నది కరెక్టు గేంగే అని యిప్పుడు రుజువయ్యింది." అన్నాడు సుందర్రమ్.

- "అయితే, నూకరాజు ఎక్కడ కనిపించినా అరెస్టు చెయ్యమని దేశమంతటా ఆర్డర్సు ట్రాన్స్‌మిట్ చేద్దామంటారా?" అడిగాడు రంగనాథరావు ఉత్సాహంతో.

"నో! నో!... ఆ తొందరే వద్దని నేను మొదట్నించీ చెబుతున్నది. ప్రాబ్లమ్ నువ్వనుకున్నంత సింపుల్ కాదు... మనం వల వేసాం చేపలకోసం...మనం వల వేసినట్టు చేపలు గ్రహించి తప్పుకున్నాయి... ఇప్పుడు మనం చెయ్యాల్సింది "ఒక ధ్యానం"... అంటే, మనం చల్లబడి పోయామని డ్రగ్ ట్రాఫికర్స్ అనుకుని మళ్ళీ వ్యాపారాలు తిరిగి ఆరంభించేదాక మనం రెస్టు తీసుకోవాలి. కాని అప్రమత్తులమై ఉండాలి" వివరించాడు సుందర్రామ్.

"అంటే మీ ఉద్దేశంలో నూకరాజు అండర్‌గ్రౌండ్ లోకి వెళ్ళిపోయాడనీ, డబ్బు తీసుకుని పనివాడు పరారయి

పోయాడన్నది రెస్టారెంట్ మూసెయ్యడానికి తయారు చేసిన నాటకం అనీ, రమాకాంత్ పోలీసులకు చిక్కి, తమ రహస్యాలు యెక్కడ వెళ్ళగక్కేస్తాడో అని, అతడ్ని అంతం చేశారనీ అంటారు" అన్నాడు రంగనాథరావు.

"రైట్!... చాలా రోజుల తర్వాత నా వూహాల్ని కరెక్టుగా గ్రహించావు. యూ ఆర్ పికింగప్ వెల్!" అంటూ రంగనాథరావుకు ఓ మెచ్చుకోలు పారేసాడు సుందర్రామ్.

చాలా అరుదుగా తన సబార్డినేట్సుని మెచ్చుకుంటాడు సుందర్రామ్ అని రంగనాథరావుకు తెలుసు.

"అయితే ప్రస్తుతం మన కర్తవ్యం యేమిటి?"

"యేముంది సిట్ అండ్ రిలాక్స్... చేతులు ముడుచుకుని కూచున్నట్టు మనం అవుపించాలి... అంతే! లెటజ్ డిస్పర్స్" అన్నాడు సుందర్రామ్.

# 11

ఇంచు మించు సంవత్సరం గడిచి పోయింది. పోలీసు డిపార్టుమెంటు మత్తుమందు వ్యాపారస్తుల విషయం పూర్తిగా మరిచిపోయినట్టే ప్రవర్తింప సాగింది.

కొన్నాళ్ళపాటు హిరోయిన్ వ్యాపారం పూర్తిగా అంతరించి పోయినట్టు అవుపించింది. కాని, ఆ తరువాత మెల్లగా మొదలై వేగం పుంజుకోసాగింది.

వాల్తేరు ఆప్ లాండ్స్‌లో హోటల్ విశ్రాంతి అనే కొత్త హోటలు వెలిసింది. రుచికరమైన భోజనానికీ, తృప్తికరమైన సదుపాయాలకీ, అందమైన కేబెరా డాన్సులకీ నెల తిరగకుండానే పేరు సంపాయించుకుంది ఊర్లో.

ఆ హోటలు యాజమాన్యం నూకరాజు చేతిలో లేదు. కాని, రంజిత్ మాత్రం, పూర్వపు అనుభవం దృష్ట్యా ఆ హోటలుకు మేనేజరుగా నియమింపబడ్డాడు.

అయితే, ఆ హోటలుకి అప్పుడప్పుడు నూకరాజు వస్తూ పోతున్నట్లు, ఒకరిద్దరి పోలీసాఫీసర్ల కంటబడింది. ఆ వార్త ఎస్. పీ. సుందర్రామ్ కూ్కడా అందజేయ బడింది.

"ఇంకా కొన్నాళ్ళు ఆగండి. చేపల్ని ధైర్యంగా పైకి తేలి నిర్విచారంగా యీదనివ్వండి. అప్పుడు చూసు కొందాం" అన్నాడు సుందర్రామ్.

నూకరాజు యిప్పుడు మునుపటి నూకరాజు కాదు. ఒక నాడు నూటల్లో తప్పు అవుపించని వ్యక్తి యిప్పుడు పూర్తిగా మారిపోయాడు. ఆధ్యాత్మిక జీవితంవైపు ఆసక్తి పెరిగినట్టుంది, కాషాయరంగు బట్టల్లో తప్ప కని పించడంలేదు. మెడలో రుద్రాక్ష తావళం గెడ్డాలు, మీసాలు యేపుగా పెంచుకొన్నాడు.

పచ్చని ఒంటి రంగు, కాంతి వంతమైన పెద్ద కళ్ళు, పొడవుగా, సన్నగా ఉండి కొనదేలిన ముక్కు, గుండ్రని నున్నని బుగ్గలతో ఉన్న నూకరాజుకి కొత్త వేషధారణ, ఎంతో ఠీవి, దర్జా, హుందాతనం చేకూర్చాయి.

ఇప్పుడు నూకరాజు దినంలో మూడొంతులు దేవాల యాల్లో గడపడం, సాధువులు, బాబాలు, యోగులూ యిచ్చే ఉపన్యాసాలకు హాజరు కావడం చేస్తున్నాడు.

అందరూ సహకరిస్తే, దైవం అనుకూలిస్తే, త్వరలో ఓ రామాలయం కట్టించడానికి తాను సంకల్పించుకొన్నా నని, అందరికీ చెప్తూ, తన పాత స్నేహితుల దగ్గర

అప్పుడప్పుడు చందాలు వసూలు చెయ్యసాగాడు. అవన్నీ పోలీసు డిపార్టుమెంటు జాగ్రత్తగా గమనిస్తూనే వుంది.

"మిమ్మల్నో వ్యక్తి అర్జంటుగా చూడాలంటున్నాడు. మీతో తప్ప యింకెవరితోనూ మాట్లాడడట," చెప్పాడు రంగనాధరావు.

"సెండ్ హిమ్ ఇన్..." అన్నాడు ఎస్. పి. సుందరాామ్.

"అలాగే సార్!" అంటూ బయటికి నడిచాడు రంగనాధరావు.

అయిదు నిముషాలు నడిచాక, అప్పుడే కొట్టితెచ్చిన మాంసం ముక్కలా ఎర్రగా, పొట్టిగా, లావుగా, పెద్ద బొజ్జతోఉన్న సుమారు నలభై యేళ్ళున్న వ్యక్తిని వెంట బెట్టుకుని, ఎస్. పి. ఛాంబరులోకి వచ్చాడు రంగనాధ రావు. ఆ వెనుక సబిన్స్పెక్టరు సీతాపతి వచ్చాడు.

నలిగిన బట్టలు, చెదరిన జుత్తు, బెదురుచూపులతో వచ్చిన నూతన వ్యక్తిని ఎగా దిగా చూసి "ఏం? ఎందుకూ?... నాతో మాట్లాడాలన్నారుట?" అన్నాడు సుందర్రామ్ కొంచెం కటువుగా.

"సార్! దయచేసి నన్ను కూర్చోనియ్యండి...మీతో చాలా విషయాలు మాటాడాల్సి ఉంది," చెప్పాడు ఆ వ్యక్తి ఏడుపుతో బొంగురు పోయిన గొంతుకతో.

అవతలి వ్యక్తి అంతులేని దుఃఖంలో ఉన్నాడని గ్రహించిన సుందర్రామ్ క్షణంలో కరిగి పోయాడు.

"తప్పకుండా! తప్పకుండా! కూచోండి" అంటూ తన ఎదుటి కుర్చీ ఆఫర్ చేసాడు.

ఆ వ్యక్తి కుర్చీలో కూలబడుతూనే, చేతుల్లో మొహం దాచుకుని యేడవ సాగాడు.

అతన్ని సుందరామ్ ఓదార్చ ప్రయత్నించలేదు. దుఃఖాన్ని నిగ్రహించుకోవడంకన్నా, బయటకు కన్నీటి రూపంలో రానివ్వడమే నరాలకు మంచిదని శాస్త్రజ్ఞులు చెప్పినట్టు చాలా పుస్తకాల్లో చదివాడు సుందరామ్.

సీతాపతి నూతన వ్యక్తికి వెనకాల నిలున్నాడు గార్డ్ చేస్తున్నట్టుగా.

రెండు క్షణాలు పోయాక ఆ వ్యక్తే, తనను తాను నిగ్రహించుకొని "క్షమించండి సార్!... ఆపుకోలేక పోయాను" అంటూ క్షమాపణలు చెప్పుకొన్నాడు.

"ముందు...మీ పేరేమిటో. మీ రెవరో...వగైరా చెప్పి, ఆ తరువాత మీరు చెప్పదల్చుకొన్నది చెప్పండి" అన్నాడు ఎస్. పి. సుందరామ్.

"చెప్తాను సార్! చెప్తాను...అందుకేగా వచ్చింది. నా పేరు చిన్ని అంటారండి...యూనివర్సిటీ ఏరియాలో చిన్ని దుకాణం అంటే తెలియని వారుండరండి... నేను మీ కిప్పుడు చెప్పబోయేది...చాలా ప్రమాదకరమైందండి...మీరు నన్ను కాపాడతారని మాటిస్తేగాని లాభం లేదండి," అని ఆగి గట్టిగా ఊపిరి పీల్చాడు.

అతడికి బ్రీదింగ్ ట్రబుల్ ఉందనీ, ఏకబిగిన మాటాడ లేడనీ అర్థం చేసుకొన్నాడు సుందరామ్.

"అలానే! తప్పకుండా!... చెప్పండి" అంటూ సుందరామ్ హామీ యివ్వగానే, మొదలు పెట్టాడు మళ్లా చిన్ని.

"నేను పవుడరు వ్యాపారం చేస్తుంటానండి"

"అంటే?..." చిన్ని మాటను కట్ చేస్తూ అడిగాడు సుందరామ్.

"అదేనండిం...హిరోయిన్...యూనివర్సిటీ స్టూడెం ట్లందరికీ నేనే సప్లయి చేస్తానండి," వివరించాడు చిన్ని.

ఆ విషయం వినగానే, అక్కడున్న అందరి ముఖాలు ఒక్కసారిగా వెలిగాయి.

"ఆ కేసు యెప్పుడో మూసేసామే... ఆ వివరాలెం దుకు చెప్తున్నారు మాకు?" నైస్‌గా అబద్ధమాడాడు సుందర్రామ్.

"సార్! నాకు రోజులు దగ్గర పడ్డాయండి...నన్ను వాళ్లు చంపేస్తారు...మీరు రక్షిస్తారన్న కొండంత ఆశతో వచ్చాను" చేతులు జోడించి నమస్కరిస్తూ అన్నాడు చిన్ని.

"వాళ్ళు అంటున్నావు...యెవరు వాళ్ళు?"

"నూకరాజు, రామశర్మ... యీ వ్యాపారానికి వాళ్ళి మూలవిరాట్టులు అంటారు."

"రామశర్మ యెవరు?" అడిగాడు సుందర్రామ్. కొత్త పేరు చెవిన పడగానే.

"నూకరాజుకు కుడిభుజం...విజయవాడలో ఆపరేట్ చేస్తుంటాడు."

"ఇంతకూ నూకరాజు యెక్కడ్నించి తెస్తున్నాడు యింతపాటి సరుకు?"

"హిరోయిన్ నల్లమందు నుంచి తయారవుతుందని మీకు తెలుసను కుంటాను...నల్లమందు మనకు దగ్గరలో నేపాల్ నుంచి బాగా దొరుకుతుంది. ఇంతకుముందు నేపాల్‌లోనే హిరోయిన్ తయారై మన దేశం వచ్చేది. కాని, లేబరేటరీ యిక్కడే ఆంధ్రదేశంలోనే వుందట యిప్పుడు."

"ఓ మైగాడ్!"

చిన్ని మాటలు వింటూనే ముగ్గురు పోలీసాఫీసర్లు ఒకే సారి అన్నారు, తమ ఆశ్చర్యాన్ని కప్పిపుచ్చుకోలేక.

"అందుకే నన్నుమాట...అంత విస్తారంగా దొరుకుతోంది యిప్పుడు ఆంధ్రదేశంలో" అన్నాడు సుందర్రామ్ ఆశ్చర్యంనుంచి తేరుకుని.

"అంతేకాదు సార్!... మనవాళ్ళు మిగతా రాష్ట్రాలకు సప్లయి చేయాలన్న తలంపుతో ఉన్నారు."

"ఇన్ని వివరాలు మీ కెలా తెలాసు?"

"మొదట నేను నేపాల్ నుంచి నల్లమందు స్మగ్లింగ్ చేసే గేంగ్ లో ఉండేవాడ్ని. యీ బ్రీడింగ్ ట్రబుల్ మొదలవడంతో, తిరుగుళ్ళు చాలా కష్టమనిపించింది. చిల్లర వ్యాపారం చేయగా వచ్చేది చాలని ఊరుకున్నాను. ఈ వ్యాపారంలో కాస్త పాత పిల్లినేమో, చాలామందిని నాకు తెలును."

"ఇంతకూ వాళ్ళు నిన్నెందుకు చంపాలనుకుంటున్నారు?"

"యేముంది సార్!...యెవడో ఆకాశరామన్న ఉత్తరం రాసాడు నూకరాజుకి. 'నీ వ్యాపారం గురించి యావత్తు తెలిసిన మీలోవాడే పోలీసులకు చెప్పేసాడు జాగ్రత్తగా ఉండండి' అంటూ. దానితో నూకరాజు తన ఆరాలు ఆరంభించాడు. ఎందుకు అనుమానించాడో తెలీదుగాని, చంపడానికి నన్ను మార్కు చేసినట్టుగా, నా హోటెషి ఒకడు వార్త అందించాడు."

"పోలీసులకు నేనేం చెప్పలేదంటూ వెళ్ళి మీ బాస్ తో చెప్పలేక పోయారా?"

"సార్! యీ వ్యాపారం చేసే మనుషుల సంగతి

మాకు తెలీదుసార్. రమాకాంత్ వెనకాల మీరు పడ్డా రని తెలియగానే, దొరికితే, అతనేం రహస్యాలు బయటికి కక్కేస్తాడో అని అతడ్ని చంపేసారు వాళ్ళు. ఇహ నా విషయంలో వాళ్ళకు తిరుగులేని అనుమానం కలిగింది. నేను వెళ్ళి అడిగితే, నా మీదున్న అనుమానం బలపడ్డమే గాకుండా, నాకు సమాచారం అందించిన వాడొకడున్నా డని గ్రహించి, వాడ్ని కనిపెట్టి వాడ్నికూడా చంపు తారు.''

సుందర్రామ్ గుండె దిగులుతో బరువెక్కించి డ్రగ్ బిజినెస్‌లోని మనుషుల కర్కోటకతనం అర్థమై.

"అయితే, మీ కెలాంటి రక్షణ కావాలంటారు?''

"వెంటనే నన్ను అరెస్టు చెయ్యండి. లాకప్పులో పెట్టండి. నాకు బయటకన్న జైలే నయం... కొన్నాళ్లు బ్రతుకుతాను అలాగయినా'' అన్నాడు చిన్ని ఆవేశంగా.

"మిమ్మల్ని అరెస్ట్ చెయ్యడం కుదరదిప్పుడు. మీకు రక్షణ ఏర్పాటు చేస్తాము. మీ మీద వాళ్ళు పడబోతా రన్నప్పుడు వాళ్ళను పట్టుకొంటాం. నిన్ను అరెస్టుచేస్తే మిగతా వాళ్ళు మా చెయ్యి జారిపోతారు. కాబట్టి యెప్ప టిలా మీ పనిలో ఉండండి,'' చెప్పాడు సుందర్రామ్.

"లేదు సార్!... నేను బయటకు వెళితే బతకను'' మళ్ళా ఏడవసాగాడు చిన్ని.

"మీ ప్రాణానికి నా ప్రాణం మిస్టర్ చిన్ని... వెళ్ళండి...మామాట మీద నమ్మకం ఉంచండి'' అంటూ సుందర్రామ్ లేచి చిన్ని బుజం తట్టి ధైర్యం చెప్పేంత వరకు చిన్ని కాంత బడలేదు. అప్పుడుగాని, మామూ లుగా ఊరిలో తిరుగాడ్డానికి ఒప్పుకోలేదు.

"సీతాపతీ!" సుందర్రామ్ పిలిచాడు.

అంతవరకూ చెక్కినశిల్పంలా ఎటెన్షన్‌లో నిలుచున్న సీతాపతిలో చలనం కనిపించింది. "యస్ సార్!" అన్నాడు.

"చిన్నిని నీ ఆఫీసు రూంకి తీసుకెళ్ళు. స్టేట్‌మెంట్స్ తీసుకో" అని ఆర్డరిచ్చి "మిస్టర్ చిన్నీ!...మీ సాయం కావాలి...సీతాపతి అడిగే స్టేట్‌మెంట్సు యివ్వండి" అన్నాడు సుందర్రామ్, చిన్ని వైపుకు మళ్ళా తిరిగి.

చిన్ని తలూపి లేవగానే, సీతాపతి అతన్ని వెంట బెట్టుకుని వెళ్ళిపోయాడు బయటికి.

వాళ్ళలా వెళ్ళిపోగానే "నూకరాజు మీద ఆ ట్రిక్ ప్లే చేసింది యెవరంటావ్?" అడిగాడు సుందర్రామ్, రంగనాధరావుని.

రంగనాధరావు మాటాడలేదు. కాని, యేదో చెప్ప దలుచుకున్నట్టు అవుపించాడు.

"నీ మనసులో యేదో ఉంది. చెప్పేయ్. సందేహించక" అన్నాడు సుందర్రామ్, రంగనాధరావు మనోస్థితి అర్థమై.

"నేనే సార్ ఆ ఉత్తరం రాసింది" చెప్పేసాడు రంగనాధరావు.

"వాట్?" నోరు తెరుచుకుని ఆశ్చర్యంతో ఉండి పోయాడు సుందర్రామ్.

"అవును సార్!...మీతో ముందుగా చెప్పలేదు. నా ట్రిక్ పని చేస్తుందో లేదో చూసాక చెప్పవచ్చునని ఊరుకొన్నాను...ఒకసారి అమెరికాలో అపరేట్ చేసే రష్యన్ గూఢచారుల్ని కలవర పెట్టడానికి, అమెరికా

యిలాంటి ట్రిక్కే ప్రయోగించింది. రష్యాలోఉన్న తమ గూఢచారి, అమెరికాలో అపరేటు చేసే రష్యన్ గూఢచారుల వివరాలన్నీ సేకరించి తెలియజేసినట్టుగా ప్రకటించింది...

అది టైమ్ మేగిజైన్‌లో చదివాక నా కీ ఆలోచన వచ్చింది...ఎంత చేసినా మన దర్యాప్తు ఒక్క అంగుళం ముందుకు సాగడంలేదు... ఒక్క ఆకాశరామన్న ఉత్తరం రాస్తే - వాళ్ళల్లో వాళ్ళకి ఒకరి మీద ఒకరికి అపనమ్మకాలు యేర్పడి, అనుమానాలు మొదలై, చివరకు ఎవరో ఒకరు అన్నీ తెలిసినవాడు పోలీసుల రక్షణకోసం వస్తాడని వూహించాను.'' చెప్పాడు రంగనాధరావు.

''యూ హేవ్ టేకెన్ టూమచ్ రిస్క్!...యూనో దట్?'' అన్నాడు సుందర్రామ్.

''కాని. అందుకు సిధ్ధపడే సాహసించాను'' సిరచిత్తంతో అన్నాడు రంగనాధరావు.

''దెన్ యూ టేకోవర్ ఎంటైర్ ఆపరేషన్!''

''యస్ సార్! ఇఫ్ యూ పెర్మిట్ మీ!'' సవాలు అందుకున్నట్టుగా అన్నాడు రంగనాధరావు.

''ఓకే దెన్!...కేరీ ఆన్!...బెస్టాఫ్ లక్'' అన్నాడు సుందర్రామ్ తన చెయ్యి ముందుకు చూచి.

''థేంక్యూ!...థేంక్యూ వెరీమచ్!''

సుందర్రామ్ చెయ్యి అందుకోలేదు రంగనాధరావు. గౌరవంగా, వినయంగా తలవంచి, ఎటెన్షన్‌లో నిలబడి అన్నాడు.

## 12

చిన్ని యిచ్చిన స్టేట్‌మెంటు ప్రకారం, ఆంధ్రదేశంలో సాగుతున్న హిరోయిన్ వ్యాపారానికి మూల

విరాట్టులు ఇద్దరు. ఒకరు నూకరాజు, రెండోవాడు మొట్ట మొదటిసారిగా పోలీసు డిపార్టుమెంటు కోటీసుకు వచ్చిన రామశర్మ.

రామశర్మ విజయవాడనుంచి ఆపరేట్ చేస్తుండడం వల్ల కాబోలు, విశాఖలో యింతవరకూ సాగిన దర్యాప్తులో, అతనిసంగతి బయటపడలేదు.

అయినా, వీరి ఇద్దరి గురించి తిరుగులేని సాక్ష్యాధారాలు సేకరించడానికి తీర్మానించుకున్నాడు రంగనాథరావు.

విజయవాడలో రామశర్మ గురించి ఎవిడెన్స్ సంపాయించడానికి, అక్కడి పోలీసుశాఖకి, తగిన ఆర్డర్స్ పంపాడు రహస్యంగా.

దీనికంతటికీ నూకరాజు చీఫ్ అని తెలుస్తోంది. అయితే, అతని అవతారం మార్చుకు, అంటే, కాషాయ వస్త్రాలు ధరించడానికి, ఊళ్ళోకి వచ్చే సాధుసన్యాసుల వెంట తిరగడానికి_యేదో గట్టి కారణం ఉండి ఉంటుంది అనుకున్నాడు రంగనాథరావు.

అయితే, యేమిటది?

నూకరాజు వేసే ప్రతి అడుగునీ పరిశీలించి రిపోర్టు చెయ్యడానికి, ఊరినిండా పోలీసాఫీసర్లని మారువేషాల్లో త్రిప్పాడు.

నూకరాజు హోటలు విశ్రాంతికి తరుచు వెళ్ళడం నిజమేగాని, అలా వెళ్ళడం అతని పాత స్నేహితుల్ని కలుసుకోవడానికి వెళ్తున్నట్టుగా ఉందిగాని, మత్తుమందు వ్యాపారంతో సంబంధం ఉన్నట్టుగా లేదు.

అలాగే, ఊరిలోని అతని కదలికల్ని ఎంత వాచ్ చేసినప్పటికీ ఫలితం లేకపోయింది.

నూకరాజు కాషాయ గుడ్డల వేషం వెనుకవున్న రహస్యాన్ని ఛేదించడానికి చివరకు సబిన్స్పెక్టరు సీతాపతిని నియమించాడు రంగనాథరావు.

ఆరునెలల కోసారయినా తిరుపతి వెళ్తాడు నూకరాజు. మూడునెలల కోసారయినా, బెజవాడ కనకదుర్గను చూసి వస్తేగాని ఉండలేడు అతడు. కనీసం రెండునెలల కోసారయినా, విశాఖపట్నానికి ముప్పై అయిదు మైళ్ళ దూరంలో పుణ్యగిరిలో ఉన్న ఈశ్వరానంద ఆశ్రమానికి వెళ్ళివస్తేగాని ఊరుకోడు.

నూకరాజుతో పాటుగ తిరుపతి, బెజవాడ వెళ్ళి వచ్చాడు సీతాపతి రహస్యంగా.

తన పార్టనర్ రామశర్మను కలిసి మాట్లాడ్డం తప్ప నూకరాజు ప్రవర్తనలో ప్రత్యేకత యేమీ కనపడలేదు సీతాపతికి, బెజవాడలో.

అయితే ఆ బ్రహ్మరహస్యమేదో, పుణ్యగిరి ట్రిప్ లోనే ఉండాలనుకున్నాడు.

అయితే, నూకరాజుతో వెళ్ళకుండా ఓసారి ముందు వెళ్ళి ఈశ్వరానంద ఆశ్రమాన్ని చూసివస్తే బావుంటుందనుకున్నాడు.

ఓ ఏకాదశి రోజున, యాత్రికులు దండిగా పుణ్యగిరి దర్శించే రోజున బయలుదేరి వెళ్ళాడు పుణ్యగిరికి.

పుట్టుధార, కోటిలింగాలు, దారప్పలోయల్లో స్నానం చేసాక "బాబా! ఇక్కడ ఈశ్వరానందగారి ఆశ్రమం ఉందట. యెక్కడండీ?" అని అడిగాడు సీతాపతి ఓ యాత్రికుడ్ని.

"పుట్టుధారకు పైన ఉందండి!" చెప్పాడు యాత్రికుడు.

"అంటే, నేను మళ్ళా వెనక్కి వెళ్ళాలా?" అడిగాడు సీతాపతి.

"అందరూ అలాగే వెళ్తారండి...మీరుకూడా అలాగే వెళ్ళండి" చెప్పాడు యాత్రికుడు.

ఈసురో మనుకుంటూ తిరిగి పుట్టుధార దగ్గరకు వెళ్ళాడు సీతాపతి. యాత్రికుడు చెప్పినట్టుగా పుట్టు ధారకు పైకి రావడానికి ఓ దోవఉంది. కొంతమంది యాత్రికులు పైకి వెళ్తూ, కనిపించారు కూడా.

సీతాపతి కూడా వారు వెళ్తూవున్న దోవనే బయలు దేరాడు.

ఈశ్వరానంద ఆశ్రమం సుమారు వెయ్యి చదరపు గజాల జాగాలో చుట్టూ దట్టంగా పెరిగిన వృక్షసము దాయాల మధ్య, పూలమొక్కలమధ్య ఆదర్శవంతంగా కట్టబడి ఉంది.

ఆశ్రమం ప్రవేశించగానే, ఆ వాతావరణంలో జాలు వారే ఆధ్యాత్మికత్వం, మనస్సుని పట్టేటట్టుగా ఉంది.

ఆశ్రమంలో ప్రవేశిస్తూ "ఒకనాడు నూకరాజు మత్తు మందుల వ్యాపారం చేసిన మాట నిజమేగాని యిప్పుడు నిజంగా మారిపోయాడేమో?...తను అనవసరంగా అతడ్ని అనుమానిస్తున్నాడేమో?" అనుకున్నాడు సీతా పతి.

ఆ భావన, ఆశ్రమంలోని యేర్పాట్లు చూసాక మరింత దృఢపడింది. వచ్చిన యాత్రికులకు ప్రసాదం పేరిట ఏదో ఓ పండు ఆశ్రమం యిస్తోందిగాని, యాత్రికులు యిచ్చేవేవీ బొత్తిగా పుచ్చుకోవడంలేదు.

ఈశ్వరానంద కుటీరంలోకి వెళ్ళాడు సీతాపతి.

ఒకరి తర్వాత ఒకరు స్వామివారికి నమస్కారాలు చేసి, ఆశీర్వాదాలు పొంది, వెళ్ళిపోతున్నారు.

సీతాపతికూడా మెల్లగా స్వామివారి దగ్గరకు వెళ్ళాడు. చేతులు మోడ్చి, సాష్టాంగ ప్రణామం చేసాడు. లేస్తూ, స్వామివారి మొహంలోకి చూసాడు.

మేలిమి బంగారు కాంతితో వెలిగిపోతోంది స్వామి వారి మొహం. ఒత్తుగా పెరిగిన కారునలుపు గడ్డాలు. మీసాలమధ్య ఆ మొహం, మబ్బులు ముసిరిన చంద మామలా ఉంది.

అయితే, అంత అందమైన చందమామలో మచ్చ ఉన్నట్టుగా, స్వామివారి పై పెదవిమీంచి దవడమీదకు ప్రాకిన ఓ గంటుఉంది.

స్వామివారి రూపాన్ని మనస్సులో నిక్షిప్తం చేసు కుందామని, సీతాపతి కళ్ళు మూసుకుంటే, స్వామివారి రూపానికి బదులు, ఆ గంటే అవుపిస్తోంది.

సీతాపతి బయటికి వచ్చేసాడు.

ఈశ్వరానందగారి కుటీరానికి వెలుపలవున్న ఓ చెట్టు కిందఉన్న బండరాయిమీద కూచుని, తను వచ్చిన పని గురించి ఆలోచించ సాగాడు. కాని, అతని ఆలోచ నలు, స్వామివారి మొహంమీది గంటు చుట్టూ ముసురు తున్నాయి, ఎంత వద్దనుకుంటున్నా.

ఇంతకూ, ఆ గంటు యెలా మేర్పడింది?

ఏదో ఏక్సిడెంట్ వల్లనేమో? సమాధానం చెప్పు కొన్నాడు సీతాపతి.

కాని, అదే సమయంలో స్వామివారి కుటీరంలోనుంచి ఓ శిష్యుడు బయటికొస్తూ అవుపించాడు.

స్వామివారి మొహంమీది గంటుకు కారణం అతడ్ని అడగాలనిపించింది సీతాపతికి.

"క్షమించాలి!" అన్నాడు సీతాపతి, అతన్ని ఉద్దేశించి.

"నేనా?...యెందుకూ?" అంటూ అతడు వెనుదిరిగాడు అతడి కుడి కనుబొమ తమాషాగా పైకిలేచి పడుతోంది, అతడు మాటాడుతుంటే.

సీతాపతి మెదడులో చిన్న బల్బ వెలిగినట్టయింది.

అవును. ఆ ముఖం తనకు పరిచయమే. ఆ వ్యక్తిని తనెక్కడో చూసాడు.

అయితే, యెక్కడ?

తన జ్ఞాపకశక్తిని నిశిత పరీక్షకు పెట్టాడు కాసేపు.

"యేం?...మాట్లాడరేం?...యేంకావాలి?" కనుబొమ యెగరేస్తూ, దగ్గరకొచ్చి అన్నాడు ఆ శిష్యుడు.

అవును!...అతనే!...సందేహంలేదు...ఓ సారి తను రాజమండ్రి సెంట్రల్ జెయిల్‌కు ఓ నేరస్తుడ్ని అప్పజెప్పడానికి వెళ్ళినప్పుడు అక్కడో దొంగని చూసాడు. ఆ వ్యక్తికీ, యితనికీ, చాలా దగ్గర పోలికలు ఉన్నాయి.

వెళ్ళి, ఈశ్వరానందగారి తతిమ్మా శిష్యుల్ని కూడా చూడాలనిపించింది సీతాపతికి.

"యేంలేదండీ!...దాహం వేస్తోంది...మంచినీళ్ళు దగ్గరలో యెక్కడ దొరుకుతాయో అడుగుదామని" అబద్ధం ఆడాడు సీతాపతి.

"అదుగో! అక్కడ..." అంటూ అక్కడున్న యింకో కుటీరంవైపు చెయ్యి చూపి వెళ్ళిపోయాడా శిష్యుడు.

సీతాపతికి, ఆ ఆశ్రమంమీద అనుమానాల తుప్ప రేగింది.

వెంటనే లేచి, స్వామివారివద్ద కూచున్న మిగతా శిష్య గణాన్ని పరిశీలించడానికి, మళ్ళా స్వామివారి కుటీరంలోకి వెళ్ళాడు.

యాత్రికులకు బాగా వెనుగ్గా నిలబడి, ఒక్కొక్క శిష్యుడ్ని నిశితంగా పరిశీలించసాగాడు.

అందరి మొహాలు గడ్డాలు మీసాలతో ఉండటం వల్ల, పోలీసు రికార్డ్సు ఉన్న కొందరి నేరస్తుల మొహాలు తనకు గుర్తున్నా, వారిని పోల్చుకో గలిగే అవకాశం లేదు.

అయితే, యేం చెయ్యడం?...ఓ అయిడియా వచ్చింది బాగా ఆలోచించగా. వెంటనే తన దగ్గరున్న కెమెరాను రెండు మూడు కోణాల నుండి క్లిక్ మనిపించాడు, ఎవరూ గమనించకుండా.

# 13

తీసుకెళ్ళిన ఫొటోల్లోని ఒక్కొక్క మనిషి బొమ్మ ఎన్లార్జ్ చేయించి, పోలీసు రికార్డ్సులోని, నేరస్తుల ఫోటోలతో పోల్చి చూసేసరికి, ఆ ఆశ్రమంలో ఉన్నవాళ్ళందరూ, పాత నేరస్తులని తేలిపోయింది సీతాపతికి.

స్వామి ఈశ్వరానంద ఒకనాడు విజయవాడలో పెద్ద పేరుమోసిన గుండా. ఒకసారి యింకో గుండాతో అతనికి వచ్చిన తగూలోనే, ఆ మొహంమీద ఉన్న ఆ గంటు ప్రసాదింపబడింది, అవతలివాని కత్తిచేత.

అలాగే, అతని శిష్యుల్లో ప్రతి ఒక్కరూ, ఏదో ఓ క్రిమినల్ కేసులో, రెండు నుంచి పదేళ్ళ వరకు, జైలు గాలి పీల్చి బయటికొచ్చినవారే.

అయితే, యీ నేరస్థుల కూటమి, ఆశ్రమంలో ఉండి యేం చేస్తున్నట్టు?

నూకరాజు కేవలం వాళ్ళను కలుసుకుని కబుర్లాడ్డానికే, రెండు నెలలకో పర్యాయం క్రమం తప్పకుండా, అక్కడకు వెళ్తున్నాడని అనుకోవడానికి వీల్లేదు.

అంచేత, పిరియాడికల్‌గా, వాళ్లు కలుసుకోవడంలో యేదో విశేషం ఉంది. ఉంటే యేమిటది?

ఓ రోజున నూకరాజు ఆశ్రమానికి వచ్చినపుడు యేం జరుగుతుందో చూస్తే గాని, ఆ రహస్యం వీడిపోదు.

నూకరాజు ఈశ్వరానంద ఆశ్రమానికి ఎప్పుడు వెళ్ళినా, ఆ రాత్రి ఆశ్రమంలో ఉండిగాని మరునాడు రాడు.

అంచేత, ఈ సారి నూకరాజు ఈశ్వరానంద ఆశ్రమానికి వచ్చినపుడు, తను వెళ్లి చూడాలి అనుకున్నాడు సీతాపతి.

ఓ రోజు సాయంకాలం అరవుతుండగా, నూకరాజు విశాఖపట్నం వదిలి, ఈశ్వరానంద ఆశ్రమానికి కార్లో వెళ్తున్నాడని వార్త వచ్చింది.

సబ్ ఇన్‌స్పెక్టర్ సీతాపతి, డి. ఎస్. పి. రంగనాథ రావు ఓ ప్రైవేటు కారు అద్దెకు తీసుకుని బయలుదేరారు వెంటనే.

రాత్రి తొమ్మిదవుతుండగా, శృంగవరపు కోట చేరుకున్నారు యిద్దరూ.

కారుని, శృంగవరపు కోట పోలీసు స్టేషను కస్టడీలో ఉంచి "మీలో పుణ్యగిరిని బాగా తెలిసినవారెవరున్నారు?" అని అడిగాడు రంగనాథరావు స్టేషనులో ఉన్న జవాన్ల నందర్నీ సమావేశపరచి.

వెంకటస్వామి అనే జవాను ముందుకొచ్చి "నాకు బాగా తెలుసు సార్" అన్నాడు సాల్యూట్ చేసి.

"ఓకే!...యివాళ నీ డ్యూటీ మాతోనే...రా!" అంటూ అతన్ని మఫ్టీలో వెంటబెట్టుకుని పుణ్యగిరికి బయలు దేరారు.

అది డిసెంబరు మాసం చలి తీవ్రంగా ఉంది. అయినా చలిని తట్టుకోవడానికి భారీ యెత్తున యేర్పాట్లు చేసుకునే బయలుదేరారు వాళ్లు.

ముగ్గురికి సరిపోయేలాగు, మూడు పెద్ద ఫ్లాస్కులనిండా టీ పోయించుకున్నారు. రాత్రికి ఆకలేస్తే, తినడానికి బిస్కట్టు పాకట్లు పట్టుకున్నారు. పుల్ ఓవర్స్ వేసుకుని, తలకు మఫ్లర్లు చుట్టుకొన్నారు.

"ఈశ్వరానంద చాలా మహత్తు గలవాడని చాలా మంది విశాఖపట్నంలో చెప్పుకుంటున్నారు. వారిలో ఉన్న గొప్పతనం యేమిటి?" అన్నాడు రంగనాథరావు, వెంకట స్వామి లోకల్ మేన్ గదా, అదనంగా యేమన్నా చెప్ప గలదేమోనని.

"గొప్పతనం యేమిటి అంటారేమిటిసార్?...మిగతా సాధువుల్లాగ, భక్తులిచ్చే పైసలకు కక్కుర్తి పడరు సార్! అంతేకాదు... వారికి ప్రచారం అంటే గిట్టదు. బాబాలకు, సాధూలకు మొక్కకండి... మీలోనే ఆ దేవుడున్నాడు ... తెలుసుకోండి అంటారు తనవద్దకు వచ్చిన వాళ్ళతో...

కొంతమంది అతనికి శిష్యులుగా చేరటానికి కూడా వచ్చారు. వాళ్ళతో యేమన్నారో తెలుసా సార్?... యీ శిష్యులకే మోక్షం ప్రసాదించడానికి నేను నానా తంటాలు పడుతున్నాను...ఇహ కొత్తవాళ్లను చేర్చుకో లేనని పంపించి వేసారు...

ఇంకో విశేషం సార్!... పూర్వం ఋషులు అడవులకు పోయి తపస్సు చేసుకునే వారట... అలాంటి వాళ్లు యీ మధ్య నాకు కనబడలేదు, స్వామి ఈశ్వరానందగారు తప్ప. వారు శిష్యులతో తరుచూ అడవుల్లోకి వెళ్ళి పోతారు తపస్సుకని. ఓసారి వెళ్ళితే మళ్ళా నెలవరకూ రారు ఆశ్రమానికి తిరిగి" చెప్పాడు వెంకటస్వామి.

"మరి వీళ్ళకు జరుగుబడి ఎలాగు?" అన్నాడు సీతాపతి.

"కొంత మంది అంటారు, నూకరాజు అనే మహాభక్తుడు వీరి అవసరాలను చూస్తుంటాడని. మరి కొంత మంది యేమంటారంటే స్వామి ఈశ్వరానందగారు తమ శక్తి వల్లనే, వాటిని సృష్టించుతారని. నా మట్టుకు నేను, వారు శృంగవరపుకోట వచ్చి, యేదీ కొనగా చూళ్ళేదు. ఎవర్నీ ఏదీ అడగ్గా చూళ్లేదు, పైగా వాళ్లే వచ్చిన వాళ్ళకు ప్రసాదమంటూ ఓ పండు చేతిలో పెడ్తారు" చెప్పాడు వెంకటస్వామి.

"అలాగా?" అన్నాడు రంగనాధరావు, ఆశ్రమం మిస్టరీ మరింత జటిలమవుతున్నట్టుగా అనిపించగా.

అరగంటలో పుణ్యగిరి చేరుకొన్నారు ముగ్గురూ.

"చూడు వెంకటస్వామి!...మనం యిప్పుడు స్వామి ఈశ్వరానంద గారి ఆశ్రమానికి వెళ్తున్నాం. అయితే, మనం రహస్యంగా యెవరికీ తెలియకుండా వెళ్ళాలి. అందరూ వెళ్లే త్రోవంటగాకుండా, వేరే దోవగుండా తుమ్మల్ని తిన్నగా ఆశ్రమం వెనకాలకు తీసుకెళ్ళు" చెప్పాడు రంగనాధరావు.

"అదేమిటి సార్!...యిప్పుడా వారి దర్శనం?...ఏమిటి సార్ విశేషం?" కుతూహలంగా అడిగాడు వెంకటస్వామి.

"వారి దర్శనానికి వెళ్ళడంలేదు...వారి ఆశ్రమాన్ని రాత్రి పూట చూడ్డానికి వెళ్తున్నాం" చెప్పాడు సీతాపతి.

"సార్!...చాలా పాపం సార్!...వార్ని అనుమానించకండి సార్!" ఎంతో బాధపడిపోతూ అన్నాడు వెంకటస్వామి.

"పోన్లేవోయ్!...ఆ పాపం అంతా నేనే తీసుకుంటాడు...సరేనా?...యీ విషయం ఎవరికీ చెప్పకు తెలిసిందా?" అన్నాడు రంగనాధరావు అధికార స్వరంతో.

"అలాగే సార్!" అంటూ వెంకటస్వామి, తన భావాల్ని తనలోనే అణిచేసుకుని, వార్ని, మామ్మూలు తోవనుంచి తప్పించేసి తుప్పల మధ్యనుంచీ, చెట్లమధ్య నుంచీ, తిన్నగా ఆశ్రమం వెనకాల ఉన్న రాతిగుట్టల మాటుకు తీసుకెళ్ళాడు.

ఆశ్రమం కుటీరాల్లో హరికెను లాంతర్లు వెలుగుతున్నాయి.

ఆశ్రమం ప్రాంగణంలో ఆశ్రమ వాసులు లాంతర్లు పుచ్చుకుని హడావుడిగా తిరుగుతున్నారు.

రంగనాధరావు రిష్టువాచీ చూసుకున్నాడు. పన్నెండు దాటి పదినిముషాలయింది.

"ఎవరి నివాసాలకు వాళ్ళుపోయి, విశ్రాంతి తీసుకోవడానికి బదులు, యింకా మెలకువగా ఉండి తిరుగుతున్నారేం అటూ ఇటూ?" స్వగతం అయినా బైటకు అనేసాడు రంగనాధరావు.

"సార్!...కాస్త మాపు నిదానించి చూడండి...

వాళ్ళెందుకు బిజీగా ఉన్నారో తెలుస్తుంది'' గొణిగాడు మెల్లగా సీతాపతి.

అప్పుడు తనదృష్టి కేంద్రీకరించాడు రంగనాథరావు.

ఆశ్రమం మధ్యలో కారు నిలిచిఉంది. కారు క్రింద గొయ్యి ఉన్నట్టుగా, కారుక్రింది భాగం వెలుతురుతో నిండి ఉండడం బట్టి తెలియ వస్తోంది.

''కారుకు రిపేరు వచ్చినట్టుంది...రిపేరు చేస్తున్నట్టుగా ఉన్నారు'' అన్నాడు రంగనాథరావు.

''లేదుసార్!......అది కారు రిపేరు కాదు... ఆ గొయ్యి తీరు చూస్తుంటే, నిత్యమూ వాడడానికే. దాన్ని తీసినట్టుగా ఉంది... చూద్దాం యింకేమవుతుందో'' అన్నాడు సీతాపతి.

మళ్ళా అందరూ మవునముద్ర వహించి దీక్షగా చూడసాగారు.

అయిదు నిముషాలు గడిచాయి.

అటూ యిటూ యిద్దరు శిష్యులు లాంతర్లు పట్టుకొని రాగా, మధ్యలో ఓ శిష్యుడు న్యూస్ పేపరుతో కట్టిన పాకట్లు మోసుకుంటూ రాసాగాడు.

''సార్!...ప్లీజ్ నోట్ దట్'' ఆత్రంగా అన్నాడు సీతాపతి.

''యస్!...నోటింగ్'' అన్నాడు రంగనాథరావు తాపీగా.

ఆ పాకట్లు కారువద్దకు తీసుకు వచ్చారు వాళ్ళు. ఒక్కొక్క పాకట్టు గోతిలోఉన్న వ్యక్తికి అందిస్తుంటే, అతడు అందుకుని, కారు అడుగు భాగంలో అమర్చసాగాడు. ఆ తర్వాత పళ్ళెలవంటి స్టీలు ఫ్రేములు నట్లతో బిగించాడు.

ఓ పావుగంట తర్వాత, కారు గోతిపైనుంచి బయటకు కదిలింది. గోతిలో ఉన్న వ్యక్తికూడా వెలుపలికి వచ్చాడు ఆ వెంటనే.

"సార్!... ఆ పాకట్లు హిరోయిన్ సంచులు. కారు అడుగు భాగంలో బిగించి, వాటిపైన కవర్లు తగిలించి తీసుకెళ్తున్నారు" అన్నాడు సీతాపతి.

"నాకూ అర్థమైంది...ఇదన్నమాట నూకరాజుకూ వీళ్ళకూ ఉన్న సంబంధం," అన్నాడు రంగనాథరావు సాలోచనగా.

"నాదో అయిడియా సార్" సీతాపతి అన్నాడు క్షణం పోయాక హుషారుగా.

"యేమిటది?"

"మనం వెంటనే శృంగవరపుకోటకు పోయి, మన పోలీసు ఫోర్సుతో రేపు నూకరాజు రాగానే, చుట్టుముట్టి చెక్ చేసి అరెస్టుచేస్తేనో?"

"నో!...అదికుదరదు...నూకరాజు దొరికిపోతాడు... అయిదో పదో కిలోల హిరోయిన్ మనకు చిక్కుతుంది... మనపేరు పేపర్లలో పడుతుంది...అయితే, యింత హిరోయిన్ యీ ఆశ్రమ వాసులకు యెక్కడ్నించి వచ్చింది అన్నది తేలదు. అది తేలితేగాని, దాని ఆరిజిన్ దొరకదు మనం కొట్టాల్సిన దెబ్బ అక్కడ."

"ఓకే సార్!...అలాగే."

"దెన్! కమాన్!...లెటజ్ గో" అంటూ కదిలాడు రంగనాథరావు.

తను కళ్ళతో చూసింది నమ్మలేక, మూగవాడిలా, కలలో నడుస్తున్న వాడిలా వారివెంట బయలు దేరాడు జవాను వెంకటస్వామి.

# 14

ఆ ఆశ్రమ వాసులుకి, అంత పెద్ద మొత్తాలు హీరో యిన్ ఎక్కడ్నించి వస్తోంది?

ఆ ప్రశ్నకు యింకా సమాధానం దొరకవలసి ఉంది.

"మనం ఆశ్రమానికి వెళ్తున్నప్పుడు, వెంకటస్వామి కొన్ని మాటలన్నాడు గుర్తుందా?" అన్నాడు డి. ఎస్. పి. రంగనాథరావు

"ఆఁ గుర్తుంది సార్! ఈశ్వరానంద శిష్యులతో తపస్సుకు వెళ్తాడన్నాడు" చెప్పాడు సబ్ ఇన్‌స్పెక్టర్ సీతాపతి.

"అదే! అదే! వాళ్ళు అడవుల్లోకి వెళ్తారు. అయితే, వాళ్ళకు అడవుల్లో హీరోయిన్ ఎక్కడ్నించి దొరుకు తుంది?"

"యస్ సార్! ఆ మిస్టరీని మనం విడగొట్ట గలిగితే, అంతా బయట పడుతుంది" అన్నాడు సీతాపతి హుషా రుగా.

"అయితే, ఆ పని నువ్వే చెయ్యాలి. వాళ్ళు తప స్సుకి వెళ్ళేటప్పుడు నువ్వూ వెళ్ళు," చెప్పాడు రంగ నాథరావు.

"అలా కాదుసార్! వాళ్ళు ఆశ్రమంలో ఉన్నప్పుడే వెళ్తాను. ఎందుకంటే, అప్పుడే నిరాటంకంగా రహ స్యాన్ని ఛేదించవచ్చు" అన్నాడు సీతాపతి.

"అది బాగానే ఉంది. కానీ అది అంతులేని అడవి. ఎక్కడికని వెళ్ళి వెతగ్గలవు?" తన సందేహం వెలి బుచ్చాడు రంగనాథరావు.

"ఆశ్రమంలో యెలాంటి వాహనాలు లేవుగాబట్టి, వాళ్ళు నడిచే వెళ్తారన్నమాట. అంటే, వాళ్ళు ఒక్క

రోజులో నడవగలిగే - లేదా యింకోరోజు కూడా కలిపి నడవగలిగే దూరంలోనే, వాళ్ళ రహస్యం దాగిఉంది. అంటే, పది చదరపు మైళ్ళ మేర అడవిని వెతికితే చాలు" అంటూ తన ఊహను స్పష్టీకరించాడు సీతాపతి.

"ఓకే! దెన్ ప్రొసీడ్!" అంటూ సీతాపతి కార్య క్రమానికి తన ఆమోదముద్రను వేశాడు రంగనాథరావు.

# 15

బాట కిరువైపులా వున్న దట్టమైన డొంకలవైపు ఎత్తైన చెట్లవైపు చూసుకుంటూ, మధ్యమధ్య ఆగి, పరిస రాలవైపు ఓసారి పరిశీలనగా చూసివెళ్తున్నాడు సీతాపతి.

అతడిప్పుడు కట్టెలు కొట్టేవాడి వేషంలో వున్నాడు. మాసిన పంచె నడుంకు చుట్టబడి వుంది. అదే తీరులో మట్టి కొట్టుకుపోయిన ఓ జుబ్బా వుంది పైన. నెత్తిమీద తలపాగ.

జుబ్బా లోపల, చంక క్రింద, కెమేరా దాచాడు. మొలకు పిస్టలు వుంచాడు. అయితే, అది అగపడకుండా, పైన పంచె చెంగు చుట్టాడు.

నోట్లో చుట్ట గుప్ గుప్ మంటూ పొగ వదులుతోంది. ఓ మాసిన గుడ్డలో కర్రలు కొట్టే కత్తి చుట్టబడింది. దాన్ని నెత్తిమీద పెట్టుకున్నాడు, కట్టెలు కొట్టేవాళ్ళ అలవాటు ప్రకారం.

మొదట వెడల్పుగా, మనిషి పోవడానికి వీలుగావుండే బాట క్రమేణా సన్నంగా అయిపోయింది. కాసేపటికి, అడ్డంగా పడే మొక్కల్ని, తీగెల్ని నరుక్కుంటూ పోతే గాని, ముందుకు పోలేనంత యిరుగ్గా తయారైంది.

సుమారు రెండుగంటలు సాగింది నడక. కాళ్ళు పీక సాగాయి. విపరీతంగా దాహం వెయ్యసాగింది. శరీరం విశ్రాంతికోసం అలమటించిపోతోంది.

మంచినీటికోసం నలువైపులా చూడగానే ఓ జల అవుపించింది. పరుగెత్తిపోయి, ఆత్రంగా తాగి, కడుపు నింపుకున్నాడు.

నీళ్ళు చల్లగా, తియ్యగా వున్నాయి. కొంచెం ఊరట కలిగినట్టనిపించింది.

జల కవతల, దట్టంగా నీడలు పరిచిన మామిడిచెట్టు అవుపించింది. కిందపడిన పండుటాకుల్ని, చెత్తచెదారాన్ని కాలితో బాగా ఊడ్చేసి, తలపాగా తీసి తలక్రింద ఒత్తుగా పెట్టుకుని నడుం వాల్చాడు.

ఆకుపచ్చని ఆకుల్ని, తప్పించుకుని నేలమీదకు జారి రాలేక తంటాలు పడుతోంది మధ్యాహ్నపు యెండ. ప్రకృతి వేసిన పచ్చని పందిరివైపు చూస్తూ నిద్రలోకి జారు కున్నాడు సీతాపతి.

ఆ నిద్రలో యేదో పీడ కల. ఎవరో తన కడుపుమీద కూచుని నొక్కుతున్నట్టుగా ఫీలింగ్.

చటుక్కున మెలకువ వచ్చింది సీతాపతికి.

కారణమేమై వుంటుందా అని, మెల్లిగా తలయెత్తి పొట్టవైపు చూసాడు.

సీతాపతి గుండె కొట్టుకోవడం మరిచిపోయింది.

ఓ కొండ చిలువ, తీరుబడిగా, అతడి పొట్టమీంచి పాకుకుంటూ వెళుతోంది.

ఒళ్ళంతా చెమటలు పట్టింది.

కొండచిలువ పొడవు సుమారు పదిహేను అడుగులకు

తక్కువగాకుండా వుంది. తననో రాయి క్రిందో, మాను క్రిందో జమకట్టి, అది పైనుంచి దాటి వెళ్ళిపోతోంది. అదే, తను లేచి, విదిలించుకో బోయేటంతలో, అది బెదిరి, తనని గుర్తించి, చుట్టేసుకోవచ్చు. ఆ చుట్టల్ని విప్పుకోవడం బ్రహ్మతరంగూడా కాదు.

అంచేత అది ప్రాకి వెళ్ళిపోయేంతవరకూ, కదలక, మెదలక, ఎప్పటిలా పడుకోవడమే ఉత్తమం అనుకున్నాడు.

అంచేత ఊపిరి బిగబట్టి శ్వాస మెల్లగా వదులుతూ, నిద్ర నటించడం మొదలుపెట్టాడు సీతాపతి.

అయితే, పాము ఒంటికి తగులుతుంటే, కలిగే ఆ ఫీలింగ్ దుర్భరంగా వుంది. ఒంట్లో నరనరంలో కంపరంగా వుంది.

అయినా, తను ప్రమాదంలో పడకుండా వుండాలంటే భరించక తప్పదు. తనకు తాను సమాధానం చెప్పుకున్నాడు.

పాము మెలమెల్లగా కదులుతోంది. దానివైపునుంచి దృష్టి మళ్ళించుకుందామని ఎంత ప్రయత్నించినా కుదరడం లేదు.

అయిదునిముషాలు గడిచాయి బరువుగా. ఆ అయిదు నిముషాలు, అయిదు యుగాలుగా తోచాయి అతడికి.

ఎలాగయితేనేం; పాము పూర్తిగా కదిలి వెళ్ళిపోయింది అతడిమీంచి.

ఒంటినిండా చెమటలు వరదలు కట్టాయి. లేచి గాఢంగా నిట్టూర్చాడు. అయిదునిముషాలు అలాగే కూర్చున్నాడు.

తిన్నగా వెళ్ళి, యిందాకటి జలపద్దనే మొహం కడు క్కుని నీరు త్రాగాడు.

తను అడివి మధ్యలో అలా ఆదమరిచి నిద్రపోవడం పెద్ద పొరపాటు అని గ్రహించాడు. ఆ పొరపాటు యిక చెయ్యకూడదనికూడా గట్టిగా నిశ్చయించుకున్నాడు.

ఉత్సాహం బలవంతంగా తెచ్చుకుని, మళ్ళా బయలు దేరాడు.

ఇలా ఫర్లాంగుదూరం వెళ్ళాడో లేదో, చిన్నగా కేక విన్పించిం దతడికి.

ఆ కేక ఎవరో స్త్రీ వేసింది!

ఉన్నచోటనే నిలుచుండిపోయి విన్నాడు.

ఆ కేక తర్వాత సన్నగా మూలుగు; మళ్ళా ఓ పెద బొబ్బ—ఆ తరువాత ఉస్సురంటూ పెద్దగా నిట్టూర్పు విన్పించాయి.

ఆ ధ్వనులు తనకు కుడివైపునుంచి, ఓ పొద మధ్యలో నుంచి వస్తున్నాయని గ్రహించి, నిశ్శబ్దంగా అటు నడి చాడు సీతాపతి.

పొదకు బాగా చేరువగా వచ్చి, మెల్లిగా కొమ్మల్ని ప్రక్కకు వంచి లోనికి చూసాడు.

ఆ తుప్పలమధ్య ఓ కొండజాతి స్త్రీ పురుషులున్నారు నగ్నంగా ఒకరిమీద ఒకరు.

ఆమెకు సుమారు ముప్ఫైఅయిదేళ్ళు వుంటాయేమో. కాని, అతడికి పాతికేళ్లు యింకా నిండివుండవు. కౌమారం అతడి ముఖంలో వుంది యింకా.

ఆ క్షణంవరకూ వాళ్ళు జరిపిన మోటుసరసం పతాక స్థాయి చేరుకోవడమే, ఆమె వేసిన కేక, మూలుగు వగైరా.

నవ్వుకుంటూ ఆ పొదకు దూరంగా వచ్చి నిలుచున్నాడు సీతాపతి.

ఐదునిముషాల తర్వాత తృప్తినిండిన కళ్ళతో ఆ జంట విడిపోయింది.

"ఎవర్రా అక్కడ?...ఏమిటీ పని?" అంటూ వాళ్ళ మధ్యకెళ్ళి నిలుచున్నాడు సీతాపతి.

కండల్లాంటి స్తనాలు ఎగిరిపడుతుండగా ఆమె కంగారుగా చీర అందుకుని, చెట్టుచాటుకు పరుగెత్తింది కట్టుకోవడానికి.

యువకుడు మాత్రం తాపీగా తన కాళ్ళదగ్గర వున్న బట్టల్ని అందుకుని కట్టుకుంటూ సీతాపతివైపు చూడసాగాడు తదేకంగా.

"ఏమిటీ వెధవ పని? ... తప్పు కాదూ? ... పాపం కాదూ?" అన్నాడు సీతాపతి, సీరియస్‌గా యువకుడి మొహంలోని భావాలు జాగ్రత్తగా పరిశీలిస్తూనే.

సీతాపతి యెత్తు పారింది. ఆ కుర్రాడి కళ్ళల్లో భయం తొంగిచూసింది.

"అదే నన్ను రెచ్చగొట్టింది. ఇక్కడికి రమ్మంది. లేకపోతే, నేనే దాన్ని రమ్మన్నానని మొగుడితో చెప్పి చంపిస్తానంది," నంగిరిగా మాటాడాడు ఆ కుర్రాడు.

ఈ లోపున ఆమె బట్టలు నిండుగా కట్టుకుని వచ్చింది.

"ఎవడివిరా నువ్వు? ఏమిటి బెదిరిస్తున్నావ్?" అంది ఆమె రోషంగా, దర్జా ఒలకబోస్తూ.

"మొగుడి కళ్లుగప్పి, రంకుతనం సాగించడం గాకుండా, దబాయింపొకటా?" తిరిగి సీతాపతికూడా దబాయిస్తూ అన్నాడు.

ఆమె పరిస్థితి అర్థం చేసుకొన్నట్టుంది. ఆమె రోషం ఎగిరిపోయింది. నీళ్ళు నములసాగింది.

కుర్రాడు మెల్లిగా కదిలి వెళ్ళి, అడివిలో అదృశ్య మయ్యాడు.

"ఇక్కడికి మీ ఊరు ఎంతదూరం?" అడిగాడు సీతాపతి కొండస్త్రీని ఉద్దేశించి.

"ఏం? ఎందుకూ?" బెరుగ్గా అందామె.

"మీ ఊరొచ్చి నీ మొగుడికీ, ఊళ్ళోవాళ్ళకీ, నీ సంగతి చెప్పి తన్నించడానికి" అని ముందుకు కదిలి ఆమె రెక్క పుచ్చుకుని "రా! దారి చూపించు... వెళదాం" అన్నాడు సీతాపతి.

ఆమె అయిష్టంగా కదిలింది.

"పెళ్ళయి పదేళ్ళయింది. కడుపు పండలే. కోరికా తీరలే. కక్కుర్తిపడి చేసాను యీ పని. చెబితే నీకేం వస్తుంది?" అందామె దీనంగా.

వెంటనే వెనుతిరిగి "సరే, నిన్ను వెళ్ళిపోనిస్తాను. అయితే, నాకో సాయం కావాలి" అన్నాడు సీతాపతి.

"ఏం కావాలి? చెప్పండి" అందామె ఆశ్చర్యంగా చూస్తూ.

"ఈ ప్రాంతాల గురించి నీకు బాగా తెలుసునా?"

"ఆఁ... నా అరచెయ్యంత బాగా తెలుసును."

"ఇక్కడకు ఎవరయినా సాధూలు వస్తుంటారా?"

"ఆఁ... వస్తుంటారు. దేనికీ?"

"ఆ మాట నువ్వు చెప్పాలి, వాళ్ళెందుకొస్తున్నారో?"

"ఏమో నాకూ తెలీదుగాని, యీ దిక్కుగాపోతే, పెద్ద జాగా వుంటుంది, యీనపముళ్ళ కంచె కట్టి. ఆ జాగాలో ఎప్పుడూ నాలుగు పులులు తిరుగుతుంటాయి.

అక్కడికి ఎవ్వరూ పోరు. అందరికీ భయం," చెప్పిందామె.

"అంతేనా? ఇంకా విశేషాలేమైనా వున్నాయా?"

"అంతే! ఇంకేం లేవు" అని చట్టున ఏదో గుర్తుకు రాగా, "ఆఁ మర్చిపోయాను. అప్పుడప్పుడు విమానం వస్తుం దిక్కడకు" అందామె.

"ఏమిటీ? ఇక్కడ విమానాలు దిగే స్థలం వుందా?" అన్నాడు సీతాపతి ఆశ్చర్యంగా.

"విమానం అంటే, పైన పెద్ద రెక్కలుండి, పెద్ద చప్పుడు చేస్తుందది," అందామె.

"ఓహో! హెలికాప్టరా?" అన్నాడు సీతాపతి, ఆమె చెప్పింది అప్పటికి అర్థమై.

"సరే! మీ మేలు మర్చిపోను. వస్తాను" అందామె దండంపెట్టి బయలుదేరుతూ.

"ఒక్క నిముషం," అన్నాడు సీతాపతి.

ఆమె ఆగి చూసింది, 'యేమిటీ?' అన్నట్టుగా.

"నేనిలా అడిగినట్టు ఎవరికయినా చెప్పావో, మీ ఊరు వచ్చి, నిజంగా మీ ఆయనకు నీ సంగతి చెప్పేస్తాను, జాగ్రత్త" వేలు తాటిస్తూ, ఆమెవైపు సీరియస్‌గా చూసి అన్నాడు సీతాపతి.

"లేదు బాబూ! చెప్పను...ఒట్టు" అందామె నమ్మకంగా.

"ఆఖరికి నీ ప్రియుడికి కూడా."

"వాడికికూడా చెప్పను దొరా" దండంపెట్టి కదలి వెళ్ళిపోయిందామె. ఆమెను వెళ్ళనిచ్చి, ఆమె కను మరుగవగానే, ఆమె చూపిన దిక్కుకు బయలుదేరాడు సీతాపతి ఉత్సాహంగా.

## 16

దాదాపు మూడువేల చదరపు గజాల విస్తీర్ణం గల జాగా అది. ఇంచుమించు యిరవై అడుగుల యెత్తున, దట్టంగా దగ్గరగా అల్లిన ముళ్ళకంచె వుంది దాని చుట్టూ, ఆ జాగాకు మధ్యగా కర్రలతోటి కట్టిన ఓ షెడ్ వుంది. కంచెకు, యివతల దూరంగా ఖాళీ స్థలంలో చదునైన ప్రదేశం వుంది.

అది హెలికాప్టరు దిగడానికి ఉపయోగించే ప్రదేశం అని అర్థం చేసుకొన్నాడు సీతాపతి.

కంచెకు చేరువగా వెళ్ళి నిలుచున్నాడు.

అతని పాదాల చప్పుడు విన్పించగానే, అంతవరకూ విశ్రాంతిగా పడుకున్న ఓ పులి చట్టున లేచి, నిలుచుని గాండ్రించింది. ఆ తరువాత ఒకటీ, మరొకటీ, ఇంకొకటీ లేస్తూ అగపడ్డాయి.

ఆ స్థలమంతా చుట్టి తిరిగివస్తేగాని, యింకెన్ని పులుల్ని కాపలా పెట్టారో అర్థంగాదు అనుకున్నాడు.

అయితే, ఆ పులుల్ని, కాపలా పెట్టాల్సిన దేవరహాస్యం అక్కడేముంది?

లోపలకు పోయి చూసిరావాలని నిశ్చయించుకున్నాడు.

కాని, లోనకు పోవడానికి వీలవుతుందా అని ఆలోచించాడు.

కంచె యెక్కి, అవతలవైపుకు దిగడం దుస్సాహసమే అవుతుంది. ఎందుకంటే, దిగుతూ తిన్నగా ఆకలితో వున్న పులుల నోట్లో పడాలి. ఒకవేళ అప్పుడు వాటిని తప్పించుకున్నా, షెడ్‌కు పరుగెత్తే లోపల అవి మీద పడతాయి.

అంచేత అలా పోవడం కుదరదనుకున్నాడు.

వేరే అవకాశం ఏమన్నా వుందా అని ఒకసారి ఆవరణ అంతా కలియజూసాడు.

ఎంతో కట్టుదిట్టంగా, దుర్భేధ్యమైన కోటలా దాన్ని కట్టినవాళ్ళు, చిన్న చిన్న లోపాల్ని పట్టించుకోకుండా వదిలిపెట్టిన తీరు చూసి లోలోన నవ్వుకున్నాడు సీతాపతి.

చకచకా కదిలి, కంచెకు చేరువగా, తన ప్రవేశానికి అనువైన ఓ చెట్టును యెక్కాడు. మెల్లగా చివరికొమ్మలను చేరుకొన్నాడు.

తనున్న చెట్టుకొమ్మలతో చేతులు కలిపినట్టుగా ఇంకో చెట్టు వుంది. ఆ చెట్టుకొమ్మలు అందుకుని, అవతలి చెట్టుని చేరుకోవడం అతనికి కష్టం కాలేదు.

అయితే, అన్ని చెట్లూ, అతడు మొదట ఊహించినంత చేరువగా లేవు. కొన్ని చెట్లకొమ్మలు కనీసం అయిదడుగుల దూరంలో వున్నాయి.

సగందూరం వచ్చి, వెనుదిరిగి పోవడమన్న ప్రసక్తే లేదు అతనికి. పైగా, ఆ షెడ్‌లో వున్న రహస్యాన్ని ఛేదించడానికి నిశ్చయించుకుని వచ్చాడాయె.

మృత్యువుతో దోబూచులాడ్డానికే నిశ్చయించుకున్నాడు.

ఎంతో నేర్పుగా తను చెయ్యవలసిందల్లా, ఒక్క ఊపులో ముందుకు దూకి, అవతలి కొమ్మను పట్టుకుని వేలాడ్డం.

కాసేపు, తను అడవి వీరుడు టార్జానుగా ఊహించుకుని, ప్రాణాల్ని దైవంచేతిలో పెట్టి, చెట్టునుంచి చెట్టుకు ఎగురుతూ చివరిచెట్టుకు చేరుకొన్నాడు అరగంటలో.

ఆ చెట్టుమీంచి షెడ్ పైకప్పుమీదికి దిగడం ఒకటే మిగిలివుంది.

కంచెను చేరుకునేంతవరకూ తలగుడ్డగా వాడి, ఆ తరువాత నడుంకు కట్టుకున్న తువ్వాలును తీసాడు. దానికి, తన పంచెను విప్పి, ముడేసాడు.

అలా తయారు చేసిన ఆ గుడ్డని ఓ చివర, ఓ బలమైన కొమ్మకు గట్టిగా కట్టాడు.

దాన్ని పట్టుకుని వేలాడి చూసి, తన బరువుకి అది ఊడి రాదని నిర్ధారించుకున్నాక, దాని సాయంతో ప్రాగి, షెడ్ పైకప్పుమీదకు చేరుకున్నాడు సురక్షితంగా చివరకు.

గుడ్డ రెండో చివర్ని, షెడ్ మీదున్న ఓ కర్రకు చుట్టాడు ఊడిరాకుండా. తను వచ్చిన పని అయిపోతే, తిరిగి, ఆ గుడ్డ సాయంతోనే గదా చెట్టు కొమ్మలను చేరుకుని వెనక్కి వెళ్ళేది!

షెడ్ కు చేరుకునే ప్రయత్నంలో లీనమై అంతవరకూ సీతాపతి గమనించలేదు గాని, అతడి ప్రతి కదలికనూ, దిగువనున్న పులులు జాగ్రత్తగా పరిశీలిస్తూనే ఉన్నాయి. అతను క్రిందపడితే చాలు మీదబడి వల్చుకుతిందామని ఆశ పడుతూ, ఆకలి అరుపులు అరుస్తూనే ఉన్నాయి.

షెడ్ పైకి చేరాక, దిగువకు ఓసారి చూసాడు సీతాపతి యధాలాపంగా.

అతనినే గమనిస్తూ, షెడ్ చుట్టూ, దిగువన పులులు నిలుచుని చూస్తున్నాయి.

లోనకు వెలుతురు చొరడంకోసం షెడ్ పైకప్పులో గ్లాసులు బిగించి ఉన్నాయి. వాటిని మెల్లగా ఊడదీసి, తన పని అయిపోగానే, తిరిగి బిగించెయ్యాలన్న ఉద్దేశంతో ఆ అద్దాల్ని తీయడానికి ప్రయత్నించాడు. కాని లాభంలేక పోయింది.

పైన చెయ్యి పెట్టి నొక్కేసరికి, పెళ్ళున విరిగాయి అద్దాలు.

పైకప్పుమీద బోర్లా పడుకుని, వెంటిలేటర్లలోంచి, శరీరాన్ని లోనకు దూర్చి పరిశీలించడం మొదలుపెట్టాడు.

లోన ఉన్న పెద్ద టేబిల్స్, కుర్చీలు, వాటిపైన అమర్చిన, గాజు కుప్పెలూ, టెస్ట్ ట్యూబులూ వగైరా సామగ్రి అంతా చూశాక లోన ఉన్నది లేబరేటరీ అని గ్రహించాడు.

లోనుంచి పైకి ఎగసి, ఘాటుగా తియ్యగా ముక్కుకు సోకే వాసననుబట్టి లోన నల్లమందు వాడడం జరిగిందని అర్థం చేసుకొన్నాడు.

ఆంధ్రదేశంలో ఉందని చిన్ని చెప్పిన లేబరేటరీ అదే అని మనసులో అనుకొన్నాడు.

లోనకు దిగి అదంతా ఫోటోలు తీస్తే బావుంటుందనుకున్నాడు.

ఏవిధంగా దిగితే తాను సులువుగా లోనకు చేరుకోగలడో అని గదంతా వెతుకుతుంటే లోనించి 'బుస్' మన్న శబ్దం వినవచ్చింది.

ఆ శబ్దం వచ్చిన దిక్కుకు చూసేసరికి అక్కడో నాగు పాము ఉంది. అతడి గుండాగినట్టయింది.

నేలమీద బొర్లాడుతున్న ఆ పాముని తాను పట్టించుకోనక్కర్లేదనుకుంటూ లేబ్ ఎక్విప్ మెంట్ వైపు చూసాడు.

ఆ యాపరేటస్ని చుట్టుకుని మరి రెండు విషసర్పాలు కదులుతూ అవుపించాయి.

ఆ పాములు వాటంతటవే లోనకు చొరబడ్డవి కావనీ,

ఈశ్వరానంద శిష్యులే వదిలి వెళ్ళిపోయారనీ తెలుసు కున్నాడు సీతాపతి.

ఇహ తను లోనకు దిగి, లేబ్ ఫోటోలు తీరుబడిగా తీసే అవకాశం శూన్యం అనుకున్నాడు.

పైనించి లోనకు వేలాడుతూనే తనతో పాటుగా తెచ్చిన కెమేరాతో నాలుగు స్నాప్స్ లాగాడు.

ఆ తరువాత బయటకొచ్చి షెడ్ పైకప్పు మీంచి యింకో రెండు స్నాప్స్ లాగాడు. ఆ పరిసరాలు పడే లాగు.

ఆ తరువాత షెడ్ పైకప్పుమీది కర్రకు కట్టిన గుడ్డ విప్పి దాని ఆధారంగా చెట్టుకొమ్మల్లోకి చేరుకుని, వచ్చిన త్రోవనే బయటకు వచ్చాడు.

బయటనుంచి ముళ్ళకంచె వెనుకనున్న షెడ్నీ ముళ్ళ కంచె గేటుతో సహా మరో రెండు స్నాప్స్ లాగాడు.

తను వచ్చినపని విజయవంతంగా కొనసాగడంతో, హుషారుగా వెనక్కు బయలుదేరాడు సీతాపతి.

## 17

ఎస్. పి. సుందర్రామ్ తన ఛాంబరులో అడుగుపెట్టిన రంగనాథరావుని అతని వెంట ఉన్న సీతాపతిని చూసి భావగర్భితంగా నవ్వాడు.

"సార్!...మన ఆపరేషన్స్ అన్నీ పూర్తయ్యాయి. డ్రగ్ ట్రాఫిక్ లోని మూల విరాట్టులు, చిల్లరదేవుళ్ళమీద కావాల్సిన సాక్ష్యాధారాలు సేకరించడం జరిగింది" చెప్పాడు రంగనాథరావు.

"ఇన్నాళ్ళూ కేసు నీ కంట్రోల్లో నడిచింది. ఓసారి అంతా చెప్పు" అన్నాడు సుందర్రామ్ రంగనాథరావుని కూచోమని సైగచేసి.

రంగనాథరావు కూచున్నాడు. కాని సీతాపతి నిల్చునే ఉన్నాడు.

ఇటీవల సీతాపతి సాధించిన ఫలితాలతో సహా తా మెలా సాక్షుల్ని, సాక్ష్యాధారాల్ని సేకరించి ఉంచిందీ వివరంగా చెప్పాడు రంగనాథరావు.

"వెల్ డన్!" అంటూ రంగనాథరావుని, సీతాపతిని కంగ్రాచ్యులేట్ చేసాడు ఎస్. పి. సుందర్రామ్.

ఆ తరువాత తన రివాల్వింగ్ ఛెయిర్‌లో కూలబడి రెండు నిముషాలు దీర్ఘంగా ఆలోచించాక "మనం ఒకే రోజున ఒకే టైములో యీ డ్రగ్ ట్రాఫిక్ దొంగల్ని అరెస్టు చెయ్యాలి. లేకపోతే ఒక చేప పట్టుబడిందని తెలియగానే, తతిమ్మా చేపలు జారుకుంటాయి దొరక్కుండా" చెప్పాడు సుందర్రామ్.

"అదే నా ఉద్దేశమూ కూడా సార్!" అన్నాడు రంగనాథరావు.

"మరి ఒరిస్సానుంచి వచ్చే సప్లయిలు గురించి యేంచేద్దామంటావ్?" అన్నాడు ఎస్.పి యింకో క్షణం పోయాక.

"ఆ రాష్ట్ర పోలీసులకు రిపోర్టు చేద్దాం. దాంతో మన బాధ్యత తీరిపోతుంది. ఇహ మన రాష్ట్రంలోని రింగ్‌ని స్మాష్‌చేసాక, యింకెవరికి సప్లయి చెయ్యగలరు నల్లమందు. ఆ సప్లయిలు కూడా వాటంతటవే నిలిచిపోతాయి" చెప్పాడు రంగనాథరావు.

"వెల్ డన్. అరెస్ట్ వారంట్లు తయారు చెయ్యడానికి యేర్పాట్లు చేస్తాను. యీ అరెస్టుల్ని జాగ్రత్తగా నువ్వే ఆర్గనైజ్ చెయ్యాలి." అన్నాడు సుందర్రామ్.

"అలాగే సర్!" అంటూ లేచాడు రంగనాథరావు.

అతని వెంట బయటకి వచ్చేశాడు సీతాపతి ఆనందో ద్రేకంతో పొంగిన గుండెలతో.

# 18

"ఆఁ మన హెలికాప్టరు వచ్చేస్తోంది" అన్నాడు ఈశ్వరానంద ఉత్సాహంగా, సన్నగా వినపడసాగిన హెలికాప్టర్ రొద గుర్తుపట్టి.

క్షణం చెవులు రిక్కించి "అవును!...వచ్చేస్తోంది" అన్నారు అతని శిష్యులు.

తమకీ, లేబరేటరీ చుట్టూ తిరిగే ఆకలితో ఉన్న పులు లకీ, ఆ హెలికాప్టర్ తెచ్చే సరుకులే ఆధారం. అందులో వచ్చిన నాలుగు మేకపోతుల్ని పులులకు ఆహారంగా వేస్తే గాని, వాటిని బోనుల్లోకి తరిమి లేబరేటరీ తెరవడం కుద రదు.

హెలికాప్టరు బాగా దగ్గరయినట్టుగా, రొద ఎక్కు వైంది.

ఆ తరువాత ఉధృతంగా వీచిన గాలికి చెట్లు ఆరాటంగా ఊగుతుంటే, హెలికాప్టర్ నేలకు దిగింది.

హెలికాప్టర్లో యిద్దరు వ్యక్తులున్నారు. వాళ్ళు ఈశ్వరానందకు నమస్కారం చేశారు. ఈశ్వరానంద శిష్యులు హెలికాప్టరులోని సరుకంతా దించగానే, హెలి కాప్టరులోని వ్యక్తులకి, కరెన్సీ ఉన్న సూట్‌కేసు అందిం చాడు ఈశ్వరానంద.

హెలికాప్టర్ వచ్చినట్టుగానే, అరగంట తర్వాత వెనక్కి వెళ్ళిపోయింది.

"పాంపారావ్!... మేకల్ని పులులకు పడేసెయ్ క్విక్" ఆర్డరిచ్చాడు ఈశ్వరానంద.

పాపారావు పులులకు మేనేజరు. మేకల కళేబరాల్ని కంచెమీంచి అవతలకు గిరవాటేసాడు.

మేకల కళేబరాలమీదకు కలియబడ్డాయి పులులు. క్షణాలమీద మేకల్ని చీల్చి, రక్తంతకూడా మిగలకుండా తినేసాయి.

ఆ తరువాత, కంచె తలుపులు తెరిచి, పులుల్ని బోనుల్లోకి తరిమి బంధించాడు పాపారావు.

ఆ మీదట సుబ్బయ్య అనే శిష్యుడు వెళ్ళి లేబ్ లో ఉన్న పాముల్ని వేరే గూళ్ళల్లో పడేసి మూతలు వేసాడు. ఆ పాములకి పచ్చి కోడిగుడ్లని ఆహారంగా విదిల్చాడు.

షెడ్ లోకి వెళ్ళగానే అందర్నీ ఆకర్షించింది, నేల మీద పడి ఉన్న గాజుముక్కలు.

"వెంటిలేటర్ యెలా పగిలింది?" అందరి మనస్సుల్లోనూ యిదే ప్రశ్న.

"యే కోతులో విరగ్గొట్టి ఉంటాయి" అన్నాడు లేబ్ కెమిస్ట్ నిరంజనమూర్తి.

ఆ సమాధానం అందరికీ తృప్తికరంగానే తోచిందిగాని "ఇన్నాళ్ళయింది లేబ్ యిక్కడ పెట్టి. ఎప్పుడూ యిలా జరగలేదే" అని ఈశ్వరానంద అనడంతో, మళ్ళా అందరి మనస్సుల్లో అనుమానాల నీడలు పొడసూపాయి.

"మన భయాలు మనవి. అందుకే ప్రతి చిన్నదానికీ, ఎన్నో అనుమానాలు కలుగుతున్నాయి మనకు" అన్నాడు నిరంజనమూర్తి.

దాంతో ఈశ్వరానంద తన ఆలోచనలు కట్టిపెట్టి "ఆల్ రైట్! పని ఆరంభించండి స్టాక్స్ త్వరగా కావాలన్నాడు నూకరాజు" అంటూ శిష్యుల్ని అదిలించాడు.

లేబ్ యేపరేటర్ మీద ధూళిదులిపి నీళ్ళతో కడిగి, పొడిగా ఆరాక నల్లమందుని యేపరేటస్‌లోకి ఫీడ్ చేసాడు నిరంజనమూర్తి.

హిరోయిన్ తయారు కావడానికి ప్రోసెస్ ఆరంభమైంది.

అకస్మాత్తుగా వాళ్ళున్న పరిసరాల్లో అలజడి కలిగినట్టయింది. తమతమ పనులు నిలిపేసి తలఎత్తి చూసాడు ఈశ్వరానంద, అతని శిష్యులు.

వారిని చుట్టుముట్టి, రైఫిల్స్ గురిపెట్టి నిలుచున్నారు పోలీసులు.

నోట మాటరాక స్థాణువుల్లా నిలుచుండిపోయారు అందరూ.

రెండు క్షణాలు పోయాక ఈశ్వరానంద, మరో యిద్దరు శిష్యులు, కంగారుగా కదలబోయేరు గాని "ఈశ్వరానంద ... వార్నింగ్ యివ్వకుండా కాల్చడం మాకు ధర్మం. కాదు కాబట్టి యీసరికి ఊరుకుంటున్నాను" అంటూ డి.యస్.పి. రంగనాథరావు ముందుకొచ్చాడు, బేడీలు పట్టుకుని.

పాకట్టులో ఉన్న ఇరవై కేజీల నల్లమందు, ప్రోసెస్‌లో ఉన్న యింకో రెండు కేజీల నల్లమందు, లేబ్ ఎక్విప్‌మెంటు—అక్కడున్న సూచిక పుల్లతో సహా స్వాధీనం చేసుకునే ముందు ఆయా వస్తువుల్ని ఆయా స్థానాల్లో ఉండగా స్పష్టమైన ఫొటోలు తియ్యబడ్డాయి.

అదే సమయంలో విశాఖపట్టణంలో ఓ కస్టమర్‌కి హిరోయిన్ యిస్తుండగా (అకస్టమర్ పోలీసుమనిషే) నూకరాజు రెడ్ హేండెడ్‌గా పట్టుబడిపోయాడు.

అతని యింటిలోను, గోడలకున్న వుడెన్ పానలింగ్ లోని రహస్యపు అరల్లోంచి పోలీసులు సుమారు పది కేజీల హిరోయిన్ స్వాధీనం చేసుకొన్నారు.

అదేవిధంగా విజయవాడలో ఓ డెలివరీ బాయ్‌కు హిరోయిన్ పాకట్టు యిచ్చి యెవరికి యెలా అందించాలో వివరిస్తుండగా రామశర్మ దొరికిపోయాడు.

వీరుగాక సుమారు అరవైమంది చిన్న డీలర్లు, యిరవై మంది హెంచ్ మెన్, పాతికమంది మిడిల్ మెన్ పోలీసులు జరిపిన మెరుపు దాడిలో సరుకుతో సహా దొరికిపోయారు.

ఆ విధంగా ఈశ్వరనంద శిష్యులు అంతా పట్టుబడటంతో ఆంధ్రదేశంలో డ్రగ్ ట్రాఫిక్ అంతరించిపోయింది.

—: ఐ పో యిం ది :—

# ఓడలో తుఫాన్!

సంపత్

రెండు రోజులనుంచి కమ్ముకున్న మేఘాలు తగ్గి, తుఫాను వొచ్చే వాతావరణం తగ్గిపోవటంతో తృప్తిగా ఊపిరి పీల్చుకున్నారు 'స్టేట్ ఆఫ్ హర్యానా' మీది పాసింజర్స్.

నాలుగయిదు రోజులుగా డెక్ మీదికి పోవటానికి అనుమతి లేకపోవటంవల్ల కాబిన్స్‌లోను, డైనింగ్ హాలులోను నలిగిపోయిన వాళ్ళు, హాయిగా గాలి పీల్చుకునేందుకు డెక్ పైకి వచ్చారు.

బయట వాతావరణం ప్రశాంతంగా ఉంది. ఆకాశంలో మేఘాలేమీ లేవు. స్వచ్ఛంగా ఉంది నీలాకాశం. ఎర్రటి ఎండపడి సముద్రపునీరు కాంతులీనుతోంది.

ఆ షిప్ కెప్టెన్ కోస్లా కూడా పాసింజర్స్‌తోపాటు

డెక్ పైకి వచ్చి వారి ఆనందంలో పాలు పంచుకొంటు న్నాడు.

హఠాత్తుగా వారి ఆనందానికి అంతరాయం కల్గింది.

ఎవరో భయపడి పెద్దగా అరిచారు. క్షణాల్లో చిన్న గుంపు తయారయిం దక్కడ. కెప్టెన్ ఖోస్లా కూడా 'ఏం జరిగిందంటూ అటువైపు నడిచాడు.

గుంపుగానున్న జనం తొలిగి దారి యిచ్చారతనికి. మధ్యలోనున్న దృశ్యం చూసి దిగ్భ్రాంతుడయ్యాడు కెప్టెన్ ఖోస్లా.

గుండెల కరకు దిగిన కత్తిపిడి పైన రక్తంతో తడిసి తెల్లటి యూనిఫాం ఎర్రగా అయిపోయింది. పళ్ళు బిగ పట్టినట్లున్నాయి. చివరి క్షణాలలో బాగా కొట్టుకొని ఉండాలి. ఒక చేయి కత్తిపిడిమీద ఉంది.

నౌకా సిబ్బందిలో స్వీపర్ అతను. దారుణంగా హత్య చేయబడ్డాడు. అక్కడా శవాన్ని చూసిన పాసెంజర్స్ అంతా భయపడిపోయారు.

కెప్టెన్ ఖోస్లాకు మతిపోయినట్లయింది. కాని అంత లోనే కర్తవ్యం స్ఫురించింది. క్షణాలలో డెక్ అంతా ఖాళీ అయింది. ఇంతకుముందున్న ఉత్సాహం, హుషారు మాయం అయిపోయాయి.

కెప్టెన్ ఖోస్లా కబురు అందుకొని, షిప్ మెడికల్ ఆఫీసర్ డాక్టర్ శ్రీరాజ్ బెహెల్ వచ్చాడు.

తన సిబ్బందిలో ఒకడు అలా దారుణంగా హత్య చేయబడటం ఖోస్లాకి దుఃఖాన్నే గాదు, ఆశ్చర్యాన్నీ కలుగచేసింది. ఇతన్ని చంపాల్సిన అవసరం ఎవరికి కల్గింది? ఎందుకు చంపారు?

కొంతమంది పాసింజర్సు మరలా డెక్ మీదకి రావటంతో, నౌకా సిబ్బందిలో ఇద్దరు వారిని మరలా రిక్వెస్టు చేసి లోనికి పంపవలసి వచ్చింది.

డాక్టర్ బెహెల్ ప్రాథమిక పరీక్ష ముగించి, లేచి నిలబడ్డాడు.

"ఇతను మరణించి రెండు గంటల పైగా అయింది. అంటే పదిన్నర, పదకొండు గంటల మధ్య."

కెప్టెన్ ఖోస్లా టైం చూసుకున్నాడు. ఒంటిగంట కావొస్తుంది మధ్యాహ్నం.

కెప్టెన్ కోస్లా వంగి శవాన్ని పరీక్షించాడు. అతనికి ఒక విషయం వెంటనే అర్థం అయింది. స్వీపర్‌ని యిక్కడే డెక్ మీద చంపలేదు. ఎక్కడో చంపి, యిక్కడకు తెచ్చి ఒదిలారు.

యిక్కడే చంపితుంటే రక్త చారికలు డెక్ మీద పడేవి. కాని అవి లేవు.

ఆ శవానికి కాపలాగా యిద్దరిని ఉంచి, తన సిబ్బందికి చకచక ఆర్డర్లు జారీచేశాడు ఖోస్లా. తాను రేడియో రూంలోకి పరుగెట్టాడు. వెంటనే వైర్‌లెస్ ద్వారా ఈ విషయంపై అధికారులకు మెస్సేజ్ పంపాడు.

ఈలోగా అతని సిబ్బంది అందరూ షిప్ మొత్తం గాలించారు. అయినా స్వీపర్‌ని హత్య చేసిన ప్రదేశం తెలియ లేదు. శుభ్రంగా కడిగి ఉంటారు అనుకున్నాడు ఖోస్లా.

తరవాత కెప్టెన్ కోస్లా ఆజ్ఞపై స్వీపర్ శవాన్ని స్టోర్ రూంలో భద్రపరిచారు.

## 2

"స్టేట్ ఆఫ్ హర్యానా" పైన మొత్తం నూటయాభై పైనే ఉన్నారు పాసింజర్స్, చిన్నా, పెద్దా అంతా

కలిపి. వాళ్ళల్లో పిల్లలను, ఆడవాళ్ళను మినహాయిస్తే మిగిలినవారు నూట ముప్పై ఎనిమిదిమంది.

కెప్టెన్ కోస్లా బుర్ర గోక్కున్నాడు. ఇందరిలో ఎవరిని అనుమానించేట్టు?

వీటిని పట్టించుకోకుండా మౌనంగా సాగిపోతోంది షిప్.

కెప్టెన్ ఖోస్లాకు అందిన మెస్సేజిలో ఇండియా గవర్నమెంటు వెంటనే యిద్దరు ప్రభుత్వ అధికారులను పంపుతున్నామని, ఈ హత్యా రహస్యాన్ని వారు ఛేదిస్తారని ఉంది.

వారి రాక కోసమే ఎదురు చూస్తున్నాడు కెప్టెన్ కోస్లా. నిర్జనమైన డెక్ మీద నిలబడి అటూఇటూ చూస్తున్నాడు.

మరి కొంత సేపటికి దూరంగా విమానం వొస్తున్న శబ్దం అయింది. కొన్ని నిముషాలలోనే అది షిప్‌కు దగ్గరయింది.

కెప్టెన్ ఖోస్లా ఆర్డర్ పై షిప్ వేగం తగ్గించబడింది. ఆ విమానం షిప్ వద్దకు వచ్చి, షిప్ చుట్టూ చక్కర్లు కొట్టసాగింది. అయిదారు నిమిషాలనంతరం విమానం తలుపు తెరుచుకొని, పారాచూట్‌లద్వారా యిద్దరు క్రిందికి దూకారు.

కోస్లా సిబ్బంది సహాయంతో వారు డెక్ పైకి చేరుకున్నారు. విమానం వొచ్చిన దిశలోనే వెళ్ళిపోయింది.

తాము ధరించిన పారాచూట్‌లు విప్పి, కోస్లా సిబ్బందికి యిచ్చారు వారు.

కెప్టెన్ కోస్లా తనని పరిచయం చేసుకున్నాడు.

"గ్లాడ్ టు మీట్ యు. మై నేమ్ ఈజ్ శంకర్ సింగ్" ఎర్రగా, పొడుగ్గా ఉన్న వ్యక్తి అన్నాడు.

"నా పేరు మహేందర్" రెండో వ్యక్తి తనను పరిచయం చేసుకున్నాడు. అతనూ దాదాపు శంకర్ సింగ్ అంత పొడుగున్నాడు. ఇద్దరి వయసు ముప్పై అయిదుకి మించి ఉండదు.

"రండి" అంటూ లోనికి దారితీసాడు కోస్లా.

అతనెంత రహస్యంగా ఉంచినప్పటికి ఆ వచ్చిన వారెవరో ప్యాసింజర్స్ ఊహించక పోలేదు. వారిలో ఆశలు చిగురించాయి.

కెప్టెన్ కోస్లాను అనుసరించి, అతని కాబిన్ లోకి నడిచారు శంకర్ సింగ్, మహేందర్ లు.

శంకర్ సింగ్ టీ తాగుతూ ఖోస్లా వైపు చూసి అన్నాడు.

"కెప్టెన్! హంతకుడు లేక హంతకులు నిస్సందేహంగా ఈ షిప్ మీదే ఉన్నారు. మనం త్వరగా గమ్యస్థానం చేరుకుంటే ఎవరిదోవన వారు పోతారు. అప్పుడు వారిని పట్టుకోవడం కష్టం. అందుచేత ఒక పనిచేయండి. కావాలని అలస్యం చేస్తున్నారని ఇతరులకు తెలియకుండా షిప్ వేగం తగ్గించండి. షిప్ లోని ఇంజన్స్ పాడైపోయాయని, ఎక్కువ వేగంతో పోకూడదని పాసింజర్స్ కి తెలియచేయండి. ఈలోపున మేమిద్దరం పరిశీలించి, అపరాధులెవరో కనుక్కుంటాము."

శంకర్ సింగ్ సూచన్ని మహేందర్ కూడా బలపరచటంతో అయిష్టంగానే ఒప్పుకున్నాడు కెప్టెన్ ఖోస్లా. అసలతనికి యిలా అర్థాంతరంగా ఆఫీషియల్స్ ని పంపటంతో తల తీసేసినట్లుగా ఉంది. అయినా వారి సలహాలను తు.చ. తప్పకుండా పాటించమని ఇదివరకే ఆర్డర్స్ రావటంవల్ల ఒప్పుకోక తప్పలేదు ఖోస్లాకి.

"ఆల్ రైట్! మీరు చెప్పినట్లే చేస్తాను," అన్నాడు చివరికి ఖోస్లా. తరువాత ముగ్గురూ లేచి, బయటికి నడిచారు.

శంకర్ సింగ్, మహేందర్ లు శవం కన్పించినచోట పరిశోధనలు సాగించారు. కొత్తగా ఏమీ తెలియలేదు.

ఆ రాత్రి డైనింగ్ టేబుల్స్ వద్ద అంతా సమావేశమై ఉండగా కెప్టెన్ కోస్లా లేచి నిలబడి ఒక్కసారి గొంతు సవరించుకున్నాడు. అతనేదో చెప్పబోతున్నాడని అర్థం అయింది అందరికి. క్షణంలో కలకలం తగ్గి సద్దుమణిగింది.

"లేడీస్ అండ్ జంటిల్మన్! ప్రస్తుతం మనం ఎటువంటి పరిస్థితులలో ఉన్నామో మీకు తెలుసు. మన షిప్ సిబ్బందిలో ఒకరు దారుణంగా హత్యచేయబడ్డారు. దానిసంగతి ఇంకా తేలకముందే మరో విషాదవార్త మీకు చెప్పాల్సి వస్తున్నది," అని ఆగి అందరివైపు ఒకమారు చూశాడు.

ప్రతి ఒక్కరు ఊపిరి బిగించి అతను చెప్పబోయే దాని కోసం ఎదురు చూస్తున్నారు.

"మీరంతా ఈ హత్యతో బాగా అప్ సెట్ అయి వున్నారని తెలుసు. సింగపూర్ త్వరగా చేరుకోవాలని ఆతృత చెందుతున్నారని నేను గ్రహించగలను. కాని కొన్ని సాంకేతికమైన యిబ్బందులవలన షిప్ వేగం తగ్గించవలసి వచ్చింది. ఇంజన్ లోని కొన్నిలోపాలు దీనికి కారణం. వాటిని బాగుచేయటానికి కొద్దిరోజులు పట్టుతుంది. అందుచేత మన ప్రయాణం మరికొన్నిరోజులు పొడిగించవలసి వస్తుంది," ఇంకా ఏదో చెప్పబోతున్నాడు ఖోస్లా.

సిబ్బందిలోని ఒకవ్యక్తి వచ్చి అతనికి అంతరాయం గలిగించాడు. చెబుతున్నది ఆపి, ఏమిటన్నట్లు చూశాడు ఖోస్లా. అతను దగ్గరకువచ్చి చెవిలో ఏదో చెప్పాడు.

"ఎక్స్‌క్యూజ్ మి. ఏదో మెస్సేజ్. ఎంజాయ్ యువర్ డిన్నర్" అని అతనివెంట నడిచాడు కెప్టెన్ ఖోస్లా.

ఇద్దరూ రేడియో రూంలోకి దారితీశారు. రూం బయటే యెదురయ్యాడు శంకర్ సింగ్.

"ఏమయ్యింది? ఎందుకు కబురు చేశారు?" ఆత్రంగా అడిగాడు కెప్టెన్ ఖోస్లా.

"రండి" అంటూ లోనికి నడిచాడు శంకర్ సింగ్. లోపలి దృశ్యం చూసి, అచేతనంగా నిలబడిపోయాడు కెప్టెన్.

వీపులో దిగిన కత్తితో, ప్రాణాలు కోల్పోయిన శరీరంతో, కుర్చీలో ముందుకు వాలిపోయివున్నాడు వైర్ లెస్ ఆపరేటర్.

## 3

"మా కళ్లెదుటే యింత ఘోరం జరుగుతుందని ఊహించలేకపోయాం" బాధపడుతూ అన్నాడు శంకర్ సింగ్.

అతని మాటలతో తేరుకున్నాడు కెప్టెన్ ఖోస్లా. అయోమయంగా అతనివైపు చూశాడు. శంకర్ సింగ్ ముఖం గంభీరంగా వుంది.

కెప్టెన్ ఖోస్లా డాక్టర్‌కి కబురుజేశాడు. రెండో హత్య అని తెలియగానే అదిరిపోయాడు ఆయన. అయినా తన డ్యూటీ తను నిర్వర్తించాడు.

కెప్టెన్ కోస్లా హృదయంలో అనుమానాందోళనలు చోటు చేసుకున్నాయి. కోపం ముంచుకొచ్చింది.

"మీరు యిక్కడుండగానే మరో హత్య జరిగింది ఇంకా నా సిబ్బందిని ఎంతమందిని నాశనం చేస్తారో ఊహించలేకున్నాను. మీరు షిప్ మీద దిగి ఆరేడు గంటలు దాటాయి. ఇంతవరకు ఒక్క క్లూ కూడా దొరక లేదు. అంతా అయ్యాక విచారిస్తే ఏం లాభం?" అంటూ తన మనసులోని ఆవేదనని వెళ్ళగ్రక్కాడు కోస్లా.

అదివిని కూడా మౌనంగా ఉండిపోయాడు శంకర్ సింగ్. కెప్టెన్ ఎంత బాధపడుతున్నాడో అతనికి అర్థం అయ్యింది. అదీగాక అతనన్నదీ నిజమే! తన పరిశోధన ఒక్క రవ్వకూడా ముందుకు జరగలేదు.

"ఇతను మరణించి అరగంటకంటె ఎక్కువవలేదు."

డాక్టర్ శ్రీరాజ్ బెహెల్ మాటలకు శంకర్ సింగ్ నే కాక కెప్టెన్ కూడా త్రుళ్ళి పడ్డాడు.

నమ్మలేనట్లు డాక్టర్ వైపు చూశాడా కోస్లా.

"ఇంతకు శవాన్ని ఎవరు చూశారు ముందుగా?" అన్న శంకర్ సింగ్ ప్రశ్నతో తేరుకున్నాడు కోస్లా.

"నేను సర్!" నౌకా సిబ్బందిలో ఒకరన్నారు.

"జరిగిందేమిటో త్వరగా చెప్పు!" అసహనంగా అరిచాడు కోస్లా.

"డైనింగ్ హాలులో అందరికీ డిన్నర్ సర్వ్ చేస్తున్నాను. యింతలో రేడియో రూంనుంచి ఫోన్ వచ్చింది. వెంటనే కాఫీ పంపమని, నేను తీసుకొని వెళ్ళాను. తలుపులుమూసి ఉన్నాయి. తెరచేసరికి ముందుకు వాలి, చనిపోయి ఉన్న ఆపరేటర్ కన్పించాడు. భయంతో

చిన్నగా అరిచాను. ఈ సంగతి వెంటనే అటుగా వస్తున్న శంకర్ సింగ్ గారితో చెప్పాను. వారు కూడా చూసి మీకు కబురు చేయమన్నారు'' చెప్పాడు అతను.

కెప్టెన్ కోస్లా ముందుకు కదిలి రేడియో రూంని పరీక్షించటం మొదలు పెట్టాడు. అందులో మార్పేమీ కన్పించలేదు బోయ్ తెచ్చిన కాఫీ ట్రే, పాట్ యింకా బల్లమీదే ఉన్నాయి.

కెప్టెన్ కోస్లా చూపులు హఠాత్తుగా ఆపరేటర్ ముందున్న మెస్సేజ్ రిసీవింగ్ బుక్ మీద పడినాయి.

రిసీవ్ చేసుకున్న ప్రతి మెసేజ్ నీ దానిలో రికార్డ్ చేస్తారు. ఒరిజినల్ కెప్టెన్ కిపంపి, డూప్లికేట్ గా కార్బన్ కాపీని ఉంచుతారు.

ఆ బుక్ తెరిచి చూశాడు కోస్లా. ఎవరో రెండు కాయితాలను అతిజాగ్రత్తగా చించినట్లు జాగ్రత్తగా గమనిస్తే తెలుస్తోంది.

దానిముందు వచ్చిన మెసేజ్ చూశాడు. మూడు గంటలక్రితం వచ్చిన మెస్సేజ్ అది, అది తనకు అందినది. అంటె దీని తర్వాత వచ్చిన మెస్సేజ్ ని ఎవరో డూప్లికేట్ తో సహా చించుకు పోయారన్నమాట. దానిలో ఏముంది? దానివల్ల హంతకుడికి నష్టం ఏమిటి?

శంకర్ సింగ్ సలహాపయిన ఈ వార్తను అధికారులకు చేరవెయ్యలేదు. అతనికి మరో అవకాశం యిచ్చి చూద్దామనుకున్నాడు.

''యింతకూ మహేందర్ గారు ఏరీ?'' హఠాత్తుగా అడిగాడు కోస్లా.

''పాసింజర్స్ కాబిన్ లు చెక్ చేయడానికి వెళ్ళాడు.'' ప్రత్యుత్తరము ఇచ్చాడు శంకర్.

ఆశ్చర్యపోయాడు కోస్లా. "పాసింజర్స్ రూమ్స్ ఎందుకు?"

"చూడండి కెప్టెన్! హంతకుడు మనలోనే ఉన్నాడు. మీ సిబ్బందిలో ఎవరయినా ఈ హత్యలు చేస్తున్నారని మీరు భావిస్తున్నారా?" సూటిగా అడగటంతో తబ్బిబ్బయ్యాడు కెప్టెన్ కోస్లా.

"ఆ ఆలోచన నా కింతవరకు రానేలేదు! నా సిబ్బంది లోని వ్యక్తులు అటువంటి వారు కాదు," దృఢ కంఠంతో అన్నాడు కోస్లా.

"యస్. అందుకే పాసింజర్స్‌ని చెక్ చేస్తున్నాం. పాసింజర్స్‌లోనే ఎవరో తప్పకుండా హంతకులై ఉంటారు. అంతేకాదు.

నా ఊహ ప్రకారం ఒకరికంటె ఎక్కువే ఉండవచ్చు హంతకులు. లేకపోతే యింత పకడ్బందీగా హత్యలు చెయ్యటం ఒక్కడివల్ల సాధ్యంగాదు.

అందుచేత డైనింగ్ టేబుల్స్‌వద్ద అందరినీ వీలయినంతగా ఎక్కువసేపు గడిపేలా చూడండి. ఏదో ఒక విధంగా ఆలస్యం చేస్తే మాకు మంచిది. ఈ లోపున మే మిద్దరం కాబిన్స్ చెక్ చేయటం పూర్తిచేస్తాం!"

తరవాత శంకర్‌సింగ్ వెళ్ళిపోయాడు. ముఖంమీద నవ్వు పులుముకొని డైనింగ్ హాలులోకి నడిచాడు కెప్టెన్ కోస్లా. యింకా డిన్నర్ పూర్తికాలేదు.

## 4

తెల్లవారింది. ఎటువంటి వార్త వినవలసి వస్తుందోనని బిగపట్టుకు కూర్చున్న కెప్టెన్ కోస్లా ఎనిమిదిగంటలవుతున్నా ఏ విధమైన కంప్లైంటూ రాకపోవడంతో కాస్త నిమిత పడ్డాడు.

కాలకృత్యాలు ముగించుకుని, డ్రస్ ధరించి, రేడియో రూం వద్దకు నడిచాడు. నిన్న వైర్ లెస్ ఆపరేటర్ చని పోవడంతో ఆ రూంకి తాళం వేసి ఉంచాడు.

తాళం తెరిచి లోనికి రావటంతోనే నిర్ఘాంత పోయాడు.

వైర్ లెస్ ట్రాన్స్మిటర్ సెట్ అంతా భిన్నా భిన్నంగా ధ్వంసం అయిపోయిఉంది. ఇక మరెవ్వరూ దానిని రిపేర్ చేయలేరు.

తలమీద పిడుగులు పడినట్లయింది కెప్టెన్ కోస్లాకు. తాళం వేసిఉన్న రూంలోకి ఎలా ప్రవేశించ గలిగారు అన్న సందేహం జనించింది. ఆయన దృష్టి వెంటిలేటర్ మీద పడింది. కాని దానిద్వారా ఒక మనిషి లోనికి రావటం అసంభవం. తాళం తన దగ్గరేఉంది. అయితే ఎలా వొచ్చారు?

చటుక్కున ఒకటి తోచిందతనికి. క్రితంరోజు రాత్రి పార్టీ అయిన తర్వాత తను కాబిన్ కు నడిచాడు. అక్కడ లిక్కర్ తాగాడు. ఎంత అపుకుందామన్నా మత్తు ఆగలేదతనికి. అంటె తను తాగిన ఆ పానీయంలోనే మత్తుమందు కలిపి ఉంటారు.

కెప్టెన్ కోస్లా పిడికిళ్ళు బిగుసుకున్నాయి. పెద్ద గూడుపుఠాణీ ఏదో జరుగుతూంది తన షిప్ మీద. పాసింజర్స్ అంతా అనుమానాస్పదంగా కనుపించ సాగార తనికి.

"ఈ యిద్దరు సి. ఐ. డి. లు ఏమయ్యారు?" అను

కుంటూ కంట్రోలు రూంకి తిరిగి వచ్చాడు. అక్కడ అతని కోసం మరో వార్త ఎదురు చూస్తూంది.

దానిని వింటూనే అతని మెదడు పనిచేయటం మానేసి, మొద్దు బారి నట్లయింది. రెండు నిమిషాల తర్వాత తేరుకుని పాసింజర్స్ కాబిన్ వయిపు అడుగులు వేశాడు.

కెప్టెన్ కోస్లా రాక చూసి, అంతవరకు తమ కాబిన్స్ లోపల ఉండి, తలలు బయటికి పెట్టి చూస్తున్న పాసిం. జర్సు, చటుక్కున తలలు లోనికి లాక్కుని తలుపులు వేసు కున్నారు.

బరువుగా అడుగులు వేసుకుంటూ ఒక కాబిన్ లోకి అడుగు పెట్టాడు. లోపల శంకర్ సింగ్, మహేందర్ లు, మరో యిద్దరు నౌకాసిబ్బంది ఉన్నారు.

బెడ్ మీద ఒకవ్యక్తి పడుకొని ఉన్నాడు. కాని అతని ప్రాణాలు అతని దగ్గరలేవు.

నలభై ఏళ్ళుంటాయి. బొంబాయిలో పేరు పొందిన పెద్ద వ్యాపారి అతను. గొంతు నులిమి హత్య చేశారని స్పష్టంగా తెలుస్తోంది.

నెమ్మదిగా శంకర్ సింగ్ వైపు చూశాడు కోస్లా.

"బయట వరండాలో హత్య చేయబడి ఉన్నాడు. ఉదయాన్నే పాసింజర్సు ఇతన్ని చూసి భయపడ్డారు. మీ కోసం చూస్తే మీరు లేరు. వెంటనే మేము బయట నున్న శవాన్ని లోనికి చేర్చాము. పరిశోధనల వల్ల ఇతను నిన్నరాత్రి పదకొండు గంటల వరకు బాగానే ఉన్నాడని తెలిసింది."

అతను చెప్పినదంతా మౌనంగా విన్నాడు కోస్లా. ఆ కాబిన్ అంతా పరికించాడు. ఒక మూలగా ధ్వంసం

చేయబడిన వస్తువులేవో కన్పించాయి. దగ్గరికి పోయి చూశాడు. ట్రాన్సిస్టరు రేడియో ముక్కలు అవి. ఎవరో పగలకొట్టి నాశనం చేశారు.

కెప్టెన్ కోస్లా మనస్సులో అనేక అనుమానాలు. లక్ష సందేహాలు. ట్రాన్సిస్టరుని పగల కొట్టవలసిన అవసరం ఏమిటి?

వైర్ లెస్ ట్రాన్స్మిటర్ ని పగలగొట్టటంతో బయటి ప్రపంచంతో తమకు సంబంధం తెగిపోయింది. కాని రేడియోను ఎందుకు పగల కొట్టారు?

కెప్టెన్ కోస్లా ఒక నిర్ణయానికి వచ్చాడు. అతని ముఖంలో మారుతున్న భావాలను, రంగులను గమనిస్తూనే ఉన్నాడు శంకర్ సింగ్.

"ఆల్ రైట్! యిక ఉపేక్షిస్తే లాభంలేదు. షిప్ చాలా స్లోగా పోతూంది. వెంటనే వేగం పెంచమని ఆర్డరు ఇస్తాను. సింగపూరు చేరితే అక్కడి పోలీసులే చూచుకుంటారు."

"కెప్టెన్" అన్న మహేందర్ మాటలకు, కదల బోయిన కోస్లా ఆగిపోయాడు.

"మా మీద మీకు నమ్మకం పోయినట్లుంది. సింగ పూర్ చేరే లోపల హంతకులను పసిగట్టుతాం. కాని కాస్త టైం తీసుకుంటుంది."

"నో! వీల్లేదు. ఇలా రోజుకి యిన్ని హత్యలు జరుగు తుంటే చేతకాని వాళ్ళకి మల్లే చేతులు ముడుచుకొని కూర్చోలేను. వెంటనే షిప్ సింగపూర్ వీలయినంత త్వరగా చేరాలి. ఈ విషయం కూడా గవర్నమెంట్ కి తెలపాలి."

"ఎలా కెప్టెన్? వైర్‌లెస్ ట్రాన్స్ మీటరు ముక్క లయిందిగా?" ఆ మాట అనడమేమిటి, మహేందరు నాలుక కొరుక్కోవడం, కోస్లా ధడాలున తలెత్తి అతని ముఖంలోకి చూడటం జరిగిపోయింది.

"మీకు...మీ కెలా తెలుసు?"

కోస్లా ప్రశ్నకు జవాబుగా శంకర్‌సింగ్, మహేందరు చేతుల్లో రివాల్వరులు సమాధానం యిచ్చాయి క్లిక్ మని.

అదిరిపోయాడు కోస్లా వాటిని చూస్తూనే.

# 5

ఆ రోజు మధ్యాన్నం అంతా డైనింగు హాలులో ఉన్న సమయాన అక్కడికి వచ్చాడు శంకర్‌సింగ్. అతన్ని చూడగానే హాలులో ఉన్న శబ్దం సద్దుమణిగింది.

అందరూ తన వైపు దృష్టి నిలపడం గమనించి, గొంతు సవరించుకుని చెప్పడం మొదలుపెట్టాడు శంకర్‌సింగ్.

"లేడీస్ అండ్ జంటిల్మన్! మీ ఆనందానికి అంతరాయం కలిగిస్తున్నందుకు మన్నించండి. ప్రస్తుతం మనం ఎటువంటి పరిస్థితులలో ఉన్నామో మీకు తెలుసు. అడుగడుగునా భయానకమయిన హత్యలు సాగిస్తూ, మన మధ్యే సంచరించే హంతకులతో ప్రయాణం కొనసాగిస్తున్నాము. ఇక్కణ్నుంచి ఎంత త్వరగా బయటపడితే అంత బాగుణ్ను అని మీరు అంతా తలపోస్తున్నారు.

కాని మనం ఒకటి తలిస్తే దైవం మరొకటి తలిచాడు. యిప్పటికే యంత్రాలలోని లోపాలవల్ల నౌక వేగం తగ్గి కుంటి నడక సాగించవలసి వస్తూంది. అంతేగాక ఇంజన్‌లోని అనుకోని మరో లోపంవల్ల యిమ ఆపద సంభవించింది."

ఆ మాట వినగానే పాసింజర్స్‌లో కలకలం చెల రేగింది. ఆత్రంగా శంకర్ వైపు చూశారు. అతడు ప్రతి ఒక్కరినీ పట్టిపట్టి పరీక్షిస్తున్నాడు. కోలాహలం సద్దు మణిగాక తిరిగి ప్రారంభించాడు.

"మీరు భయపడవలసిన పనిలేదు. మనం ఎక్కడో ఒకచోట తప్పకుండా ఆగవలసి వస్తున్నది. ప్రస్తుతం నౌకాసిబ్బంది అంతా ఆ యింజన్‌లోని లోపాలను సరి దిద్దటంలో మునిగిపోయి ఉన్నారు. మన కెప్టెన్ కూడా ఆ పనిమీదే ఉద్యుక్తులై ఉన్నారు. ఆయన తరపున నేను రావలసి వచ్చింది.

ప్రస్తుత పరిస్థితులలో నౌకకు ఎప్పుడే ప్రమాదం జరుగుతుందో, చెప్పలేము. మీ అందరిని రక్షించే బాధ్యత మాది. మేము చెప్పినట్లు వింటే యిక్కణ్నుంచి క్షేమంగా బయట పడవచ్చు. దయచేసి యిప్పటినుంచి మీరందరూ యిక్కడే ఉండి పోవలసినదిగా కోరు తున్నాను. సిబ్బంది మీకు కావలసిన ఆహారవ్యవహారాలు సమకూరుస్తుంది. మీ మీ కాబిన్‌లను ఖాళీచేసి అందరూ యిక్కడికే చేరుకోవలసిందిగా రిక్వెస్ట్ చేస్తున్నాను."

ముగించి అందరి వంక చూశాడు శంకర్ సింగ్. శంకర్ సింగ్ తమతో నిజం చెప్పటం లేదేమోనన్న సందేహానికి లోను అయ్యారు కొందరు. కాని అందరి మనస్సులూ కీడుని శంకించాయి. వారి ముఖాల్లో ఆందోళన, భయం గోచరించాయి.

రెండు నిమిషాలాగి తన అనుచరులయిన సిబ్బందికి సైగ చేసి అక్కణ్నించి కదిలాడు శంకర్ సింగ్.

మరుక్షణమే హాలులో గోల పెద్దదయింది. ఆ గోల

దూరం అవుతుండగా కంట్రోలు రూంలోకి నడిచాడు శంకర్ సింగ్.

# 6

కెప్టెన్ కాబిన్‌లోకి నడిచాడు శంకర్ సింగ్.

అతనివంక క్రోధం నిండిన కళ్ళతో చూశాడు కెప్టెన్ కోస్లా.

కెప్టెన్, బెహెల్ యిద్దరూ బంధింపబడి ఉన్నారు. ఆ యిరువురి కాళ్ళు, చేతులు వెనక్కి ఉంచి నైలాన్ తాళ్ళతో కట్టివేయబడి ఉన్నాయి. నోటికి టేప్ అతికించబడి ఉంది.

కోస్లా అసహనంగా అటూ ఇటూ గింజుకుంటున్నాడు. వారికి ఎదురుగా కూర్చున్నాడు శంకర్ సింగ్. నవ్వుతూ వారి వయిపు చూశాడు.

"సారీ కెప్టెన్! మిమ్మల్ని బంధించటం నా కిష్టం లేదు. అయినా మిమ్మల్ని "ఫ్రీ"గా వదిలితే పిచ్చి పను లేవో చేస్తారు. మిమ్మల్ని చంపక తప్పదు. అందుకే యిష్టం లేకపోయినా బంధించాల్సి వచ్చింది.

నోటికి టేప్ ఉండటంవల్ల కెప్టెన్ కోస్లా ఏమీ అన లేక పోయాడు గాని, అతని కళ్ళల్లో కసి కొట్టొచ్చి నట్లు కన్పిస్తూనే ఉంది.

"ప్రస్తుతం ఈ షిప్‌కి ఇన్‌ఛార్జ్‌గా ఉన్నాను. మా అవసరం తీరిపోగానే మిమ్మల్ని వదిలేస్తాము. పాసింజర్సుకి కూడా అబద్ధాలేవో చెప్పి నమ్మించాను. కెప్టెన్‌వి కనుక నీకు నిజం చెప్పటం నా ధర్మం."

జేబులోనుంచి సిగరెట్ తీసి, ముట్టించుకున్నాడు శంకర్. కెప్టెన్ కోస్లాకి, డాక్టరు శ్రీరాజ్ బెహెల్‌కి అతను చెప్పేదేమిటో వినాలనే కుతూహలం జనించింది.

"మొదటినుంచి జరిగింది చెబుతాను వినండి. నిజానికి మేము యిండియా ప్రభుత్వం పంపిన అధికారులము కాము. ఇండియాకు శత్రుభావంగల ఒకానొక దేశానికి సంబంధించిన వాళ్ళం. ఆ దేశమేదో మీ కనవసరం.

ప్లాస్టిక్ సర్జరీతో మా యిద్దరినీ ఇండియన్స్‌లా తయారు చేశారు. మమ్మల్నే కాదు, ఇంకా కొంత మందిని కూడా తయారుచేసి మీ దేశంలోకి వదిలారు. వారంతా రకరకాల ఉద్యోగాలు, వృత్తులలో ఉంటూ రహస్యంగా గూఢచారిత్వం నెరపుతున్నారు. అఫ్‌కోర్స్! ఈ షిప్‌లో కూడా మా వాళ్ళు అయిదుగురు మీ సిబ్బంది రూపంలో ఉన్నారనుకో!" నవ్వాడు శంకర్‌సింగ్.

కెప్టెన్ కోస్లా, డాక్టరు శ్రీరాజ్ బెహెల్‌ల ముఖాలు వెలవెలాబోయాయి. ఈ దారుణాలలో ఎంత రహస్యం యిమిడి ఉంది!

"మొట్టమొదటి హాత్య ఈ షిప్‌లో, ఎందుకు జరిగింది అన్నది మాకుతప్ప యిక్కడెవరికీ తెలియదు. అసలు ఇంత గంద్రగోళం ఎందుకో తెలుసా? ఈ షిప్‌లో రహస్యంగా యురేనియం ఖనిజం ఎగుమతి చేయబడుతూంది."

శ్రోతలిద్దరి కళ్ళల్లో విపరీతమయిన ఆశ్చర్యం కన్పించింది. అది గమనించి నవ్వాడు సింగ్.

"అవును. ఈ నిజం మీకే కాదు, ఈ షిప్‌లోని పాసింజర్సుకి యిద్దరికి తప్ప మరెవ్వరికీ తెలియదు.

ఇండియాకు సంబంధించిన వ్యక్తులు కొందరు కలకత్తా నుంచి దొంగిలించి తెచ్చిన యురేనియం ఖనిజాన్ని పెద్ద పెద్ద బాక్సులలో విశాఖపట్నం రవాణాచేసి, అక్కణ్నుంచి సింగపూరు తరలించుకు పోవటానికి ప్రయత్నం చేశారు. చాలా పకడ్బందీగా సాగించారీ వ్యవహారాన్ని.

కస్టమ్స్‌కిగాని, యితరులకుగాని ఏ విధమైన సందేహానికి ఆస్కారమివ్వకుండా బొమ్మలు రవాణా చేస్తున్న పెట్టెలతో వీటిని ఎగుమతి చేశారు. దాదాపు డెబ్భై, ఎనభై ఉన్న పెట్టెలమధ్య ఇరవై వరకు యూరేనియం ఖనిజం ఉన్న పెట్టెలున్నాయి. ఆ పెట్టెలలోకూడా చుట్టూ బొమ్మలు అమర్చారు. తేలిగ్గా ఒక పట్టాన బయట పడదు ఖనిజం.

ఆగి గట్టిగా దమ్ము పీల్చుకున్నాడు శంకర్ సింగ్.

"అయితే తలవనితలంపుగా వారి ప్రయత్నం మా ఏజెంట్ల కంటబడింది. అయితే అప్పటికే విశాఖపట్నం నుంచి ఈ షిప్ బయలు దేరింది. మేము ఈ షిప్‌లో నున్న ఏజెంటుతో మాట్లాడాము వైర్‌లెస్‌లో. అతనూ బాక్సులున్నాయని తెలిపాడు.

అదే సమయంలో మీ సిబ్బందికి చెందిన స్వీపర్ మా కాన్వర్‌జేషన్ విన్నాడు. అతనికి అర్థంగాకపోయినా ఏదో గూడుపుఠాణీ జరుగుతుందని అర్థం చేసుకున్నాడు. అతన్ని బ్రతకనిస్తే మాకు ప్రమాదం. అందుకే అతన్ని చంపి డెక్‌మీద పడవేశారు. ఈ రకంగా మొదటి హత్యతో నాటకం ప్రారంభమయింది."

అతని చేతిలో సిగిరెట్ అయిపోయింది. దానిని క్రింద పడవేసి మరొకటి ముట్టించుకున్నాడు. రెండు దమ్ములు లాగి శ్రోతల వైపు చూసి నవ్వాడు.

"తరవాత ఈవిషయాన్ని మీరు అఫీషియల్స్‌కి తెలియ చేశారు. అక్కడ ఉన్న మా ఏజెంట్ల ప్రోద్బలంమీద తాము వెంటనే ఇద్దరు సి. ఐ. డి. అధికారులను పంపు తున్నట్లుగా మీకు తెలియచేసింది. ఈ అవకాశాన్ని ఉపయోగించుకున్నాము. విమానంలో వస్తున్న వారిని,

దోవలోనే వారి విమానాన్ని కూల్చివేసి, వారిస్థానంలో మేము బయలుదేరాము.

మా ఆదేశం పైన మీరు షిప్ వేగాన్ని తగ్గించారు. ఇందువల్ల మాకు లాభం. ఎందుకో తెలుసా? మన వెనకగా మా దేశానికి సంబంధించిన నౌక ఒకటి వస్తూంది.

మేము షిప్ మీద దిగిన తర్వాత మా ప్రయత్నాలు ఆరంభించాము. షిప్ సిబ్బందిలో ఉన్న మా వ్యక్తులు మాకు సాయం చేశారు. మహేందర్ స్టోరు రూమ్స్ గాలించడం ప్రారంభించాడు. నేను బయట పరిశోధనని సాగిస్తున్నట్లు నాటకం నడిపాను.

ఇందులో డ్రాబేక్ ఏమిటంటే మాలో ఎవ్వరికీ యురేనియం ఏయే పెట్టెలలో ఉన్నది తెలియదు.

యురేనియం ఉన్న బాక్స్‌లపైన ఒక గుర్తు ఉంది. వాటికోసం వేట సాగించాడు మహేందర్.

ఆ సమయంలోనే పాసింజర్స్‌కి సంబంధించిన వ్యక్తి ఒకడు లోనికి వచ్చాడు. నిజానికతడు ఆ బాక్స్‌ల వెంట వర్తకులచే పంపబడ్డ ప్రతినిధి. బహుశా మా ప్రయత్నాన్ని కనిపెట్టి వచ్చాడో, ఏమో అతన్నికూడా హతం చేసి, రహస్యంగా సముద్రంలో పారేశాము.''

'మైగాడ్! ఇది జరిగినట్లు మాకు తెలియలేదే?' అన్న భావం శ్రోత లిద్దరి కళ్ళల్లో కన్పించింది.

"అవును. ఈ హత్య సంగతి ఎవరికీ తెలియదు. హతుడి స్నేహితుడు, అతనితో పాటు పంపబడ్డవాడు కూడా నోరెత్తలేదు. మాకు భయపడి ఉంటాడు.

సరే. తర్వాత వినండి! ఆ తర్వాత భారత ప్రభుత్వం నుంచి మీ కొక మెస్సేజ్ వచ్చింది. సి. ఐ. డి. లను

పంపుతున్న విమానం కూలిపోయిందని. కాని యిది ఊహించిన మేము మా అనుచరుల్ని కాపలాగా ఉంచాము రేడియో రూంకి. అతడే వైర్ లెస్ ఆపరేటర్ ని చంపి, మెస్సేజ్ కాయితాలు దొంగిలించి, చించేశాడు.

అయితే అతడొక పొరపాటు చేశాడు. దాని ఫలితం గానే మీకు మత్తుమందు కలిపిన పానీయం యిచ్చి, తాళాలు దొంగిలించి, వైర్ లెస్ ట్రాన్స్మిటర్ ని పగల కొట్టాల్సి వచ్చింది. అతడాపనిని అప్పుడే చేసి ఉంటే ఇంత శ్రమ ఉండేది కాదు.

అయితే హఠాత్తుగా మరో హత్య చేయాల్సి వచ్చింది. నిజానికి హత్య చేయటం మాకు యిష్టంలేదు. ఈ షిప్ కెప్టెన్ అయిన నిన్ను బెదిరించి, నౌకని కిడ్నాప్ చేయాలనుకున్నాము. అయితే తలవని తలంపుగా హత్యలు చేయక తప్పలేదు.

తన గదిలో కూర్చొని ట్రాన్సిష్టర్ లో వార్తలు వింటున్న పాసింజర్స్ కి హఠాత్తుగా మా మీద అనుమానం వొచ్చింది. విమానం కూలిపోయిన విషయం న్యూస్ లో కూడా చెప్పారు. అతడు బయటికి పరుగెత్తాడు. అయితే అదృష్టవశాత్తు అటుగావస్తున్న మా అనుచరుల్ని చూసి, నీ సిబ్బంది వ్యక్తే అనుకొని, ఈ వార్త చెప్పాడు. అతను కూడా ఆఖరు.

మా దగ్గరగల రహస్య ట్రాన్స్మిటర్ తో మాట్లాడాము. మా కోసం ఎదురు చూస్తున్న మా దేశపు నౌక వెంటనే బయలుదేరింది.

మనం యింకా కొద్ది సేపట్లో త్వరలో ప్రక్కనే ఉన్న ఒక ద్వీపాన్ని చేరుకుంటాం. మర్చిపోయాను. మనం

రూటు మారాము. ఇటుగా ఏ స్టీమరూ రాదు. అంచేత మీకు సహాయం వస్తుందన్న ఆశ వదలుకోండి. అక్కడ బాక్సులను మా షిప్‌లోకి ఎక్కించుకొని, మిమ్మల్ని వది లేసి, మా దారిన మేము వెళ్ళిపోతాము."

చెప్పటం ముగించి, లేచి నిలబడ్డాడు శంకర్ సింగ్.

"మీ అనుమానాలన్నీ తీరినాయి అనుకుంటాను. మీరు మాట్లాడు కోవటానికి వీలుగా మీ నోటి కతికించిన టేప్ లు మాత్రం తీస్కెళ్తాను. మీ కాబిన్ బయట మా అనుచరులున్నారని మరిచిపోకండి."

టేప్ లు లాగేసి, బయటకు పోయాడు శంకర్ సింగ్. అతని వెనకే తలుపులు మూసుకున్నాయి.

దీర్ఘంగా నిశ్వసించాడు కెప్టెన్ కోస్లా. ఆయన హృదయం కొంచెం తేలికపడింది. ఈ హత్యల వెనుక యింత కథ ఉన్నదన్న మాట అనుకున్నాడు.

"మైగాడ్! ఎంత ఘోరం!!" శంకర్ సింగ్ వెళ్ళిన తరువాత అన్నాడు డాక్టర్ బెహెల్.

జరిగినది తలుచుకుంటుంటే కోస్లా మెదడు మొద్దుబారి పోతున్నట్లనిపించింది. ఈ షిప్ కెప్టెన్ అయిన తనకి తెలియకుండానే ఇంతకథ జరిగిందన్న బాధ ఆయనలో ద్యోతక మవుతూంది. అంతకంటె ముఖ్యంగా తన సిబ్బందిలోనే దేశద్రోహులున్నారని జ్ఞప్తికి వచ్చినపుడు ఆయన హృదయం బాధతో విలవిలలాడుతూంది.

తనకు తెలిసిన ఈ నిజాన్ని ప్రభుత్వానికి తెలపాలన్న ఆత్రత. కాని దారేది? నిస్సహాయంగా తనలో తాను గొణుక్కోవటం మినహా మరేమీ చేయలేకపోయాడు.

# 7

శంకర్ సింగ్ నేరుగా కంట్రోలు రూం లోనికి నడిచాడు. అతని అనుచరులు మిగిలిన సిబ్బందిని ఆశపెట్టో, భయపెట్టో లొంగదీసుకున్నారు.

దూరంగా విశాలమయిన దీవి ఒకటి కనిపిస్తోంది. అక్కడ షిప్ కి లంగరు వేయటానికి ఆర్డరు యిచ్చాడు శంకర్ సింగ్.

మహేందర్ ని అక్కడ ఉంచి, తన కాబిన్ లోకి నడిచాడు. పాకెట్ సైజ్ ట్రాన్స్మిటరు తీసి తమ నౌకకు డైరెక్షన్స్ యిచ్చాడు.

మరో అరగంట తర్వాత—అంటె మధ్యాహ్నం మూడున్నర నాలుగు గంటల ప్రాంతంలో దీవివద్ద లంగరు వేయబడినది.

శంకర్ సింగ్ ఆజ్ఞపై పాసింజర్స్ని దింపి, దీవిపై వరసగా నిలబెట్టారు. తెల్లముఖాలతో దీవిని చేరుకున్నారు వారు. కొందరు మాత్రం తమ నౌకను "కిడ్నాప్" చేశారని ఊహించారు.

అందరినీ నిలబెట్టిన తర్వాత శంకర్ సింగ్ వారిని చూస్తూ ఇలా అన్నాడు. "మీలో బాక్స్లకు చెందిన వ్యక్తులు ఎవరో బయటికి రండి. వాటిని మేము స్వాధీనం చేసుకోబోతున్నాం!"

ఎవరూ బయటికి రాలేదు. వస్తారని కూడా అనుకోలేదు, శంకర్ సింగ్. కొంతమంది పాసింజర్స్ అతన్ని ఎదిరించారు. కాని అతడి చేతిలో రివాల్వరు వారిని బలికొనడంతో, మిగిలినవారు ధైర్యం చేయలేక పోయారు.

అందరి చేతులు వెనక్కికట్టి, వాళ్ళ నోటికి టేప్స

అతికించారు. వారితో బాటె కెప్టెన్ కోస్లాను, డాక్టరు బెహెల్‌ను వరసలో ఉంచారు. వారికి కాపలాగా యిద్దరు అనుచరులనుంచి షిప్‌లోకి వెళ్ళిపోయాడు శంకర్ సింగు.

సాయంకాలం అయిదుగంటల ప్రాంతంలో సమీపించింది వారి నౌక. అప్పటికే చీకటిపడి, మేఘాలు కొద్దిగా ముసురు కోవటం వల్ల ఆ షిప్ ఏ దేశానిదైనదీ, దాని గుర్తులవల్ల గ్రహించలేకపోయాడు కెప్టెన్. మౌనంగా చూస్తుండి పోయాడు.

అతని ప్రక్కన ఉన్న డాక్టరు బెహెల్‌కి కోస్లాలోని అంతస్సంఘర్షణ తెలుసు. కాని అతను మాత్రం ఏం చేయగలడు? నిస్సహాయంగా ఉండిపోయాడు.

యూరేనియం బాక్సుల సంగతి ఎలాఉన్నా కెప్టెన్ కోస్లాని మరో విషయం పట్టి బాధిస్తోంది. తమని కిడ్నాప్ చేసిన దుర్మార్గులు తమని వదలరు. తాము తిరిగి నాగరిక ప్రపంచం చేరుకోకుండా చంపి, ఈ దీవి మీదే పాతేసినా పాతేస్తారు. షిప్‌ని ఎలాగోలా పేల్చి వేస్తారు.

తాను తప్పించుకుంటే చాలు ఈ పాసింజర్స్‌ని రక్షించగలడు. దీవిలోకి పారిపోతేనో? లాభంలేదు. వెంటపడతారు.

కెప్టెన్ కోస్లా అక్కడ తమకు కాపలా వున్నవారి వంక చూశాడు. చేతిలో రివాల్వర్సుతో కాపలా కాస్తున్నారు. అందరి చేతులు కట్టివేయడం వల్ల, అంత ప్రమత్తతగా లేరు. తలదిప్పి షిప్స్ వైపు చూశాడు.

రెంటిని దగ్గరగా చేర్చి, రెండు డెక్‌ల మీదకు వెడల్పాటి చెక్కవంతెన వేసినట్లున్నారు. రెండు షిప్‌ల

లోని సిబ్బంది ఒక్కొక్క బాక్స్‌నే జాగ్రత్తగా మోస్తూ వచ్చిన షిప్‌లోకి చేరుస్తున్నారు.

చటుక్కున ఒక ఆలోచన తట్టింది కోస్లాకి.

కాపలావాణ్ని ఒకణ్ని దగ్గరకు రమ్మనమన్నట్లు కళ్ళతో సైగ చేశాడు. అతడు దగ్గరికి రాగానే, టేప్ విప్పు దీయమన్నట్లు సైగ చేశాడు. అతడు క్షణం తటపటా యించి, విప్పదీశాడు.

తనకు దాహంగా ఉందని, మంచినీరు కావాలని చెప్పాడు కోస్లా. కాపలా వాళ్ళిద్దరూ కూడ బలుక్కు న్నారు. ఒకడు లైఫ్‌బోట్‌లో షిప్‌లవయిపు పోయాడు.. మరొకడు దూరంగా ఉన్నాడు.

గబగబా తన ప్లాను, తన ప్రక్కనే ఉన్న బెహా ల్‌కు నెమ్మదిగా చెప్పాడు కెప్టెన్. సముద్రపుతీరం, గాలి హోరులో అతడు మాట్లాడింది ఒక్క బెహాల్‌కే అర్థం అయింది.

అయిదు నిమిషాల తర్వాత రెండోవాడు నీళ్ళ జగ్‌తో వచ్చాడు. చేతులు విప్పమన్నట్లు సైగ చేశాడు కోస్లా. అతడు నవ్వి, నోరు తెరవమని చెప్పి, ఆ నోటిలో పోశాడు, ఆత్రంగా తాగాడు కోస్లా.

తరవాత బెహాల్ కూడా మంచినీళ్ళు కావాలన్నట్లు సైగ చేశాడు. అతడికీ ఆ విధంగానే దాహం తీర్చారు. మరి కొంతమంది కూడా తమ దాహం తీర్చుకున్నారు.

# 8

షిప్స్‌మధ్య బాక్స్‌ల మార్పిడి యింకా పూర్తికాలేదు. బాగా చీకటి పడింది.

రెండు షిప్‌లలోను లైట్లు వెలిగించారు. వీలయినంత

త్వరగా పనిపూర్తి కావటానికి అంతా శ్రమపడుతున్నారు శంకర్‌సింగు, మహేందర్‌లు. ఇతర అధికారులు దగ్గర ఉండి చూస్తున్నారు.

బాగా చీకటి పడటంవల్ల దీవిమీద అందరిని గుంపుగా ఒకచోట పోగుచేసి, వారిమధ్య ఎండు కట్టెలతో చిన్న నెగడు వేశారు. దాని చుట్టూ కూర్చుని చలిని పోగొట్టు కోవడానికి ప్రయత్నిస్తున్నారు పాసింజర్సు.

వారికి కొద్ది దూరంలో మరో నెగడువద్ద కూర్చొని చలికాచుకుంటూ వీరిని కాపలా కాస్తున్నారు ఆ యిదరు.

ఇంతకుముందు నీరు తాగినపుడు కోస్లా, బెహల్‌లు ఒక పని చేశారు, నోటిలో కొంత నీటిని మింగకుండా, ఆ సంగతి ఇతరులు గమనించకుండా జాగ్రత్తగా ఉంచుకున్నారు.

టేప్‌లను అతికించిన తర్వాత పెదాలను అటూయిటూ కదుపుతూ, నోటిలోని నీటిని మెల్లిగా ముందుకు ఊసి, టేపుని తడిచేస్తూ, విప్పదీసుకోవటానికి ప్రయత్నించ సాగారు.

కొంత సేపటికి తడివల్ల టేపు లూజయి ఊడిపోయింది. చీకటిలో ఎవరూ వీరిని గమనించటం లేదు కూడా!

బెహల్ క్రింద వెల్లకిలా పడుకున్నాడు కొంతసేపు. ఆకాశంలో మేఘాలు అలుముకున్నాయి. వర్షంవచ్చే సూచనలు కన్పిస్తున్నాయి.

కొంతసేపు తరవాత నోటిని కోస్లా చేతులవద్దకు తెచ్చాడు. నోటితో నైలాన్ తాడుని విప్పదీయటానికి ప్రయత్నించ సాగారు. దాదాపు పది నిముషాల ప్రయత్నం అనంతరం కొంచం లూజు అయింది. చకచకా విప్పే

కాడు. మరుక్షణమే బెహెల్ చేతులుకూడా ఫ్రీ అయ్యాయి.

చేతులు కొద్దిగా రుద్దుకుని, చుట్టూ చూశాడు కోస్లా.

దూరంగా ఉన్న షిప్స్‌లోని కాంతి లీలగా వీరిమీద పడుతోంది. ఆ మసక వెలుతురులో ఎవరయినా తప్పించుకు పోవాలన్నా కాపలావారి కంట పడుతుంది.

అయిదు నిమిషాలనంతరం కెప్టెన్ కోస్లా, బెహెల్ ఇద్దరూ కాపలావారి వద్దకు నడిచారు. వీరిని చూడగానే వారి చేతులలో రివాల్వర్లు మెరిశాయి. ఇద్దరి చేతులు క్విక్‌గా పనిచేశాయి. వారి రివాల్వరులున్న చేతుల్ని వెనక్కి విరిచి, వారి గొంతుచుట్టూ రెండో చేతిని పోనిచ్చారు.

మరుక్షణమే ఆ యిద్దరు తలలు వాల్చేశారు.

వారిని ప్రక్కకు ఈడ్చుకుపోయి వారి డ్రస్ తాము ధరించి, తాము ధరించిన బట్టలు వారికి తొడిగి తిరిగి వచ్చారు.

పాసింజర్స్ దగ్గరికి వెళ్ళి తామెవరో తెలియచేసి, ఏం చేయాలో లోగొంతులతో చెప్పారు. అదే సమయంలో షిప్ మీది ఫ్లష్‌లైటు వారివైపు తిరిగింది. లోడింగ్ పూర్తయిందన్నమాట.

# 9

శంకర్‌సింగ్ పాసింజర్స్‌ని అలా సముద్ర తీరంలో దింపి, నిలబెట్టటానికి గల కారణం, అతనికున్న ఒక చిన్న అనుమానం మాత్రమే.

యురేనియంని రవాణా చేస్తున్న వ్యక్తులు తమ ఏజెం

ట్లను యిద్దరిని పంపించారు ఆ షిప్‌లోనే. వారివెంట వైర్‌లెస్ ట్రాన్స్మిటర్స్ కూడా ఉండి ఉంటాయని శంకర్‌సింగు భావన.

అందుకే షిప్ మీద దిగిన వెంటనే ఏదో నెపంతో ప్రతి పాసింజర్ కాబిన్‌నీ చెక్ చేశాడు. ఎందుకంటే ఆ ఏజంట్లు ఎవరో అతనికీ తెలియదు. వైర్‌లెస్ ట్రాన్స్మిటర్లు దొరక్కపోయినా, అతని అనుమానం అలాగే ఉండి పోయింది.

అందుకే పాసింజర్స్ అందరినీ డైనింగు హాలులో ఉంచి, బంధింపచేశాడు ఒకరకంగా. దీనివల్ల అతనికీ పెద్ద నష్టం ఏమీ లేకపోయినా, యురేనియం కోసం షిప్ కిడ్నాప్ జరిగిందన్న విషయం వారి బాస్‌లకు, ఇతరులకు తెలిసే అవకాశం ఉంది. ఆ అవకాశం లేకుండా చేయడానికే అందరినీ తీరంలో దించాడు.

అందువల్ల వ్యక్తులవద్ద ఒకవేళ ట్రాన్స్మిటర్‌లున్నా కెప్టెన్ కోస్లాగాని, మరి యితరుల దృష్టిలోగాని పడకుండా మెస్సేజ్ పంపటం అసాధ్యం.

లోడింగు పూర్తికావటంతోనే తన ప్లాన్ నెరవేర్చదలిచాడు. ఈ షిప్‌ను, దానిలోని మనుషులను క్షేమంగా ఒదిలిపెట్టే ఆలోచన అతనికి ఎప్పుడూ లేదు. దీనిని అక్సిడెండల్‌గా చూపించి, ఈ నౌకని పేల్చివేయాలి. అందుకోసం అతను వేరే ఆలోచన చేశాడు.

బాక్స్‌ల మార్పిడి అనంతరం శక్తివంతమయిన పది టైంబాంబ్స్‌ను ఇంజన్ రూం, రేడియో రూం, మరికొన్ని ముఖ్యమయిన ప్రదేశాలలో, ఇతరులకు అంత సులభంగా కంటపడనిచోట్ల అమర్పించాడు.

ఆ కార్యక్రమం పూర్తికాగానే పాసింజర్స్‌ని ఎక్కించి

షిప్‌ను ఒదిలెయ్యాలి. కొంతదూరం పోయిన తర్వాత అన్నీ ఒక్కసారి పేలి, షిప్ ధ్వంసం అయిపోతుంది. ఎవ్వరూ బయటపడరు. ఈ విషయం వారు ఊహించినా, బాంబ్స్ అన్నింటినీ తీసి వేయలేరు.

ఫ్లడ్ లైటు వారివైపుతిప్పి రమ్మనమన్నట్లు సైగ చేశాడు. లైఫ్ బోట్లలో దశలవారీగా బయలుదేరారు పాసింజర్స్, శంకర్ సింగ్ అనుచరుల దుస్తులలోఉన్న కెప్టెన్ కోస్లా, డాక్టర్ బెహెల్ వారికి ఎస్కార్టుగా ఉన్నారు.

పాసింజర్స్ అందరిని వారి వారి కాబిన్స్‌లోనికి పంపారు. కొంతమంది నడవలేక పోతుంటే అతని సిబ్బంది స్వయంగా దించి వచ్చింది.

తన ముందునుంచి పోతున్న బెహెల్, కోస్లాలని గుర్తు పట్టలేక పోయాడు శంకర్ సింగ్. అంతేగాదు, అతనే గాకుండా, అతని సిబ్బందికూడా బెహెల్, కోస్లా దుస్తులలో ఉన్న తమ సహచరులను గూడా గుర్తించలేక పోయారు.

నోటికి టేప్ అతికించి ఉన్నందువల్ల గింజుకుంటూ, మోసం జరిగిందని తమ యజమానికి సంజ్ఞ చేయటానికి ప్రయత్నిస్తున్న యిద్దరు వ్యక్తుల్ని బెహెల్ కోస్లాలు స్వయంగా తీసుకుపోయి కెప్టెన్ కాబిన్‌లో కూలేశారు.

"బంధించినా వీళ్ళకింకా కోపం తగ్గలేదు!" నవ్వుకుంటున్నాడు శంకర్.

"ఇంకా పావుగంటలో మనం తిరిగి వెళ్ళిపోతాం. బాంబ్స్ అన్నీ ఎరేంజ్ చేశారా?" అని తన అనుచరులను ప్రశ్నించాడు. ఇంకా కొన్ని అమరుస్తున్నామని జవాబు వచ్చింది.

అప్పుడే బయటికి రాబోతున్న కోస్లా, బెహెల్‌ల

చెవులబడ్డాయి ఆ మాటలు. తక్షణమే ఇంజన్ రూంలోకి పరుగెత్తారు. సాధారణంగా అక్కడే ఏది జరిగినా!

ఇంకా యిద్దరు, ముగ్గురు ఉన్నారక్కడ.

"అయిపోయిందా?" అని ప్రశ్నించాడు కెప్టెన్ కోస్లా. అతన్ని మొండి ధైర్యం ఆవహించింది. తనగొంతు గుర్తు పడతారన్న భయంకూడా పోయింది.

అక్క ఉన్నవారు అయిపోయిందని చెప్పారు.

"సరే! అందరూ పదండి. మేము చెక్ చేసివస్తాం. అయిదు నిమిషాల్లో బయలుదేర బోతున్నాం. మన నౌక మీద రెడీగా ఉండాలి మీరు."

వారు అలాగే నన్నట్లు తలఊపి కదిలారు.

'తను ఊహించినట్లే తమని పేల్చి వేయటానికి కుటిల యత్నం చేశాడు శంకర్ సింగ్,' అనుకున్నాడు కెప్టెన్ కోస్లా.

అంతా పరికించి ఒక బాంబు తీసి చూశాడు.

అది పేలటానికి యింకా గంటంపావు ఉంది. గుండె గుభిల్లుమంది. అన్నింటికీ ఒకే టైం అరేంజ్ చేశారో, లేదో తెలియదు.

డాక్టర్ బెహెల్ కి గబగబ వివరించసాగాడు.

# 10

ఇంజన్ రూంలోనుండి బయపడి, కాబిన్స్ వయిపు నడిచారు కోస్లా, శ్రీరాజ్ బెహెల్ లు.

వీరినిచూసి బంధించబడిఉన్న పాసింజర్స్ భయపడ్డారు. వారికి తామెవరమో చెప్పి, వారిని బంధ విముక్తులు చేశారు. తమ డ్రస్సువిప్పి నైట్ గౌన్స్ ధరించారు.

వారికి తమవెంట తెచ్చిన బాంబుల్ని చూపి, అటు వంటివి ఎక్కడ కనపడ్డా, వెంటనే సముద్రంలో దూరంగా

పారెయ్యామని చెప్పారు.

అయిదు నిమిషాల తర్వాత శత్రువుల నౌక కదిలింది. దాని డెక్ మీద నిలబడి చూస్తున్నాడు శంకర్ సింగు. క్రమంగా దూరం అవుతూందది.

ఇక్కడ పాసింజర్స్‌లో కోలాహలం అధికమయింది. మిగిలిన తన సిబ్బందితోను, మగ పాసింజర్లతోను టైం బాంబ్స్ కోసం అన్వేషణ సాగించాడు కెప్టెన్ కోస్లా. అదృష్టవశాత్తు పది టైం బాంబ్స్ బయటపడ్డాయి. అన్నింటినీ డిఫ్యూజ్ చేసి సముద్రంలోకి విసిరేశారు.

అయినా తృప్తి తీరక తన పాసింజర్స్ అందరిని లైఫ్ బోట్లమీద మరలా ద్వీపం మీదికి తీసుకు వొచ్చాడు కోస్లా.

అందరినీ దీవిమీద షిప్ కు దూరంగా నడిపించి, షిప్ పేలినా ప్రమాదం లేదనుకునే బండలమాటున తీసుకు పోయి షిప్ లోనుంచి వచ్చే శబ్దాంకోసం ఎదురు చూడ సాగాడు.

దాదాపు ఇరవై నిముషాలనంతరం అతను అనుకున్న శబ్దాలు విన్పించాయి. కాని వారున్న స్టీమర్ లోకాదు. శత్రువుల నౌకనుంచి.

తలలువంచి కూర్చున్నవారు ఒక్కసారిగా తలెత్తి చూశారు. దూరంగా పెద్ద విస్ఫోటంతో, పేలి, మంటలు నింగిని తాకుతున్న శత్రు నౌక కన్పించింది.

అంతా దాదాపు అరగంటవరకు అలానే ఉండి పోయారు.

తరువాత మరో అరగంటకి కెప్టెన్ కోస్లా, అతని సిబ్బంది వెళ్ళి నౌకని పరిశీలించారు. అదృష్టవశాత్తు తమ నౌకలో ఏ లోపమూ లేదు. తిరిగి తమ ప్రయాణానికి ఏర్పాట్లు చేయసాగారు.

అయితే శత్రువుల నౌక ఎందుకు పేలిందో అతనికి తెలియలేదు.

దానిలోని రహస్యం తెల్సింది యిద్దరికే, అయితే ఆ యిద్దరులో ఒకరు స్టోరూంలో మరణించారు.

యురేనియం ఖనిజం ఉన్న బాక్సులలో వీటితో పాటుగా ప్రతి బాక్సులోను అడుగున టైం బాంబ్స్ ఉంచి రవాణా చేశారు.

ఒక వేళ తమగుట్టు బయటపడితే వీటితాలూకు అవశేషాలుకూడా దక్కరాదని వారి ఆశయం. ఆ సంగతి ఆ ఏజంట్లు యిద్దరికే తెలుసు.

టైం బాంబ్స్ ఎప్పుడు పేలతాయో అన్న సంగతి వారికి వివరంగా వ్రాసి కోడ్ లో యివ్వబడింది. దానిని అనుసరించి బాంబ్ పేలే సమయం సమీపించినపుడల్లా, స్టోర్ రూంలోని దొంగతనంగా ప్రవేశించి, అడుగు చెక్కను విప్పదీసి, బాంబ్ ను డిఫ్యూజ్ చేసేవారు.

ఆ సందర్భంలోనే బాంబ్ ను డిఫ్యూజ్ చేసి వస్తున్న ఏజంటుని శంకర్ సింగ్ మూతా కనుగొని, మట్టుపెట్టటం జరిగింది. రెండోవాడు నోరు విప్పలేదు.

విప్పితే కథంతా బయటపడుతుంది. అందుకే మౌనంగా ఉండిపోయాడు.

ఇప్పుడా బాంబులను డిఫ్యూజ్ చేయక పోవటంవల్ల పేలింది. దానితో ఇతర ఎక్స్ప్లోజివ్స్ కూడా అంటుకొని, శంకర్ సింగు నౌక పేలిపోయింది.

మరో గంటతర్వాత 'స్టేట్ ఆఫ్ హర్యానా' సింగపూర్ వైపు బయలుదేరింది.

—: ఐ పో యిం ది :—

# ముగ్గురు బాస్‌లు!

ఎ. వీ. మోహన్రావ్

విశాలమైన ఎయిర్ కండిషన్ గది. ద్వారానికి ఎదురుగా వున్న కిటికీ నానుకునివున్న రివాల్వింగ్ ఛెయిర్‌లో కూర్చుని ముందున్న కోడిగ్రుడ్డు ఆకారపు బల్లపైన కాళ్ళు రెండూ ఒకదానిపైన ఒకటి పెట్టుకుని వూపుకుంటూ కూర్చున్నాడు బాస్. నిశ్శబ్దం రాజ్యం చేస్తుందా క్షణాన గదిలో.

నేను తలుపు దగ్గర నిలుచున్నాను.

"కమిన్ మై ఫ్రెండ్!" పిలిచాడు బాస్. అతని మొహం నాకు కనుపించలేదు. ఇంతకు ముందెప్పుడూ నే నాయన్ని చూడలేదు. కానీ పదిసంవత్సరాలనుండి అతని క్రింద పనిచేస్తున్నాను.

మెల్లిగా వెళ్ళి నిలుచున్నాను.

"కూర్చో!" అన్నాడు బాస్.

టేబుల్ కు ఇవతలవేపున్న కుషన్ కుర్చీలో కూల బడ్డాను.

"నీ పేరు?"

"అరవైమూడు బాస్!" అన్నాను.

"అది నెంబరు. పేరు నే నడిగింది!"

"సుధీర్!"

"గుడ్ నేమ్!" అంటూ కాళ్ళు రెండూ టేబుల్ పై నుంచి తీశాడు బాస్. అప్పుడే అతని మొహం చూశాను. గుమ్మడికాయలా గుండ్రంగా వుంది. నెత్తినఒక్క వెంట్రుక కూడా లేదు. లావుపాటి కనుగుడ్లు. మొఖానికి అతికించి నట్లున్న పెద్దముక్కు. చెంపలపైన కత్తిగాట్లు. మెడకు నల్లటి మఫ్లర్ చుట్టుకుని వున్నాడు. అతని ముఖంలో గాంభీరతకన్నా క్రౌర్యం, ఉదాత్తతకన్నా ఉడుకు మోతుతనం, అభిమానంకన్నా అసూయ, ప్రేమకన్నా స్వార్థం, ఎక్కువగా వున్నట్లు తోచాయి.

"నిన్నెందుకు పిలపించానో తెలుసా?" అడిగాడు తీక్షణంగా నాకేసిచూస్తూ.

"తెలీదు బాస్!"

"ఇన్నేళ్ళనుండి నమ్మకంగా నా దగ్గర పనిచేస్తూ, కుడి భుజంగా మసిలినవ్యక్తి, ద్రోహంచేసి, నా సర్వస్వం దోచు కొని వెళ్ళిపోయాడు. నా మనుషుల్లో చాలామంది అతని వేపు తిరిగారు, ఇంత నమ్మకద్రోహం చేసేసాహాసం,ఊహా, అతని కున్నాయని నే ననుకోలేదు. అందుకే అప్రమత్తుడిగా వుండలేక పోయాను."

నేనేం మాట్లాడకుండా అతనికేసిచూస్తూ కూర్చుండి పోయాను.

"అతన్ని వేటకుక్కలా వేటాడి, చిఱుతపులిలా, కండకు కండలుగా చీల్చి, గుండెపిండి నెత్తురు తాగా అన్నంత క్రౌర్యం నాలో పెరిగింది. నేనే రంగంలోకి దిగు దామనుకున్నాను. కానీ సమర్థుడివి నువ్వుండగా నేను చెయ్యి చేసుకోవలసిన అవసరం రాదనిపించింది. అందుకే కబురుపెట్టాను." అన్నాడు బాస్.

విని ఊరకే వుండిపోయాను.

"ఇది చాలా ప్రమాదంతో కూడుకున్నపని. డేవిడ్ డెవిల్ లాంటివాడు. అతనితో నాకులాగే నీకూ కావలసి నంత పరిచయముందనుకుంటాను. ఈ ప్రయత్నంలో నీ ప్రాణాలుపోయే అవకాశం కూడా వుంది. అందుకు సన్న ద్ధుడివైతేనే మిగిలిన వివరాలు మాట్లాడుకుందాం! ఆలో చించి చెప్పు!" అన్నాడు బాస్.

ఆలోచనలో పడ్డాను నిజంగానే. బాస్ ఉత్తరువు లంటూ నా చేత పదేళ్ళనుండీ గాడిద చాకిరీ చేయించు కున్నాడు. ప్రతిఫలంగా నాకు ముట్టింది చాలా తక్కువ. అతను బాస్‌ను మోసంచేసి పోయేనాటికి నా దగ్గర రెండే రెండు వందనోట్లు మిగిలాయి. దాన్నిబట్టి నా కెంత అన్యాయం చేశాడో ఎవరైనా లెఖ్ఖకట్టవచ్చు. మొదట్లో అవసరానికి బానిసనై ఈ పాపకూపంలోకి దిగాను. ఆ తర్వాత ప్రాణాలకు ఆపదరాకుండా చూసుకునేందుకు డేవిడ్ ఆడించినట్లల్లా ఆడాను. ఏది ఏమైనా నేను చాలా నేరాలుచేసిన విషయం నిజం. నా కోసం పోలీసులు వెతుకు తున్న విషయం నాకే కాదు, బాస్‌కూడా తెలును.

"ఏమంటావ్?"

"యస్ అంటే నాకు ఒరిగేదేమిటో తెలుసుకోవాలి!" అన్నాను.

"డేవిడ్ ఇన్నేళ్ళు అనుభవించిన స్థానం నీకు దొరుకు తుండి. లాభాల్లో సగం నీకిస్తాను." అన్నాడు బాస్.

"అయితే సరే!! డేవిడ్‌ను చంపితెచ్చి అతని శవాన్ని నీ కాళ్ళపైన పడేస్తాను." అన్నాను, ఆవేశంగా ఉత్సాహంతో.

"అదే నాకాక్కావాలి! డేవిడ్ ఇప్పుడెక్కడున్నాడో తెలుసా?"

"తెలీదు! అవన్నీ తెలుసుకొంటాను. పనిపూర్తిచేస్తాను. ఆ బాధ్యత నాది."

బాస్ ముఖంలో చిరునవ్వు వెలిసింది.

## 2

బాస్ బంగళాలోంచి బయటికొచ్చి రోడ్ పైన నిలుచున్నాను. టాక్సీగానీ, ఆటోగానీ, దొరుకుతుందేమోనని ఎదురుచూడసాగాను. పదినిముషాలు పైనే నిలుచున్నాను. ఏదీ రాలేదు. విసుగుపుట్టుకొచ్చింది.

కొంతదూరం ముందుకుపోతే ఏదైనా దొరుకుతుందేమో నన్న ఉద్దేశ్యంతో నడవడం మొదలెట్టాను పేవ్ మెంట్ పైన.

ప్రక్కగా తెల్లటి బెంజ్ కారొచ్చి ఆగింది, టైర్లు రోడ్‌కు రాచుకుని కీచుమని శబ్దమైంది.

తలత్రిప్పి చూశాను.

డ్రైవింగ్ సీటులో పాలరాతి బొమ్మలాటి అందమైన అమ్మాయివుంది. ఆమె నన్నుచూచి నవ్వింది అందంగా. నేను నవ్వాను.

"వాంట్ ఎ లిఫ్ట్?"

"యస్!"

"కమిన్!" అందామె తలుపు ఎడంచేత్తో తీస్తూ.

ఎక్కి కూర్చున్నాను కార్లో.

"ఎందాకా వెళ్ళాలి." అడిగిందామె.

"అబిడ్స్!" అన్నాను.

"నేనూ అక్కడికే వెళ్తున్నాను. ఇక్కడేనా మీ బంగళావుంట."

"కాదు! నా ఫ్రెండ్ ఒకతను వుంటున్నాడు. అతన్ని చూసేందుకు వచ్చాను."

కారు బయలుదేరింది.

"మీ పేరు చెప్పలేదు?" అడిగిందామె.

"మీరు అడగలేదుగా?" అన్నాను.

"ఘటికులే?"

"మీ కన్నానా?"

కారు తాజ్ మహల్ దాకా వచ్చేసింది. ఆటోమేటిక్ సిగ్నల్ నిప్పులా ఎర్రగా వెలుగుతూంది. కారాగి పోయింది.

"ఆఁ!"

"ఏందు కనుకుంటున్నారలా?"

"మీకు తెలిసినా, తెలీనట్లే నటిస్తున్నారు. నా చేతులో లక్షలున్నాయను కున్నారా. లేక ఆ కాగితాలు లక్షలు విలువ చేస్తాయనుకున్నారో, అర్థంకావటంలేదు. నా హాఫ్ పాకెట్లోవున్న కాగితాలబొత్తి లాగేశారు. అవునా?" అడిగాను ఉదాసీనంగా.

"నాన్సెన్స్! ఎవరితో మాట్లాడుతున్నారో తెలుసు

కని మాట్లాడండి?'' అందామె కళ్ళు పెద్దవిచేసి. ముఖం మాడ్చుకుంటూ.

''మీ రివర్టెండీ నా కనవసరం! నా కాగితాలు నా కిచ్చెయ్యండి! నేను అనవసరంగా ఒకరితో దెబ్బలాడే మనిషినికాను. అవసరమొస్తే దెబ్బలాడటం మాత్రంకాదు! మెరుపు దెబ్బతీయగల సామర్థ్యమున్నవాణ్ని!'' అన్నాను కోపంగా.

''అలాగా! అందుకే ఏరి కోరి నీకు లిఫ్ట్ ఇచ్చింది!'' అందామె గుండ్రటి కళ్లు త్రిప్పుతూ.

''అంటే నేను మీకు ముందే తెలుసా?''

''తెలుసు! నాకు తెలిసిన విషయాలు నీకు తెలుసుకో వాలనుంది కదూ!'' అంటూ కారు స్టార్ట్ చేసిందామె.

''మళ్ళా ఎక్కడికి?''

''ఏదైనా ఏకాంత ప్రదేశానికి'' అంటూ మరికొంత దూరం పోనిచ్చి 'మహారాజా' రెస్టారెంటు ముందాపి, దిగమని సంజ్ఞ చేసింది.

కారుదిగాను. ఆమె వెంట మాట్లాడకుండా నడిచాను. ఇద్దరం మూడో అంతస్తులోవున్న ప్రైవేట్ అన్న క్యాబికల్ లోకి వెళ్ళి కూర్చున్నాం.

బేరర్ వచ్చాడు.

ఆమె ఆర్డరుచేసింది తినేందుకు ఏవేవో పదార్థాలు.

''నీ పేరు సుధీర్ కదూ!''

అవునన్నట్లు తలూపాను.

''డేవిడ్ ను తెలుసా నీకు?''

''తెలుసు!'' అన్నాను.

''అదే నాకు తెలుసు. అతన్ని ఎలాగైనా చంపాలి! అందుకు నీ సాయం కావాలి!'' అందామె రకున.

ఆశ్చర్యపోవడం నా వంతయింది. అందాకా ఆమె డేవిడ్ తాలూకు మనిషన్న అపోహలో వుండిపోయాను.

"అతనిపైన మీకెందుకు పగ?" అడిగాను.

"నా భర్తను అన్యాయంగా పొట్టన పెట్టుకున్నాడు. పోలీసులకు చిక్కకుండా, చట్టానికి అందకుండా మెల్లగా జారుకున్నాడు."

"ఐ. సీ. నా గురించి మీకెలా తెలుసు."

"డేవిడ్ చెప్తుంటే విన్నాను. అతను మా యింటికి చాలాసార్లు వచ్చాడు. మా వారితో చేతులు కలిపి స్మగ్లింగ్ వ్యాపారం చేశాడు. ఆ వ్యవహారాల్లోనే ఆయన్ని చంపివేశాడు." అందామె.

"అప్పట్లో నీ గురించి చాలా గొప్పగా చెప్పాడు. అతనిపైన పగతీర్చుకునేందుకు నీ కన్నా సమర్థుడైన వ్యక్తి నాకు వేరెవ్వరూ కనుపించలేదు. నిన్ను దాదాపు నెల రోజులనుండి వెంటాడుతున్నాను. ఇవాల్టికి కలుసుకొని మాట్లాడే అవకాశం చిక్కింది" అందామె తిరిగి.

"నా కాగితాలు..." అన్నాను.

"ఇవిగో. తీసుకో. వీటితో నాకేం పనిలేదు. నీతోనే!" అంది, నా వైపు చూస్తూ.

"అలాగే! మీకు సాయంచేస్తాను!" అన్నాను.

బేరర్ డ్రింక్స్, తినే పదార్థాలు తెచ్చి టేబుల్పైన పెట్టాడు. ఇద్దరం హాయిగా తిని, త్రాగం. అరగంటపైనే హోటల్లో వున్నాం.

ఆమె ఏవేవో మాట్లాడసాగింది. తిండిపైని ధ్యాసతో "ఊఁ, ఆఁ!" అంటూ విన్నట్లు నటించాను.

బేరర్ బిల్లు తెచ్చాడు. ఆమే చెల్లించింది. ఇద్దరం దిగి క్రిందకొచ్చాం.

"మరి మన ప్రోగ్రాం ఏమిటి?" అడిగిందామె.

"నేను కొంత సమాచారం సేకరిస్తున్నాను. అదంతా అందేందుకు రెండ్రోజులు పడుతుంది. ఆ తర్వాత ఏం చెయ్యవలసింది ఆలోచించుకుందాం!" అన్నాను.

"ఓ.కే. నా టెలిఫోన్ నెంబరు ఈ కాగితంపైన వ్రాసి వుంచాను. ఆ నెంబరు రింగుచేసి, మాయ అని అడిగితే నన్ను పిలుస్తారు." అంటూ కాగితం అందించి, సెలవు పుచ్చుకొని వెళ్ళిపోయింది.

కారు కనుమరుగైందాకా చూసి, ఆ తర్వాత కాలినడకన నా రూంకు బయలుదేరాను.

రామ్‌కోటి చౌరాస్తా దగ్గిర పేవ్ మెంట్ వారగా, నా ప్రక్కనే మోటార్ సైకిల్ వచ్చి ఆగడం గమనించి తల త్రిప్పాను.

విక్రమ్, వినోద్ ఇద్దరూ కనిపించారు.

నన్ను చూచి నవ్వి దిగివచ్చారు దగ్గరకు.

"ఏం బ్రదర్స్ బాగున్నారా?" అడిగాను.

"ఆఁ! నువ్వు ఎలాగున్నావ్?" అడిగారు.

"బాగానే వున్నాను."

"వ్యాపారం ఎలావుంది. ప్రస్తుతం పెట్టుబడి పెట్టేందుకు ఎవరూ లేరనుకుంటాను!" అడిగాడు విక్రమ్.

"ఎవరో ఒకరు దొరుకుతారులే!" అన్నాను.

"మేము డేవిడ్ తరపున పనిచేస్తున్నాం!"

వాళ్ళామాట అనగానే, నాకు నా బాస్, అతనితో పాటు మాయవాళ్ళు కోరినకోరిక, పెట్టిన బాధ్యత గుర్తొచ్చాయి.

"డేవిడ్! అతనెక్కడున్నాడు?"

"తెలీదు!"

"తెలీకుండా ఎలా పనిచేస్తున్నారు?"

"ఇన్నాళ్ళు మన బాస్ ఎవరో తెలీకుండా పనిచేసి అత నికి మనండబ్బు సంపాదించి ఇవ్వలేదూ?అలాగే ఇదీనూ!" అన్నాడు వినోద్.

"నువ్వూ మాతో పని చెయ్యరాదూ!" అడిగాడు విక్రమ్.

"అంత అవుసరంలేదు!" అన్నాను ముక్తసరిగా.

"కానీ దేవిడ్ కు నీతో అవసరముంది. నువ్వు కనిపిస్తే వెంటనే తన్నువచ్చి కలుసుకోమన్నానని చెప్పమన్నాడు. వెళ్తావా?" విక్రమ్ అడిగాడు.

"ఆఁ!" అన్నాను.

"అతనెక్కడుందీ నీకు తెలుసా?"

"తెలీదు!"

"అయితే నే చెప్పినట్లు చెయ్యి. తిన్నగా మద్రాసు వెళ్ళి, హోటల్ అలంకార్ లో రూం తీసుకో. నాలుగూ, నాలుగూ, జీరో, ఆరూ, మూడూ, ఆరూ, నెంబరుకు ఫోన్ చేసి నువ్వు వచ్చిన వైనం చెప్పు. ఆ తర్వాత మన క్రొత్త బాస్ అంటే దేవిడ్ నిన్ను కలుసుకుంటాడు" అన్నాడు వినోద్.

"ఓ. కే!" అన్నాను.

"ఖర్చులకు డబ్బేమైనా వుందా? లేక ఇచ్చేదా?"

"ఇవ్వు!" అన్నాను.

విక్రమ్ పర్సుతీసి ఐదు వంద రూపాయల నోట్లు అందించాడు. అవి అందుకుని జేబులోకి త్రోశాను.

"ఏ ట్రైన్ లో వెళ్తావు?" అడిగాడు.

"సాయంత్రం ఎక్స్ ప్రెస్ కు!" అన్నాను.

"బాస్‌కు మా శుభాకాంక్షలు అందించు. వ్యాపారం బాగుందని చెప్పు." అన్నారిద్దరూ.

"అలాగే!" అని శెలవు తీసుకొని, గదికిచేరాను.

# 3

గబ గబ బట్టలు సర్దుకున్నాను. మాయకు ఫోన్ చేశాను. ఆమె పలకలేదుగానీ, ఆపరేటర్‌లాంటి స్త్రీ ఒకామె, మెసేజ్ ఏమైనావుంటే చెప్పమంది. నేను మద్రాసు వెళ్తున్న వైనంచెప్పి, ఆ విషయం మాయకు తెలియ పరచమన్నాను.

ఆటో ఎక్కి సికింద్రాబాదు స్టేషనుకు చేరుకున్నాను. ఫస్ట్‌క్లాస్ టిక్కెట్ కొనుక్కొని రైలెక్కాను.

నాకు 'కుపే'లో క్రింది బెర్తు దొరికింది. పైన ఎవరో మనిషి రైలు బయలుదేరకముందే, నిద్రపోవడం గమనించాను. అతను బహుశా హైద్రాబాద్‌లో ఎక్కి వుంటాడనుకున్నాను.

కిటికీ వారగాకూర్చొని, తాపీగా సిగరెట్ పీల్చసాగాను. నా సాయం కావాలనే డేవిడ్‌ను, చంపటానికి వెళ్తున్నానన్న నగ్నసత్యం నా ఒక్కడికే తెలునునను కున్నప్పుడు, నవ్వొచ్చింది.

మాయకు జరిగిన అన్యాయంకన్నా, మా బాస్‌కు జరిగిన అన్యాయం నన్ను నిలువునా కలచివేసింది. నేను ఏదైనా క్షమిస్తానుగానీ, నమ్మకద్రోహం మాత్రం క్షమించలేను. ఆ డేవిడ్ అంతుచూడటం మినహా నేను మరో పని ముట్టుకోదలచుకోలేదు.

మాయకు నేను పంపిన మెసేజ్ చేరివుంటే ఆమెకూడా బహుశా రైలెక్కి వుండాలనుకొన్నాను. కాజీపేట స్టేష

నులో చాలాసేపు ఆగుతుంది రైలు. అక్కడే వెతకాలను కున్నాను. డీసెల్ ఇంజను తగిలించిన రైలు, వాయువేగంలో పోతూంది. రైలు చక్రాలు పట్టాలకు రాచుకుంటుంటే, చెవులు గింగురుమనిపిస్తూ, శబ్దం వినరాసాగింది.

సిగరెట్ పారేసి బాత్‌రూంకు బయలుదేరాను. కారిడార్ చివర అద్దంముందు నిలుచుని తలదువ్వుకొంటున్న మనిషి మొహం అమాంతంగా కనుపించింది నాకు. అతన్నెక్కడో చూచినట్లుంది. మెల్లిగా వెళ్ళాను. దగ్గరకంటూ వెళ్ళేక బాగాగమనించి చూసాను. అతని తలకట్టు, మీసాలు, బుగ్గపైన గాట్లు అన్నీ కృత్రిమంగా కనుపించాయి. సినిమాలో వేషం వేసేందుకు మేకప్ చేసుకొన్నట్లుంది తప్ప సహజంగా లేవు.

బాత్‌రూంలోకి వెళ్ళాను.

నా మెదడునిండా అంతకుముందు చూచిన వ్యక్తి రూపమే నిండిపోయింది. అతను అతికించుకున్న మేకప్ తీసివేస్తే ఎలా వుంటాడన్నది ఊహించసాగాను. సరయిన రూపం ఏదీ నా మెదడులో పట్టుమని పదిశెకన్లపాటు నిలువలేదు.

వెలుపలికొచ్చాను.

అతనికోసం ఆత్రతగా చూశాను. కనుపించలేదు. నా కూపేకి వెళ్ళిపోయాను. పైబెర్తు పైనున్న వ్యక్తి నిద్రపోతూ నేవున్నాడు. దుప్పటి అంతకుముందులాగే మొహం కనుపించకుండా కప్పుకొని వుండిపోయాడు.

సీట్లో కూర్చున్నాను. వద్దనుకున్నా ఆలోచనలు నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తూనే వున్నాయి.

ఏదిఏమైనా, నా జాగ్రత్తలో నేనుండడం అవసరం అనిపించింది. బెర్తుక్రిందకు తోసిన సూట్‌కేసు వెలుపలకు

లాగాను. రివాల్వరు తీసి జేబులో వేసుకొన్నాను. నాలుగు స్మోక్ బాంబులు కూడా తీసి వుంచుకున్నాను.

మరో అరగంటకు రైలు కాజీపేట స్టేషను చేరుకుంది దిగివెళ్ళి భోజనం చేసివచ్చాను. పై బెర్తు పైనున్న వ్యక్తి భోజనానికి కూడా దిగకుండా అలాగే నిద్రపోవడం గమనించాను.

కోచ్ అటెండెంటు అటువేపుగా వెళ్తూ కనిపించాడు. అతన్ని పిలచి పైనున్న వ్యక్తి విషయం చెప్పాను. అతని పేరు ప్రకాష్ అనీ, ఆరోగ్యం సరిగాలేక విశ్రాంతి తీసుకుంటున్నట్లు చెప్పాడని, తన్ని డిస్టర్బ చెయ్యవద్దన్నారనీ చెప్పాడు. ఆ మాట విన్నాక అంతకుముందుదాకా నా కతని పైనవున్న అనుమానం మబ్బులా విడిపోయింది.

రైలు బయలుదేరింది.

ఎవరో తలుపు తట్టినట్లయింది.

లేచివెళ్ళి తలుపు తీశాను. ఎదురుగా అంతకుముందు బాత్‌రూంవద్ద కనుపించిన మనిషి నిలుచుని వున్నాడు.

ద్వారానికి అడ్డంగా నిలుచుని "ఏం కావాలి?" అడిగాను.

"మా ఫ్రెండ్‌కు ఒళ్ళు ఎలాగుందో చూడాలి! అతను పై బెర్తు పైన పడుకుని వున్నాడు." అన్నాడతను.

అడ్డు తొలగాను, అతను లోనికి వచ్చాడు. నేను కూర్చున్నాను. మళ్ళీ సిగరెట్ వెలిగించాను.

దబుక్కున పైనున్న వ్యక్తి క్రిందకుదూకాడు. అంతకు ముందు లోనికొచ్చినవ్యక్తి తలుపు పైకెదూకి దాన్నిలాగి, మూసి, వెలుపలనుంచి తీసేందుకు వీలులేకుండా హుక్ వేశాడు.

నాకు మెదడు పనిచెయ్యడం మానేసింది. సిగరెట్ విసిరేసి జేబులోంచి రివాల్వర్ తీశాను. దాన్ని పొజిషన్‌లో పెట్టుకునే వ్యవధికూడా లేకుండా ఒకతను నాపై కురికి గొంతు గట్టిగాపట్టుకొని, అతని తలతో నా తలను అదిమి పెట్టాడు వెనుకసీట్‌కు. నాకు ఊపిరాడడంలేదు.

రెండో వ్యక్తి, నా రెండుకాళ్ళు పట్టుకుని ఒకదానితో ఒకటి మెలిపెట్టి ఘట్టిగా త్రిప్పసాగాడు. నా చేతులు అశక్తమయ్యాయి. నా తలపైని తలపెట్టి, కారెజ్‌కి అణచి పెట్టినవ్యక్తి, తలతో నుదురు చిట్లిపోయేట్లుగా రెండు మూడుసార్లు మొత్తాడు.

నాకు స్పృహపోయింది.

# 4

మళ్ళీ కళ్ళు తెరిచేసరికి, నా చుట్టూ పచ్చరంగు వేసిన గోడలు, పైన ఫాను చుట్టూ ఫర్నీచరు కనిపించాయి.

అది హోటల్ గదయి వుండాలనుకున్నాను.

మెల్లిగాలేచి కూర్చున్నాను మంచంమధ్య.

గదిలో ఎవ్వరూలేరు, నేను తప్ప.

తలుపు నెట్టుకొని ఒకవ్యక్తి లోనికొచ్చాడు. అతన్ని అంతకుముందు నే నెక్కడా చూచిన గుర్తురాలేదు.

"ఎలా వున్నావ్?" అడిగాడు అతను.

"బాగానే వున్నాను. నువ్వెవరు? నన్నెందుకు ఇక్కడకు తీసుకొచ్చారు?" అడిగాను కాస్త కోపంగా.

"డేవిడ్‌ను చంపాలని బయలుదేరావ్? అవునా?"

"అలాగని ఎవరు చెప్పారు నీకు?"

"నా ప్రశ్నకది జవాబుకాదు! సరిగ్గా సమాధానం చెప్పు. లేకుంటే..." అంటూ పళ్ళు పటపటా కొరికాడు.

"ఏం చేస్తావ్?" అడిగాను కోపంగా.

"చంపుతాను." అన్నాడు అతను.

"నన్ను చంపమని డేవిడ్ చెప్పాడా నీకు." అడిగాను.

"అలా చెప్పివుంటే నిన్ను నలభైఎనిమిది గంటలముందే చంపి, పాతిపెట్టి వుండేవాళ్ళం. ప్రాణాలతో పట్టి తీసుకు రమ్మన్నాడు. అందుకే ఇక్కడ తెచ్చిపెట్టి కాపలా కాస్తున్నాము" అన్నాడతను.

"అలాగా?"

"అవును."

"అయితే నన్ను చంపేందుకు మీకు స్వాతంత్ర్యం లేదన్నమాట. నన్ను డేవిడ్ వద్దకు తీసుకువెళ్ళండి. మీ విషయం తేల్చుకుంటాను." అన్నాను.

"క్రింద కారు సిద్ధంగావుంచాం. నువ్వు ఏ విధమైన అల్లరిచెయ్యకుండా, బుద్ధిగా మాతోరావాలి!" అన్నాడతను మళ్ళీ బెదిరిస్తున్నట్లు.

"అలాగే వెళ్దాం! కానీ నాకు నడిచేఓపిక లేదు. ఎత్తుకుని తీసుకుపోతారా?"

"అలా వీలుకాదు! నడవాలి!" అధికారికంగా అన్నాడు

"నడవలేను!" మొండికేస్తూ చెప్పాను.

ఫోన్ మ్రోగింది.

అతనే వెళ్ళి అందుకున్నాడు. ఒకక్షణం అవతలి వ్యక్తి చెప్తున్న మాటలువిని "నీకే వచ్చింది. మాట్లాడు!" అంటూ రిసీవరు తెచ్చి అందించాడు.

"హల్లో!" అన్నాను అందుకుని.

"బాగున్నావా?" అడిగాడు అవతలవేపు వ్యక్తి. ఆ గొంతులోని జీర నాకు బాగాగుర్తు. అది డేవిడ్ ది.

"నన్ను మీవాళ్ళు బాగుండనివ్వడంలేదు!" అన్నాను.

"జరిగిందంతా నాకు తెలుసు. విధిలేని పరిస్థితుల్లో నా మనుషులు నీ పట్ల కాస్త కఠినంగా ప్రవర్తించినట్లు తెలిసింది. మరచిపో! మనిద్దరం మునుపటిలా స్నేహంగా వుండాలని నా కోరిక. అందుకే నిన్ను రప్పించుకుంటున్నాను." అన్నాడు డేవిడ్.

"నేను స్నేహంగా లేనని ఎలా తెలిసింది. నీ వాళ్ళు విక్రమ్, వినోద్‌ల సలహాపైనే బయలుదేరాను" అన్నాను నా మనసులోని భావాల్ని కప్పిపుచ్చుకుంటూ.

నిన్ను బాస్ పిలిపించి మాట్లాడడం, అతనికి నువ్వు నన్ను ఎలాగైనా చంపుతానని మాటివ్వడం, మొత్తం నాకు తెలుసు. బుకాయించి లాభంలేదు! మన మిద్దరం కలసి చాలారోజులు పనిచేశాం. ఆ పరిచయం, స్నేహం నన్ను నీ పట్ల క్రూరంగా ప్రవర్తించనీయటంలేదు. నువ్వు ఎప్పటిలా నాకు నమ్మినబంటుగా పని చెయ్యాలి" అన్నాడు డేవిడ్.

"ఆలోచిస్తాను!"

"అందుకే హోటల్‌కది అనవసరం. పైగా డబ్బు ఖర్చు కూడాను. అల్లరి చేయకుండా నేను ఏర్పాటు చేసిన కారెక్కి రా!" అంటూ నా జవాబు వినకుండా ఫోన్ కట్ చేశాడు డేవిడ్.

నేను రిసీవరు క్రేడిల్ పైన పడేశాను.

"వెళ్దామా?" అడిగాడు ఆగంతకుడు.

"ఆఁ!" అన్నాను.

"అయితే కదులు!" పురమాయించాడు నన్ను.

మంచంపై నుండి క్రిందకి దిగాను. నిలవడం కష్టమైంది. తూలిపడ్డాను. ప్రక్కనున్న వ్యక్తి నా భుజం

పట్టుకుని పైకి లేపాడు. కాళ్ళు నిలద్రొక్కుకుని నిలుచున్నాను.

అతని వెంట మెల్లిగా నడక మొదలెట్టాను. గదిలోంచి కరండాగుండా ఎలివేటర్ వద్దకు నడిచాం. మేమున్నది ఏడవ అంతస్తు. అక్కణ్ణుంచి క్రిందికొచ్చాం. పెద్ద కారొకటి సిద్ధంగావుంది. అందులో స్టీరింగు పీలువద్ద ఒకతను కూర్చుని వున్నాడు. అతని వేషాన్ని బట్టి సిక్కులాగున్నట్లు తోచింది. మేమిద్దరం వెనుక సీట్లో కూర్చున్నాం. నా వెంటనున్న వ్యక్తి తలుపులు మూశాడు.

"పోనీ!" అన్నాడు.

కారు పోవడం మొదలెట్టింది. ఊరు దాటింది. చీకటిని చీల్చుకుంటూ వెలుగుతున్నాయి హెడ్ లైట్లు.

నా మెదడులో రకరకాల ఆలోచనలు బయలుదేరాయి. నన్ను డేవిడ్ నమ్ముతాడన్న ధీమా పోయింది. అక్కడికి చేరాక చంపుతాడనిపించసాగింది. కానీ అతనికి నావల్ల కలిగే లాభాలున్నాయి. వాట్ని దృష్టిలో పెట్టుకొని ఎలాగైనా నన్ను తన వేపు త్రిప్పుకునే ప్రయత్నం చేసినా ఆశ్చర్యం లేదనుకున్నాను.

కారు సడన్ బ్రేక్ వేసినట్లు ఆగిపోయింది.

"ఏమైంది?" అడిగాడు నా ప్రక్కనున్న మనిషి డ్రైవర్ను.

"ఇంజన్ బాగా వేడెక్కింది?" అన్నాడతను.

"ఈ మాత్రానికేనా?" అడిగాను.

"ఈకాలం అంతా మాయేగదా? కార్ల తయార్ అంత చక్కగా వుంది." అన్నాడు అతను. మాయ అన్న మాటపైన అతను ఒత్తి పలికిన తీరు చూచి నాకు అనుమానం వేసింది.

"కబుర్లాపి దిగి, కాసిని నీళ్ళు ఆ రేడియేటరు మొహాన కొట్టు!" అన్నాడు అతను డ్రైవరుతో.

"మిస్టర్ మాటలు జాగ్రత్తగా రానీ! లేకుంటే వీపు సాఫవుతుంది!" అన్నాడు డ్రైవరు.

"ఎవరితో మాట్లాడుతున్నావు తెలుసా! డ్రైవరు కంత పెక్కుండ కూడదు. జాగ్రత్తగా మసలుకోకపోతే ప్రాణాలు తోడేస్తాను!" బెదిరించాడు ఆగంతకుడు.

ఆమాటనగానే డ్రైవరు ముందు సీట్లోంచి వెనుక వైపుకు దూకేడు అతని పైకి. అతడు ఆగంతకుణ్ణి దేంతో కొట్టాడో తెలీదు గానీ, "అమ్మో!" అన్న అరుపు వినిపించింది. అతని తల క్రిందకు వాలి జారిపోయింది.

"చచ్చినట్లున్నాడు!" అన్నాను డ్రైవరుతో.

"పీడ విరగడయింది. త్వరగా దిగు వెళ్దాం!" అన్నాడు డ్రైవరు.

"నువ్వెవరు?" అడిగాను అనుమానం తీరక.

"నేనే మాయను!" అంది తలపైనున్న టర్బన్ విప్పి పారేస్తూ.

ఇద్దరం క్రిందికి దుమికాం. పరుగెత్తుకుంటూ చీకట్లో కలిసిపోయాం.

"ఇంత సాహసమా?" అడిగాను.

"నేను నా పగ సాధించుకునేందుకు నిన్ను నమ్ముకున్నాను. నువ్వే వాళ్ళ చేతుల్లో చిక్కుకుంటూ వుంటే చూస్తూ ఎలా వుండేది. అందుకే సాహసించాను" అంది మాయ.

"మార్వెలెస్! వాళ్ళ డ్రైవరు ఏమయినాడో?" అడిగాను.

"వాడికి శాస్త్ర నా వొంపు సొంపులు చూపించి, కవ్వించాను. ఆపైన డబ్బిచ్చి చిత్తుగా తాగి అరువందలా మూడో నంబరు గదికి రమ్మన్నాను. వెళ్ళాడు పిచ్చి సన్నాసి. నేను వేషం మార్చుకుని కూర్చున్నాను" అంది మాయ.

"ఎలాగైతేనేం నన్ను రక్షించావ్? నీకు చాలా ఋణ పడివున్నాను. ఎలా తీర్చుకుంటానో...?" అన్నాను కృతజ్ఞతాపూర్వకంగా.

"ముందే చెప్పాను? ఆ డేవిడ్‌ను చంపితే చాలు నా ఋణం, నా భర్త ఋణం తీర్చినట్లవుతుంది!" అంది మాయ.

"ఇకపైన మనమేం చెయ్యాలి!" అడిగాను.

"ఆ డేవిడ్ ఎక్కడుండేదీ తెలుసుకున్నాం మనం. నీ గురించి అతను తెలుసుకున్నాడు. అనవసరమైన సాహసాలు చేసి నువ్వు సాధించబోయేది ఏదీ వుండదని నా నమ్మకం. అతన్ని మనం ఉపాయంతోనే మట్టుబెట్టాలి!" అంది మాయ.

"ఆ ఉపాయమేదో నువ్వే చెప్పు!" అన్నాను.

"అతనీ వూళ్ళో రెండు వ్యక్తిత్వాలతో, ఇద్దరు వ్యక్తులుగా చలామణీ అవుతున్నట్లుగా తెలిసింది. డేవిడ్ పేరుతో డెవిల్‌లా దొంగతనాలు, హత్యలు, దోపిడీలు చేయిస్తున్నాడు. థియొడర్ పేరుతో పెద్ద మనిషిలా రకరకాల దానాలు చేస్తూ, పేరు సంపాయించుకుంటు న్నాడు. మొదటి వ్యక్తిత్వంతో తలపడి లాభంలేదు. రెండో మనిషిని మనం బోల్తా కొట్టించాలి. ఏమంటావ్?" అనడిగింది మాయ.

"నాకన్నా ఎక్కువ సమాచారం నీ దగ్గరే వుంది. నువ్వు చెయ్యమన్నట్లు చేస్తాను" అన్నాను.

అలంకార్ హోటల్ కు వెళ్ళి రూం తీసుకున్నాము. స్నానపానాదులు ముగించి చెరో మంచంపైన వాలి పోయాం.

## 5

నేను నిద్రలేచి టయిమ్ చూసుకున్నాను. ఐదయింది. ప్రక్క మంచంకేసి చూశాను. మాయ లేదు. అప్పుడే మాయమయిపోయిందా, అనుకున్నాను.

బెల్ నొక్కాను భాయ్ వచ్చాడు. కాఫీ ఆర్డరు చేశాను. వాడు వెళ్ళాక బాత్ రూంకు వెళ్ళివచ్చాను. ఐదు నిమిషాల తర్వాత భాయ్ కాఫీ కప్పు తెచ్చి పెట్టాడు. అందుకుని త్రాగబోతుండగా మాయ లోనికి వచ్చింది.

"వచ్చావా? మాయమయిపోయావని అనుకున్నాను." అన్నాను నవ్వుతూ.

"అంత సులభంగా పోను!" అంది మాయ.

"ఇంతకూ ఏదయినా మార్గమాలోచించావా?" అడిగాను.

"ఆc!" అంది మాయ.

"ఏమిటది? చెప్పు!" ఆత్రుతగా అడిగాను.

"థియోడరుకు అతని బాస్ ను మోసం చేసి విడిగా వచ్చేసింది మొదలు ప్రాణాలపైన ప్రేమ, తీపి ఎక్కువయింది. అ స్తమానం. జ్యోతిష్కం, హామశాస్త్రం, అంటూ కనుపడ్డ చిలక జోష్యుల వెంట గూడా తిరుగు తున్నట్లు విన్నాను," అంది మాయ.

"దాని వల్ల మనకేం ప్రయోజనం?" అడిగాడు.

"మనం కూడా జ్యోతిష్యం చెప్పే వాళ్ళల్లా తయారయి అతని కోటలో పాగ వెయ్యాలి."

"ఆ గొడవలు మనకు తెలీవే?" అన్నాను.

"డేవిడ్ గతం నీకు పూర్తిగా తెలుసు. నీకన్నా గొప్పగా అతనికి జ్యోతిష్యం చెప్పగల నేర్పు ఎవ్వరికీ వుండదు" అంది మాయ.

"భవిష్యత్తు చెప్పాలి?"

"అతనికెలా ఇష్టంగా వుంటుందో మనకు తెలుసు' అవే జరుగుతాయని చెప్పు. ఆనందంతో చంకలెగరేస్తాడు!" అంది మాయ.

"అతన్ని మనం ఎలా చంపాలి?"

"అదంతా కోటలోపాగా వేశాక ఆలోచిద్దాం!' అంది మాయ.

ఆ రాత్రికి మాయ చెప్పినట్లుగా సెలూన్‌కి వెళ్ళి, తల పూర్తిగా తీసేసి శిరోముండనం చేయించుకున్నాను. కను బొమలు తీయించుకుని కాషాయవస్త్రాలు కొని తెచ్చుకున్నాను.

తెల్లవారేలోపుగా హోటల్ మార్చేశాం.

పేపర్లనిండా ప్రఖ్యాత జ్యోతిశ్శాస్త్రవేత్త మార్కం దేయులిగార్ని ప్రశాంత్ హోటల్‌లో సంప్రదించి, గతం భవిష్యత్తు తెలుసుకోమంటూ మాయ తయారుచేసి యిచ్చిన అడ్వర్టయిజుమెంట్లు పడ్డాయి.

ఒంటిగంటపైన ఫోన్ కాల్స్ రావడం మొదలెట్టాయి. అందరికీ మాయే జవాబు చెప్పేది. ఆమె ఏం చెపుతున్నది కూడా నేను పట్టించుకోలేదు.

"ఇప్పటికి వంద కాల్స్ వచ్చాయి" అలసిపోతూ అంది నా కెదురుగా కుర్చీలో జేరపడి.

"ఏం చెప్పావ్?"

"ఈ దినం మౌనవ్రతంలో వున్నారనీ, రేపు రావల్సి వుంటుందనీ చెప్పాను" అంది మాయ.

"అలా ఎందుకు చెప్పావ్?"

"వాళ్ళ జాతకాలు మనకు తెలీవు, అయినా మనకు కావలసిన వ్యక్తి లేరు." అంది మాయ.

మళ్ళీ ఫోన్ మ్రోగింది.

మాయ రిసీవరు అందుకుంది.

ఫోన్లో అవతలవేపు వ్యక్తి తనెరయిందీ చెప్పి నట్లుంది. వినగానే మొహం ప్రసన్నం చేసికుని, నావేపు చూపి "థియోడర్" అంది.

నేను ఉత్సాహంగా దగ్గరకు జరిగాను.

"నేను! స్వామి నిత్యానంద సెక్రెటరీని. మధ్యాహ్నం రెండింటికి రండి" అంది మాయ.

ఆ తర్వాత ఫోన్ పెట్టేసింది.

"పిట్ట వల్లో పడింది!" అంది మాయ.

"ఏమంటాడు?"

"పేపర్లో అడ్వర్టయిజు మెంటు చూశాడట. మీతో కన్సల్టు చెయ్యాలట. అపాయింట్ మెంట్ అడిగాడు ఇచ్చాను. రెండింటికి వస్తాడు. వచ్చాక ఏం చెప్పవల సిందీ గుర్తుందిగా!" అడిగింది మాయ.

"ఆఁ!" అన్నాను.

"జాగ్రత్తగా వుండాలి! అతను నిన్ను అనుమానించే పరిస్థితి కలగకుండా చూచుకోవాలి!" అంది మాయ.

"మన వేషాలు చూశాక కన్నతల్లికూడా మనల్ని గుర్తుపట్టటం అసంభవం," అన్నాను.

# 6

రెండింటికి థియొడర్ వచ్చాడు. రాగానే నాకాళ్ళ పైన బడి మ్రొక్కాడు.

అతన్ని ఆశీర్వదించి పైకి లేవదీశాను. కూర్చోమని సంజ్ఞ చేశాను.

మాయకూడా మామధ్యనే వుంది.

"నువ్వో పెద్ద సమస్యలో చిక్కుకున్నావ్. నీ ప్రాణాలు ఉంటాయా పోతాయాని భయపడుతున్నావ్ అవునా?" అడిగాను.

"అవును స్వామీ! అదే నన్ను పట్టుకుని ప్రస్తుతం వేధిస్తున్న సమస్య," అన్నాడు థియొడర్.

"నువ్వు నమ్మకద్రోహం చేశావ్. అందుకే నీకు భయంగా వుంది" అన్నాను మళ్ళీ.

అతను మాట్లాడకుండా తలూపాడు.

"నువ్వుంటున్న ఇంట్లో దోషముంది. దాన్ని దయ్యం పట్టుకుని వ్రేలాడుతుంది. దానివల్లే నీ ప్రాణాలకు ముప్పు వస్తుంది. అది నీ ప్రత్యర్థుల ప్రయత్నాలకు తగిన సాయం చేయాలని చూస్తుంది. దాన్ని ఇంట్లోంచి తరిమి వెయ్యాలి" అన్నాను.

"అందుకేం చెయ్యాలి!" అడిగేడు థియొడర్.

"దేవీ పూజ చేసి, మంత్రజలం ఇల్లంతా జల్లితే ఆ దెయ్యం వెళ్ళిపోతుంది," అన్నాను.

"తమరిదయ ఆ పూజేదో మీరు చెయ్యాలి!" అన్నాడు థియొడర్.

"అందుకు చాలా ఖర్చవుతుంది. మా ప్రశాంతతకు భంగంరాకుండా నువ్వు చూడగలగాలి!"

"అవన్నీ నాకు వదిలేయండి."

"అలాగే వదిలేస్తాం! అయితే రేపు రమ్మంటావా?"

"రేపటిదాకా ఎందుకు? ఇవాళే వెళ్దాం!" అన్నాడు థియొడర్.

నేను మాయకేసి చూశాను.

ఆమె సరేననమని సంజ్ఞ చేసింది కళ్ళతో.

ఆ తర్వాత రెండు నిముషాలకు నేనూ, మాయ, అతని కారెక్కాం లగేజిలతో. కారు జోరుగా పోసాగింది. సెంట్ థామస్ మౌంట్‌లో, ఎత్తుగా వున్న చిన్న కొండ కానుకొని ఉన్న బంగళాలోకి వెళ్ళి ఆగింది.

"ఇదే నా బంగళా!" అన్నాడు థియొడర్.

"నీది కాదు! ఇది కొని ఇంకా ఆరవై రోజులు పూర్తి గాలేదు. ఆ డబ్బంతా దొంగతనాలు, దోపిడీలు, హత్యలు తాలూకూది అవునా?" అడిగాను.

"స్వామీ!" అంటూ వినయంగా వంగి నమస్కరించాడు, ఇంక ఆ విషయాలు ముగించమని.

"మాకోసం ఒకగది ప్రత్యేకించారు. ఎయిర్ కండిషన్ చేసివుందా గది.

"మాయా!" పిలిచాను.

"ఏమిటి?" అడిగింది.

"మనల్ని అనుమానించాడా?"

"అలాంటిదేమి లేదు! ఇకపైన నువ్వు జాగ్రత్తగా వుండాలి." అంది మాయ.

"ఈరాత్రి డేవిడ్‌ను సఫా చేస్తాను" అన్నాను.

"తొందరపడకు. ఇక్కడ పరిస్థితులన్నీ తెలుసుకొన్న తర్వాతగాని ఏమీ చెయ్యలేము" అంది.

ఆ రాత్రిదాకా ఇద్దరం గదిలోనే వున్నాం. సాయంత్రం వేళ థియొడర్ వచ్చి, పూజకు కావలసిన సామగ్రి వివరాలు తెలుసుకొని వెళ్ళాడు.

# 7

పదిదాటాక నేను గదిలోంచి వెలుపలికొచ్చాను.

ఇల్లంతా తిరగడం మొదలెట్టాను. థియోడర్‌కు భార్యాపిల్లలులెరు. ఆ విషయం నాకు ముందే తెలుసు.

అతనిగది మేడపైనవుంది. గదిముందు ఇద్దరు మనుషులు కాపలా వున్నారు. వాళ్ళ దగ్గర ఆయుధాలు కూడా వుండటం గమనించాను. అతను తగిన జాగ్రత్తలోనే వున్నాడనుకొన్నాను.

ఆ తర్వాత గదివెనుకవేపున్న బాల్కనీలోకి వెళ్ళాను. అటువేపున్న గది కిటికీలకు ఐరన్ మెష్ వేసివుంది. పైగా తలుపులు కూడా కలిసివున్నాయి. షట్టర్స్‌కున్న గ్లాస్‌ను చేత్తో లాగాను. అది బుల్లెట్ ప్రూఫ్ గ్లాస్. వెలుపలినుంచి రివాల్వరుతో కాల్చే వీలులేదు.

ఇంట్లో మొత్తం ఆరుమంది అనుచరులున్నారు అతనికి. వాళ్ళకు అతన్ని కాపాడడమే డ్యూటీ. మా బాస్‌కు భయపడి చాలా గట్టి బందోబస్తు ఏర్పాటు చేసుకున్నాడు.

నేను తిరిగి వస్తూండగా విక్రమ్, వినోద్ అతని గదిలోకి వెళ్ళడం గమనించాను.

దూరంగా ఆగాను. లోపలవాళ్ళు ఏం మాట్లాడుకుంటున్నారో వినాలన్న ఆత్రుత కలిగింది. గదిచుట్టూ తిరిగాను. ఎటూ శబ్దం వెలుపలికొచ్చే అవకాశంలేదు. నాప్రయత్నం ఫలించలేదు. ఐదునిముషాల తర్వాత వెలుపలికొచ్చారా ఇద్దరు.

"వాడ్ని మనం తెలివిగా పంపించాం. చిక్కినట్లేచిక్కి మాయమయినాడట. అందుకు మనల్ని తిడతాడేమిటి?" విసుగ్గా వినోద్ అడగటం వినిపించింది.

"మళ్ళీ పట్టుకొచ్చి అప్పగించకుంటే చంపుతానంటాడు. ఇదో బెడద!" అన్నాడు విక్రమ్.

"ఆ సుధీర్ గాడు అఖండుడు. డేవిడ్ దగ్గర బాగా తర్ఫీదు పొందిన మనిషి. వాణ్ని పట్టుకోవడం అంత యీజీ గాదనుకుంటాను." అన్నాడు వినోద్.

అలా మాట్లాడుకుంటూ మెట్లుదిగి క్రిందికి పోతున్న వాళ్ళవెంట నేనూ వెళ్ళాను. హాల్లోంచి వాళ్ళు వీధివైపు వెళ్ళారు. నేను నా గదికేసి వెళ్ళాను. మాయ గదిలో లేదు. ఏమైందా అని అనుకుంటూ ఆలోచిస్తూ కూర్చున్నాను.

తలుపు తట్టిన చప్పుడయింది.

"తీసేవుంది!" అన్నాను.

థియొడర్ లోనికొచ్చాడు.

నా ప్రక్కనే స్టూలుపైన కూర్చున్నాడు.

"మీ అసిస్టెంటు లేడా?" అడిగాడు థియోడర్.

"వెలుపలకు వెళ్ళినట్లుంది. మీ యిల్లంతా తిరిగాను దయ్యం పగలంతా ఆ కొండపైనుంటూంది. రాత్రి పది దాటాక గదిలోకి వస్తుంది." అన్నాను.

"మనుషులు రాకుండా కాపలా పెట్టుకున్నాను. దయ్యాల్ని రానీకుండా చేసేశక్తి వాళ్ళకు లేదు!" అన్నాడు థియోడర్.

"రేపట్నుంచి రాదు! నువ్వేం కంగారుపడకు." అన్నాను.

"అదికాదుస్వామీ! ఇంతకుముందు నేను, మరో వ్యక్తీ కలిసి వ్యాపారం చేశాం. నన్ను మోసంచేశాడు. సరయిన వాటా ఇవ్వలేదు. నేనూ అతన్ని మోసంచేశాను. ఇప్పుడు నన్ను చంపడానికి అతను మనుషుల్ని నియమించాడు. ఈ ప్రయత్నంలో అతను నెగ్గుతాడంటారా?"

"నెగ్గడు. నిన్ను చంపేందుకతను ఒక మనిషిని నియమించాడు. అతని పేరు సుధీర్. అతనూ సామాన్యుడు కాడు. కానీ అతనికి నిన్ను చంపడం సాధ్యం కాదు!" అన్నాను.

"అతనుగాక వేరే ఎవరయినా ప్రయత్నాలు చేస్తున్నారా?" అడిగాడు థియోడర్.

"నీవు నమ్మకముంచిన వాళ్ళే నిన్ను మట్టుపెట్టే ప్రమాదముంది జాగ్రత్తగా వుండు. ఎవర్నీ నమ్మకు." అన్నాను.

"అలాగేస్వామీ!" అంటూ శెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

రాత్రి చాలాసేపు మాయకోసం ఎదురుచూస్తూ మేలుకొని కూర్చున్నాను. ఆమె రాలేదు. ఏమయిపోయిందో అర్థంగాక ఆలోచిస్తూండి పోయాను. అలాగే నిద్రపట్టేసింది.

# 8

తెల్లటి వెలుతురు కిటికీ అద్దంలోంచి గదిలోపడుతోంది. లేచి కూర్చున్నాను.

మాయ తల ఆరబోసుకునివుంది.

"రాత్రి ఎక్కడికెళ్ళావ్?" అడిగాను.

"కొంత సామగ్రీ తెచ్చేందుకు వెళ్ళాను" అంది మాయ

"మరి నాతో చెప్పిపోలేదేం?"

"ఎవ్వరితోనూ చెప్పలేదు. ఎవ్వరూ చూడకుండా వెళ్ళాను. వచ్చాను." అంది మాయ.

"ఏం సామగ్రి తెచ్చావ్?" అడిగాను.

చిన్న సంచీ అందించింది. దాన్ని తెరచిచూశాను. దాన్లో కమండలం లాంటి దొకటివుంది. పై భాగం త్రిశూలంలా కోలగావుంది. వెనుక వేపు త్రిప్పితే రివాల్వరులాగుంది. దాని ట్రిగ్గర్ పై భాగంలోవుంది. అందులో రివాల్వరు అమర్చివుందని గమనించడం అతికష్టం.

"చాలా బాగుందిలే!" అన్నాను.

"ఇప్పుడు తయారుచేయించి తెచ్చాను" అంది మాయ.

"నువ్వు అసాధ్యురాలివి" అన్నాను.

"పూజగదిలో అంతా కర్మకాండ జరిగాక, డేవిడ్‌ను ఒంటరిగావుండే ఏర్పాటు చేస్తాను. అతన్నిచంపేసి కిటికీ తలుపు తోసుకుని బాల్కనీలోకిరా. అక్కడే బట్టలు మార్చుకుని, మనం క్రిందికి వెళ్ళిపోవాలి. మనకోసం కారు సిద్ధంగావుంటుంది. అన్నీ ఏర్పాటుచేశాను. అందుకే వెలుపలికి వెళ్ళివచ్చాను."

"నీ ప్లాను చాలాబాగుంది. నీలాంటి అందవుంటే, ఎంతమందినైనా సులభంగా హత్యచేస్తాను. డేవిడ్ మాత్రం కాదు వాడిబాబైనా నాకు లెఖ్ఖలేదు!" అన్నాను.

"అలా మాట్లాడకు ఎవరయినా వినగలరు" అంది మాయ.

"ఇంకెంతసేపు. మన పని పూర్తి కాబోతుంది" అన్నాను.

"అప్పుడే కాదు! హత్య జరిగాక మనం ఎవ్వరికీ చిక్కకుండా, వెళ్ళడం అవసరం. అదయ్యాక నాకింకో

కోరిక వుంది. నిన్ను డేవిడ్‌ను చంపేందుకు పురికొల్పిన మీ బాస్‌ను కూడా నీచేతే చంపించాలి!" అంది మాయ.

ఆమె మాటలు విని నా మతి పోయినట్లయింది. నా గురించి ఆమె వేసిన పథకాలు చూసి నివ్వెరపోయాను.

"నాపైన నీకెందుకు అంత అభిమానం!" అడిగాను.

"అభిమానం కాదు! ఆ ఇద్దరిపైన వున్న కోపమను బాగుంటుంది" అంది మాయ.

# 9

నేను పూజా పునస్కారాలు పూర్తి చేసుకుని కాషాయ వస్త్రాలు కట్టుకుని కూర్చున్నాను.

థియొడర్ వచ్చి నా దర్శనం చేసుకుని వెళ్ళిపోయాడు. మాయ పూజకు మరి కొన్ని సామగ్రి కావలసి వుందని చెప్పి కారులో వెళ్ళిపోయింది.

నేను ఒంటరిగా వుండిపోయాను.

గదిలో వున్న ఫోన్ మ్రోగింది. వెళ్ళి రిసీవరు తీసుకున్నాను. "హల్లో!" అన్నాను.

"ఎవరు మాట్లాడేది?" అడిగాడు అవతల వేపునుండి.

ఆ కంఠం గుర్తించాను. అది మా బాస్‌ది. అతనికి నేను ఇక్కడున్నట్లు ఎలా తెలిసింది? ముందు ఆశ్చర్య పోయాను.

"నేను స్వామి నిత్యానందను" అన్నాను.

"నోర్మూయ్! నువ్వెవరో నాకు తెలుసు. నువ్వు సుధీర్‌వి. థియొడర్ పేరుతో తిరిగే ఆ దగుల్బాజీ డేవిడ్ గాడ్ని చంపి ఆ తర్వాత నన్ను చంపేందుకు అక్కడ కూచుని కుట్ర చేస్తున్నావు కదూ! నిన్ను ఏం చేస్తానో చూడు!" అంటూ ఫోన్‌లోనే రంకెలు వెయ్యడం మొదలెట్టాడు.

“ఎవరా మాట చెప్పింది! అలా చెయ్యాలంటే ముందు నిన్నే హతమార్చేవాడిని” అన్నాను.

“వాగకు! నీ సంగతులూ నాకు తెలిసింది. మా ఇద్దర్నీ చంపి, నువ్వు పెద్ద వాడివి కావాలని కదూ నీ ప్లాను. నా అండలో డేవిడ్‌ను చంపేశాక, అతని బలం, బలగం వెనక పెట్టుకొని నన్ను చంపాలని కోరుకున్నావ్. ఆ విషయం నాకు తెలిసినందుకు భయపడి చస్తున్నావ్!”

“భయమా! అదెటువంటిదో నాకు తెలీదు!” అన్నాను.

“పోనీ! ఇప్పుడు తెలుసుకో! నీరంగు బయట పెట్టానంటే డేవిడ్ నిన్ను నల్లిని నలిపినట్లు నలిపి పారేస్తాడు. నీవన్ని గాలి మేడలయి కూల్తాయి. ఏమంటావ్?” అడిగాడు బాస్.

నాకేం చెప్పాలో తెలీలేదు. నా మనస్సులో లేని అభిప్రాయాలను, ఉన్నాయనుకొని ఊహించి, అతనికి సాయం చేద్దామని వచ్చిన నన్ను, సింహానికి ఆహారంలా వేస్తానంటే అదే సింహం గుహలోనే, ఏం చెప్పేది.

“నీకిచ్చిన మాట నిలుపుకొనే ప్రయత్నంలో ఉన్నాను. చెప్పుడు మాటలు వినిన, నువ్వు చెడి, నన్ను చెడగొట్టకు!” అన్నాను శాంతకఠినంగా.

“తెల్లవారేలోగా అతన్ని చంపాలి! లేకుంటే నేను చెప్పినట్లు చేస్తాను?” అన్నాడు బాస్.

“అలాగే!” అన్నాను.

ఫోన్ కట్ అయింది.

# 10

గంట తర్వాత మాయ వచ్చింది.

జరిగింది చెప్పాను.

"అయితే రాత్రికే ఇద్దర్నీ సఫా చేసేస్తే పోతుంది" అంది మాయ.

"ఎలా?" అడిగాను.

"మీ బాస్ ఎక్కడ దిగాడో అడిగావా?"

"లేదు!" అన్నాను.

"ఆమాత్రంకూడా తెలుసుకోలేనివాడివి ఇన్నిదినాలు ఎలా ఈ వ్యాపారంలో పనిచేశావ్?" అడిగింది నవ్వుతూ

"నీతో చేరాక నా తెలివితేటలపైన నమ్మకంపోయింది. నువ్వు చెప్పినట్లు చెయ్యడం బాగుందనిపిస్తూంటుంది" అన్నాను.

అంతలో డేవిడ్ లోనికొచ్చాడు. అతని కళ్ళు ఎర్రగా చింతనిప్పుల్లా వున్నాయి. మనిషి క్రిందనుండి పైకి వణకడం మొదలెట్టాడు.

తిన్నగా నా కెదురుగా వచ్చి నిలుచుని నా కళ్ళలోకి సూటిగా చూశాడు.

"నువ్వు నిజంగా నిత్యానందవేనా?" అడిగాడు.

మాయ కాస్త వెనక్కి జరిగింది.

"అవును" అన్నాను.

"కాదు! నువ్వు సుధీర్‌వు. నన్ను మోసంతో చంపాలని వచ్చావు. సరయిన టయిమ్‌కు నీ నిజరూపం తెలుసుకొనే అవకాశం కలిగింది. నిన్ను ఇప్పుడే నరికిపారేస్తాను!" అంటూ జేబులోంచి రివాల్వరు తీశాడు డేవిడ్.

"ఎవరు చెప్పారా మాట!" ధైర్యం కూడగట్టుకొంటూ అడిగాను.

"ఇంతకుముందు నీ టెలిఫోన్ సంభాషణ అంతా విన్నాను" అన్నాడు డేవిడ్ రివాల్వరు పైకెత్తి.

నేనూ కమండలం పైకెత్తాను.

"పిచ్చివాడా, మంత్రాలకు చింతకాయలు రాలవు!" అన్నాడు డేవిడ్.

"మంత్రం కాదు! మాయ నీ కోసం తెచ్చిన మాయా మంత్రదండం ఇది. ఇందులో రివాల్వరుంది!" అన్నాను గురిపెట్టి కాల్చుతూ. రివాల్వర్ ప్రేలింది. కానీ, డేవిడ్ చావలేదు. వికటంగా నవ్వాడు.

అంతలో, తలుపులు దబ్బున తెరచుకొన్నాయి.

వెనుకనుండి పోలీసులు వచ్చి డేవిడ్‌ను పట్టుకొన్నారు.

మాయ నవ్వింది.

ఐ. జి. ఆఫ్ పోలీస్ వచ్చి మాయతో కరచాలనం చేసి, "ఈ ముగ్గుర్ని ఒక్క దెబ్బకు పట్టిచ్చావు. నీ తెలివి తేటలు, సాహసం అద్భుతం!" ప్రశంసించాడు.

నేను నవ్వలేక ఏడ్చాను.

"నేను చేసిందేమీ లేదు. ఒకరికొకరు ద్రోహం చేసుకున్నారు వాళ్ళు. ఒకరిపైకి మరొకర్ని దువ్వాను. ఫలితం ముగ్గురూ చిక్కారు" అంది మాయ.

మాయ నన్ను కాదు, నా సామర్థ్యాన్ని, శక్తిని మాయ చేసింది.

అందుకే చివరకు మేము ముగ్గురం జైలుకమ్మలు లెక్క పెడుతూ కలిసి కూర్చున్నాం.

-: ఐపోయింది :-

# తిరుగులేని అబద్ధాలు!!

వసుంధర

"త్వరగా కాళ్ళు కడుక్కొని రండి—ఈరోజు తొక్కుడు లడ్డు చేశాను." అంది ఉమ.

"ఏమిటి విశేషం?" మురళీధర్ అడిగాడు.

"మన రాజు క్లాసులో ఫస్టు వచ్చాడండీ. ఈ రోజే ప్రోగ్రెస్ రిపోర్టు తీసుకువచ్చాడు. నీకేం తినాలనుందిరా అంటే తొక్కుడు లడ్డు తినాలనుందన్నాడు. వెంటనే చేసేశాను. చేసిగంటయిందా—వాడు రుచి చూడ్డానికి కూడా ఒప్పుకోలేదు. నాన్నరావాలి—అంతా ఒక్కసారే కలిసి తినాలి అంటూ కూర్చున్నాడు—" అంది ఉమ.

రాజు మురళీధర్, ఉమలకు ఏకైక సంతానం. కాన్వెంట్లో రెండో తరగతి చదువుతున్నాడు. ఆరు సంవత్సరాలునిండి ఏడో సంవత్సరం నడుస్తోంది.

"ఏడీ వాడు?" అన్నాడు మురళీధర్ అభిమానంగా.

"దొడ్లో మొక్కలకు నీళ్ళు పోస్తున్నాడు."

మురళీధర్ వెళ్ళి కాళ్ళు కడుక్కుని రాజును వెంట బెట్టుకుని వచ్చేసరికి ఉమ ప్లేటులో టిఫిన్ సిద్ధంచేసి ఉంచింది.

"ప్రేమించబడడంలో ఎంత ఆనందముంది ఉమా?" అన్నాడు మురళీధర్ ఇంకా లడ్డు నోట్లో ఉంచుకో కుండానే.

"ప్రేమపంచినవారే ప్రేమించబడతారు." అంది ఉమ.

అదినిజం. ఆ ఇంట్లోని ముగ్గురు మనుషులూ ఒకరినొకరు అత్యంతంగా ప్రేమిస్తూ—ఒకరికోసం ఒకరు జీవిస్తున్నారు.

మురళీధర్ నోట్లో లడ్డు పెట్టుకోబోతూండగా ఎవరో తలుపు తట్టారు. రాజువెళ్ళి తలుపుతీసి— "అమ్మా—ఎవరో పోలీసు—" అంటూ అరిచాడు. మరుక్షణంలోనే రాజు ఆ పోలీసు మనిషితోకలిసి డైనింగు టేబిల్ దగ్గరకు వచ్చే శాడు.

మురళీధర్ తెల్లబోయి ఆ మనిషిని చూస్తున్నాడు. నిండా పోలీసు దుస్తుల్లో ఉన్నాడు. దృఢంగా ఉన్నాడు ముఖానికి మీసాలు వన్నె తెచ్చాయి.

"అయాం సారీ మిస్టర్ మురళీధర్—యు ఆరండర్ అరెస్టు—" అన్నాడతను గంభీరంగా.

ఉమ, మురళీధర్ ఇద్దరూ తెల్లబోయారు. రాజు కైతే కళ్ళలో నీళ్ళు వచ్చేశాయి.

"రెండు నెలలనించి నీకోసం వెదుకుతున్నాను. ఇప్పటికి దొరికావు—" అన్నాడా పోలీసు మనిషి.

"మీరే మురళీధర్ కోసం వెదుకుతున్నారో నాకు తెలియదు. నేను పోలీసుల దృష్టిలో ఉన్న నేరస్తుణ్ని కాదు. మామూలుగా సంసారం చేసుకుంటున్న సామాన్య మానవుణ్ని-" అన్నాడు మురళీధర్.

"వాట్-ఇనస్పెక్టర్ భానోజీరావు పొరపాటు పడడమా-" అన్నాడా పోలీసు మనిషి కటువుగా.

వెంటనే- "ఒరేయ్ భానూ నువ్వా?" అంటూ ఓ కేక పెట్టాడు మురళీధర్.

భానోజీరావు నవ్వాడు- "చూడగానే నిన్ను నేను గుర్తుపట్టాను. నన్ను నువ్వు గుర్తుపట్టడానికింత సేపు పట్టింది. నా అభిమానానికీ నీ అభిమానానికి ఎంత తేడా ఉందో చూశావా?"

మురళీధర్ తడుముకోలేదు- "నాకు చెప్పకుండా నాకు తెలియకుండా నువ్వు వచ్చావు. అయినా · నీ కోసం తొక్కుడులడ్డు చేయించి సిద్ధంగా ఉన్నాను-చూశావా?"

"మాటల్లో నిన్ను జయించడం కష్టం-" అంటూ భానోజీరావు కుర్చీలో కూర్చున్నాడు. ఈలోగా ఉమ అతనికో ప్లేటు సిద్ధంచేసింది.

భానోజీరావు నెమ్మదిగా తనసంగతి చెప్పాడు. అతనిక్కడికి వచ్చి రెండు నెలలయిందిట. ఈ వూళ్ళో మురళీధర్ ఉంటున్నట్లు అనుకోకుండా తెలిసిందిట. అప్పట్నించీ ఆనుపానూ తీయడానికి ప్రయత్నిస్తున్నాడట. రామారావు ద్వారా ఈ రోజే మురళీధర్ చిరునామా దొరికిందట.

"రెండు నెలలీ ఊళ్ళోఉంటూ రామారావూ నువ్వూ కలుసుకోకపోవడం ఆశ్చర్యంగా ఉందే?" అన్నాడు మురళీధర్.

"రామారావు భార్యాబిడ్డలతో యాత్రకి పోయాడట. ఓ వారం రోజులక్రితమే తిరిగి వచ్చాడట. ఈ లోగా ఆ లాయరుగారి కోసం ఎంతమంది పడిగాపులు పడి కూర్చున్నారో చెప్పలేను-" అన్నాడు భానోజీరావు.

"ఏమైతేనేంలే - నువ్వెప్పుడూ మంచిసమయంలోనే మిత్రుల్ని కలుసుకుంటూంటావు-" అన్నాడు మురళీధర్ నర్మగర్భంగా లడ్డులవంక చూస్తూ.

భానోజీరావు నవ్వేసి లడ్డు నోట్లో పెట్టుకుని- "అదృష్టవంతుడివిరా మురళీ - చెల్లాయి హస్తవాసి-అత్తయ్యగారిని మించింది. లడ్డు ఏం బాగుందిరా?" అంటూ మరో రెండు నోట్లో వేసుకున్నాడు.

మురళీధర్ భార్యకు తమ చిన్ననాటి అనుబంధాన్ని వివరించి చెప్పాడు. ఫస్టుఫారంనించి గ్రాడ్యుయేషన్ దాకా రామారావు, తను, భానోజీరావు ముగ్గురూ కలిసి చదువుకున్నారు. ముగ్గురూ ఎక్కువగా మురళీధర్ ఇంట్లోనే కాలం గడుపుతూండేవారు. పరీక్షలువస్తే అంతా మురళీధర్ ఇంట్లోనే పడుకునేవారు. మురళీధర్ తల్లిది చల్లని మనసు. ఆమె వీళ్ళముగ్గుర్నీ కన్నబిడ్డల్లా సమంగా చూసుకునేది.

భానోజీరావు కిద్దరు పిల్లలట. ఇద్దరూ అబ్బాయిలే. తన చిరునామా చెప్పి-మా ఇంటికి తప్పకుండా రావాలని చెప్పాడు.

## 2

"అబద్ధాలు చెప్పడంకూడా ఒక కళ-అది అందరికీ సాధ్యంకాదు-" అన్నాడు రామారావు.

"అవున్లే-అబద్ధాలలోని కళాస్వరూపం లాయర్లకే తెలియాలి-" అన్నాడు భానోజీరావు.

''అందుకేగా_మీరు మమ్మాశ్రయించేది_'' అన్నాడు రామారావు.

''మాటలకేం లెండిగానీ _ అబద్ధమాడడం కళ అని ఋజువుచేయండి చూద్దాం_'' అన్నాడు మురళీధర్.

''నాయనా _ ఎన్నేళ్ళుగా కాపురం చేస్తున్నావో చెప్పు_'' అన్నాడు రామారావు.

''ఏళ్ళా - నా పెళ్ళింకా కొద్దిక్షణాలక్రితం జరిగినట్లుంటే_'' అన్నాడు మురళీధర్.

రామారావు నవ్వాడు ''వైవాహికజీవితం అంత బాగుందంటే నీ భార్య నీకు అందమైన అబద్ధాలు చాలా చెప్పి ఉండాలి.''

''నా భార్య అబద్ధమాడదు_'' అన్నాడు మురళీధర్.

''ఆడినట్లు తెలిస్తే_అది కళ ఎందుకవుతుంది?'' రామారావు ఛాలెంజి చేశాడు.

''అదే ఋజువు చేయమంట_'' అన్నాడు మురళీధర్.

''సరే_మీ ఆవిడ నీ అందాన్నీ, మంచిగుణాల్నీ, పర్సనాలటీనీ మెచ్చుకుందా లేదా?''

''మా ఆవిడేంకర్మ_చాలామంది మెచ్చుకున్నారు_''

''సరేనా_అయితే అవి అబద్ధాలని నీ కెప్పుడైనా తోచిందా?''

మురళీధర్ తడబడి_ ''అవి అబద్ధాలెందుకవుతాయి_ నిజాలేకదా_'' అన్నాడు.

''అయితే ఒక్కసారి మా గదిలోని నిలువుటద్దంలో నీ ప్రతిబింబం చూసుకో_కనీసం నీ అందానికి సంబంధించిన నిజం నీకు తెలుస్తుంది. నీ అద్దం అబద్ధమాడుతుందేమో కానీ_మా అద్దం అబద్ధమాడదు_'' అన్నాడు రామారావు.

మురళీధర్ కు తెరలు తెరలుగా నవ్వు వచ్చింది_ "హారినీ_ఆ అద్దం ఇంకా మార్చలేదా_" అన్నాడు.

"ఎందుకు మార్చాలి? సౌందర్యగర్వంతో మిడిసిపడే మీ చెల్లాయి నడుపులో వుంచడానికి సాకా అద్దం బాగా ఉపయోగపడుతోంది."

భానోజీరావుకు విషయం అర్థమైంది. మిత్రులు ట్యూబ్ లైట్ అంటారేమోనన్న భయమైనా లేకుండా అతనూ నవ్వాడు.

రామారావు మళ్ళీ అన్నాడు. "స్నేహితులు సరదాగా కూర్చుని కబుర్లు చెబుతున్నప్పుడు ఒకోసారి అబద్ధాలు సంభాషణని మంచి రక్తి కట్టిస్తాయి. విన్న వెంటనే నమ్మడానికి బదులు, నవ్వు పుట్టించే అబద్ధాలు మీలో ఎవరైనా చెప్పగలరా?"

భానోజీరావు ఒక్క క్షణం ఆలోచించి, "నేను మురళీధర్ను అరెస్టు చేశాను" అన్నాడు.

మిత్రులిద్దరూ నవ్వారు. మురళీధర్ ది నేరాలు చేసే స్వభావం కాదు. అన్యాయంగా నేరం మోపి అరెస్టు చేస్తాడనుకుందుకు భానోజీరావు మురళీధర్ కు ప్రాణ స్నేహితుడు.

ఒక్క క్షణం ఆగి, "భానోజీరావు నన్నరెస్టు చేయడంలో తప్పులేదు. నేను హత్యచేశాను గదా" అన్నాడు మురళీధర్.

భానోజీరావు అబద్ధాన్ని సమర్థించడంద్వారా మురళీధర్ అబద్ధానికి అందం వచ్చింది. అందుకే అందరూ నవ్వారు.

నవ్వలేక రామారావు తన జేబులోంచి ఒక పది

రూపాయల నోటు తీసి, "ఇది నా కెవరిచ్చారో తెలుసా?" అన్నాడు.

"తెలియదు" అన్నారు మిత్రులిద్దరూ.

"మా లాయర్సు అసోసియేషన్ తరఫున చందాలు వసూలు చేయడానికి వెడుతూంటే, బాపిరాజుగారు తనే స్వయంగా పిలిచి ఈ పదిరూపాయలూ ఇచ్చారు" అన్నాడు రామారావు.

మురళీధర్ గొల్లుమన్నాడు కానీ, భానోజీరావు నవ్వ లేదు.

కాస్సేపాగి బాపిరాజు గారి గురించి వివరంగా చెప్పాడు రామారావు. ఆ ఊళ్ళో చెప్పుకోదగ్గ ధనికుడైన బాపిరాజు మురళీధర్ కు స్వయానా మేనమామ. కానీ, ఆయన పిసినారిగా ఊళ్ళో పేరుకెక్కాడు. బాపిరాజుకు సంబంధించిన కొన్ని కథలు విన్నాక రామారావు మాటల్లోని హాస్యం అర్థమై, విరగబడి నవ్వాడు భానోజీరావు.

"ఎలాగైనా నువ్వు ట్యూబులైటువే" అన్నాడు రామారావు.

"మీ మగవాళ్ళ కబుర్లు పూర్తయితే, భోజనానికి రావచ్చు. వంటయింది" రామారావు భార్య శోభ వంటింట్లోంచి డ్రాయింగు రూంలోకి వినిపించేలా అరిచింది.

"డ్రాయింగు రూం వంటింటికి కూతవేటు దూరంలోనే వుంది. మా ఆవిడ కంఠం పెద్దదనుకు నేరు" అన్నాడు రామారావు.

"మిగతా వాళ్ళ కంఠాలు వినిపించవేం" అన్నాడు మురళీధర్. ఆ రోజు రామారావు వివాహ వార్షిక దినోత్సవం సందర్భంగా మిత్రులు ముగ్గురూ రామారావింట్లో

కలుసుకున్నారు. ఆడవాళ్ళు వంటింట్లోకీ, పిల్లలు గార్డెన్ లోకీ, మగవాళ్ళు డ్రాయింగు రూంలోకీ సర్దుకున్నారు.

3

"నా పేరు రామలింగం!" అన్నాడతను.

"అయితే నన్నేం చేయమంటారు?" అన్నా డవతలి వ్యక్తి విసుగ్గా.

"మీ శక్తికొద్దీ అనాథులకు సహాయపడండి" అంటూ అతను జేబులోంచి ఒక రసీదు పుస్తకం తీశాడు.

అవతలి వ్యక్తి రసీదు పుస్తకాన్నందుకుని చూశాడు. ఏదో అనామక అనాథ శరణాలయానికి చందాలు తీసుకుని రసీదులిచ్చే పుస్తక మది. ఒకటీ, రెండూ, అయిదూ, పదీ చొప్పున చాలామంది ఇచ్చినట్లున్నారు. అతను జేబులోంచి రెండ్రూపాయలు తీసి ఇచ్చాడు. రామలింగం సంతకంపెట్టి రసీదునిచ్చి, "మీరు మా శరణాలయానికి కనీసం పదిరూపాయలివ్వగల స్థాయికి త్వరలో చేరుకోగలరని ఆశిస్తున్నాను" అని అక్కణ్ణించి ఇంకో మనిషి దగ్గరకు వెళ్ళాడు.

అలా సాయంత్రంవరకూ తిరిగి సంపాదించిన డబ్బుతో తన గది చేరుకున్నాడతను. ఆరోజు సంపాదించిన డబ్బు లెక్కపెట్టుకుని సంతృప్తిగా నిట్టూర్చాడు.

'వెధవది. అప్లికేషన్సుకు వేస్టుచేసే బదులిలా రసీదు పుస్తకా లచ్చేయించుకుంటే బోలెడు డబ్బు సంపాదించవచ్చు' అనుకున్నా డొకసారి మనసులో.

కానీ, ఈ సంపాదన తనకు చాలడంలేదు. తన కోరికలు పెద్దవి. తన ఆశలు అంతులేనివి. అందుకే పగలు చందాలు, రాత్రి దొంగతనాలు!

"ఇంకా ఎన్నాళ్ళిలా జీవితం?" అనుకున్నాడతను.

గోడకు తగిలించివున్న అతని కాన్వొకేషన్ ఫొటోలో, చేతిలో వున్న డిగ్రీ కాగితం అతన్ని వెక్కిరించింది. అతనూ దాన్ని వెక్కిరించి, "నేను నిన్నేమీ నమ్ముకోలేదులే. నీ అవసరం లేకుండానే నాక్కావలసిన డబ్బు సంపాదించుకుంటున్నాను" అన్నాడు.

రామలింగం కాసేపు నడ్డి వాల్చాడు. ఆలోచిస్తూ పడుకున్నాడు.

ఏడున్నర ప్రాంతాల్లో లేచి ముఖం కడుక్కుని గది తలుపులు తాళం వేసి బయటపడ్డాడు. ఒక హోటల్లోకి వెళ్ళి భోంచేశాడు. ఓ కిల్లీషాపు ముందర నిలబడి తాడుకు వ్రేలాడగట్టివున్న పుస్తకాల్లో ఒకటి తీసుకుని, చదివి మళ్ళీ అక్కడ పెట్టాడు.

తొమ్మిదిగంటల ప్రాంతంలో సినిమాహాలు దగ్గరకు వెళ్ళాడు. సెకండ్ షోకి టిక్కెట్లివ్వడం మొదలుపెట్టే వరకూ అటూ ఇటూ తిరిగాడు. టికెట్లివ్వడం మొదలు పెట్టగానే ఓ కుర్చీ టికెట్ కొన్నాడు. ఇంటర్వల్ దాకా సినిమా చూసి బయటకు వచ్చాడు. హాల్లో హైక్లాసు లోంచి బయటకు వచ్చినవాళ్ళలో ఒకాయన్ని పలకరించి "సినిమా ఎలాగుంది సార్!" అనడిగాడు.

"మీకెలాగుంది?" అనడిగాడు హైక్లాసు.

"చాలా బోరు. దీనిగురించి ఊరి కామూలనించి వచ్చాను. తిరిగి వెళ్ళడానికి బస్సులైనా లేవు. రిక్షామీద పోవాలి, అదో ఖర్చు" విసుగ్గా అన్నాడు రామలింగం.

హైక్లాసుకూడా పెదవి విరిచాడు. "నేనూ నారాయణ పేటనుంచి వస్తున్నాను. మా ఆవిడ పట్టుమీద వచ్చాను.

మొదటి షోకి టికెట్లు దొరకలేదు. అందుకని రెండో షోకి టికెట్స్ కొన్నాను."

"అయితే సకుటుంబ సపరివార సమేతంగా వచ్చారన్నమాట" అంటూ రామలింగం హైక్లాసుకు సిగరెట్ ఆఫర్ చేశాడు. హైక్లాసు అందుకున్నాడు.

"అంతేననుకోండి" అంటూ సిగరెట్ వెలిగించాడు.

"నారాయణపేట అంటున్నారు. మీ ఇల్లు పోస్టాఫీస్ పక్కనేమిటి?" అనడిగాడు రామలింగం.

"కాదు లెండి. పోస్టాఫీసుకు సరిగ్గా మూడిళ్ళ అవతల వున్న పచ్చరంగు డాబా, నారాయణపేటలో మీకు తెలిసినవాళ్ళెవరైనా వున్నారేమిటి?"

"మా బాబాయుండేవాడు లెండి" అన్నాడు రామలింగం. "నేను మా బాబాయిదగ్గరే వుండేవాడిని. రోజూ పోస్టాఫీసు పనిమీద పంపుతూండేవాడాయన. అవసరానికి మించి స్టాంపులు కొనడు. ప్రతిరోజూ అవసరం రాకా మానదు. అవసపడలేక అస్తమానూ మా పిన్నితో అంటూండేవాడిని, బాబాయికి పోస్టాఫీసు పక్క ఇల్లైతే బాగుంటుందని. అంతేకాదు. పోస్టాఫీసు పక్కగా వుండేవాళ్ళంటే నాకు అసూయగాకూడా వుంటుంది. అందుకే ఎవరన్నా కొత్తవాళ్ళు కనిపిస్తే..."

హైక్లాసు నవ్వి, "ఏం చేస్తున్నారు?" అన్నాడు.

"ఇంకా నిరుద్యోగినేనండీ" అన్నాడు. హాల్లోంచి బెల్ మ్రోగింది. "వస్తాను సార్. మీ క్లాసు వేరు, నా క్లాసు వేరు" అన్నాడు రామలింగం. అక్కణ్ణించి నెమ్మదిగా కదిలిన రామలింగం హాల్లోకి వెళ్ళలేదు. సగంరేటుకి పాస్ అమ్మేసి వడివడిగా అడుగులు వేయడం ప్రారంభించాడు.

కొంతదూరం నడిచి రిక్షా ఎక్కాడు. నారాయణ పేటకు దగ్గర్లో దిగి డబ్బులిచ్చి రిక్షావాణ్ణి పంపించేశాడు. ఆ తర్వాత హైస్కూలు చెప్పిన పచ్చడాబా పట్టుకోవడాని కతని కెంతోసేపు పట్టలేదు.

ఇంటిముందు ఏ కాపలాలూ లేవు. ఇంటికి తాళం వేసి వుంది. వీధి నిర్మానుష్యంగా వుంది.

రామలింగం టైము చూసుకున్నాడు. అతని వాచీ ప్రకారం టైము పదకొండూ నలభైనిముషాలయింది. రామలింగం తటపటాయించకుండా ఆ ఇంటిని సమీపించి, తలుపు తాళం తీయబోయాడు. అంత సులువుగా రాలే దది. తన దగ్గరున్న రకరకాల సాధనా లుపయోగించి మొత్తంమీద తాళం తీయగలిగాడు.

రామలింగం ఇంట్లో అడుగుపెట్టి తలుపులు లోపల గడియ వేశాడు. జేబులోంచి పెన్‌టార్చి తీసి యిల్లంతా కలియ దిరిగాడు. అతని శ్రమ వృధాపోలేదు.

పాంటుజేబులోనూ, వంటింట్లో పోపుల పెట్టెలోనూ కలిపి అతనికి రెండువందల యాభైరూపాయలు క్యాష్ దొరికింది. డ్రెస్సింగ్ టేబుల్ దగ్గర సొరుగులో ఒక లాకెట్ గొలుసు దొరికింది.

ఇంట్లో స్టీలు అల్మిరాకూడా వుంది కానీ అది తెరవడం రామలింగంవల్ల కాలేదు. అతనివద్దనున్న పనిముట్లు అందుకు పనికిరాలేదు. వచ్చినందుకు ఫలితం దక్కిందనుకుంటూ రామలింగం అక్కణ్ణించి బయటపడ్డాడు.

రోడ్డుమీదకు వచ్చేక రామలింగానికి చాలా అసం తృప్తిగా వుంది. ఇలా ఎంతకాలం? కనీసం ఓ పాతిక వేలైనా చేతికి చిక్కాలి. అలాంటి అవకాశంకోసం అతను చాలాకాలంగా యెదురుచూస్తున్నాడు.

అటువంటి అవకాశాన్నిచ్చే ఇంటినికూడా అతను చాలాకాలం క్రితమే ఎన్నిక చేసివుంచాడు. చందాల వంకతో ఆయన ఇంటికి ఎన్నో పర్యాయాలు వెళ్ళాడు. ఇంట్లోకి వున్న దారులు కొన్నింటిని బాగా స్టడీచేశాడు. ఇంట్లో ప్రవేశించడానికి ఒకేఒక్క ఆధారం, బాత్‌రూం వెంటిలేటరు. అయితే రాత్రి ఎనిమిది దాటితే అది మూసి వుంటుంది.

ఇంటాయన చాలా జాగ్రత్తపరుడు. ముఖ్యంగా డబ్బుకూ, ఆయన ప్రాణానికీ పెద్దలంకె వుంది. పది, పదిహేనుసార్లు ప్రయత్నించినా కనీసం ఒక్క రూపాయయినా చందా పేరు చెప్పి ఇవ్వలేదాయన. ఆయనే బాపిరాజు.

కానీ, కలిసొస్తే ఆ ఇంట్లోనే తన అదృష్టం కలిసి రావాలి. అందుకే రామలింగం వారానికొక్కసారయినా ఆ ఇంటితోటలో పదకొండుగంటల ప్రాంతంలో కాచుకుని వుంటాడు.

ఈ రోజుకూడా రామలింగం తన ప్రయత్నంగా ఆ ఇంటికి మరోసారి వెళ్ళాడు. చప్పుడు చేయకుండా, ఇంటి గేటు తీసి, నెమ్మదిగా మొక్కలు చాటుచేసుకుని బాత్‌రూంవైపు వెళ్ళాడు.

మామూలే. వెంటిలేటర్ మూసివుంది.

రామలింగం నిట్టూర్చి అక్కణ్ణించి బయటపడ్డాడు.

## 4

భానోజీరావు లోపలకు వచ్చాడు. ఉమ అతన్ని మురళీధర్ పడుకునివున్న గదిలోకి తీసుకువెళ్ళింది.

"ఏమిట్రా, ఏమయింది?" అనడిగాడు భానోజీరావు.

"ఏముంది. స్వయంకృతాపరాధం" అన్నాడు మురళీధర్ నీరసంగా.

"అంటే?"

"వానలో తడిశానంటే జ్వరం తప్పదు నాకు. మొన్న ఆఫీసునించి వస్తూంటే హఠాత్తుగా వాన ప్రారంభమైంది. వెంటనే షెల్టర్ తీసుకోవాల్సింది. బస్‌స్టాపుదాకా పరుగెత్తేలోగా తడిసి ముద్దయిపోయాను" అన్నాడు మురళీధర్.

"ఏడిసినట్లుంది. చెట్టంత మగాడివి. వానలో తడిస్తే జ్వరం రావడమేమిటిరా?" అన్నాడు భానోజీరావు నవ్వుతూ.

"అదే మా డాక్టర్‌గారిని నేనూ అడిగాను. మగాడు చెట్టంతవాడయినా సరే, శరీర తత్వాన్నిబట్టే ఆరోగ్యముంటుందని అన్నాడాయన" అన్నాడు మురళీధర్.

"బాగుంది కానీ, ఈ మాత్రం జ్వరానికే అంత అధైర్యపడిపోయావేమిటి? నీ ముఖం చాలా దిగులుగా వుంది" అన్నాడు భానోజీరావు.

"దిగులు నా గురించి కాదురా, మా రాజుగురించి. నాకు జ్వరం వచ్చినప్పట్నించీ వాడూ సరిగ్గా తిండి తినడంలేదు. నేను పక్కన లేకపోతే అన్నం సహించదు వాడికి" అన్నాడు మురళీధర్ దిగులుగా.

"తండ్రీ కొడుకులకు మరీ ఇంత సెంటిమెంటుండకూడదు. జీవితమెలాగుంటుందో తెలియదు. ఇద్దరూ చెరోచోటా ఎక్కువకాలం ముండవలసొస్తే ఏం చేస్తారు?" అన్నాడు భానోజీరావు.

"అలాంటి అవసర మెందుకొస్తుంది? నాకేం విపరీ

తంగా సంపాదించి పారేయాలని అత్యాశ గా లేదు. ఉన్న దాంతోనే తృప్తి పడుతున్నాను. నాకున్నదల్లా ఒక్కటే కోరిక. స్వంత ఇల్లుండాలని..."

భానోజీరా వాశ్చర్యంగా మురళీధర్ ని చూసి, "మీది మామూలు ఆస్తికాదు గదా. స్వంత ఇల్లుకూడా లేని స్థితి కెలా వచ్చావ్?" అన్నాడు.

"నాన్నగారి అనారోగ్యం సమయంలో సహాయం పేరిట వచ్చాడు మావయ్య. నాన్నగారు పోయాక మగ దిక్కు పేరిట మరికొన్ని రోజులున్నాడు. ఆయనెలా మోసంచేశాడో తెలియదు కానీ, మేము దిక్కులేనివాళ్ళ మైపోయాము."

భానోజీరావు పిడికిళ్ళు బిగిశాయి. "ఓ కంప్లయింట్ రాసియ్యి. దర్యాప్తు చేస్తాను."

మురళీధర్ విషాదంగా నవ్వి, "ఇది చాలా పాత కథ. ఇప్పుడు మనం చేయగలిగిన దేమీ లేదు. నువ్వు నిజంగానే ట్యూబులైటువి. లేకుంటే నాకన్యాయం జరిగిన పదేళ్ళకు నా కళ్ళముందిన స్పెక్టర్లా నిలబడుందేవాడివి కాదు" అన్నాడు.

"అలాగనకు. రామారావూ, నేనూ కలిశామంటే శవాలచేతకూడా మాట్లాడించగలం. నీకు జరిగిన అన్యాయాన్ని తొలగించడానికిప్పటికీ సమయం మించిపోలేదు."

"నీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి కానీ, ఒక చిన్న సహాయం చేసిపెట్టు. నీ ఎరికలోకి ఎప్పుడైనా చిన్న ఇల్లు సుమారు పాతిక వేల ఖరీదులో దొరికేలావుంటే నాకు చెప్పు. నాకు ఇల్లు కట్టించుకుందుకు, కొనుక్కోడానికి ఆ మేరకు మా ఆఫీసువాళ్ళు సహాయం చేస్తారు" అన్నాడు మురళీధర్.

భానోజీరావేదో అనబోతూండగా రాజు వచ్చి, "నాన్నా, మీకు టెలిఫోన్ వచ్చింది" అన్నాడు.

భానోజీరావాశ్చర్యపడుతూ, "మీ ఇంట్లో టెలిఫోన్ కూడా వుందా?" అన్నాడు.

"ఇంటివాళ్ళకుంది. చాలా మంచివాళ్ళు. నా కెప్పుడు ఫోన్ కాల్ వచ్చినా, మాకు తెలియదని పెట్టేయకుండా కబురంపిస్తారు" అంటూ మురళీధర్ లేచాడు.

"అయితే ఇహనేం, మనం అస్తమానూ ఫోన్లో కంటాక్ట్ చేసుకుంటూండవచ్చు..."

"ఎదుటివాళ్ళ మంచితనాన్ని మనం దుర్వినియోగం చేసుకోకూడదు. అత్యవసర పరిస్థితి యేర్పడినప్పుడు మాత్రమే, నువ్వు నన్ను కంటాక్ట్ చేయడానికి ఫోన్ ఉపయోగించు" అంటూ మురళీధర్ ఫోన్ దగ్గరకు వెళ్ళాడు.

# 5

ఆఫీసులో ఏదో ఫైలు చూస్తున్నాడు మురళీధర్. ప్యూన్ వచ్చి "నీ కోసం ఎవరో పోలీసాఫీసర్ వచ్చారండీ." అన్నాడు. "పంపించు." అన్నాడు మురళీధర్ సాలోచనగా.

లోపలకు వచ్చాడు ఇన్స్పెక్టర్ భానోజీరావు.

"నువ్వా రా కూర్చో. పోలీసాఫీసర్ వచ్చారంటే ఎవరో అనుకున్నాను."

"వెరీ గుడ్ న్యూస్ మురళీ." అంటూ కూర్చున్నాడు భానోజీరావు.

"ఏమిటది?" అన్నాడు మురళీధర్.

"ఒక ఇల్లు సరిగ్గా ఇరవైమూడువేలు చిన్న దేశానీ

చాలా మోడర్న్‌గా ఉంటుంది. కేవలం నా ద్వారా రావడం కారణంగా ఇరవైమూడు వేలు. అసలు దాని ఖరీదు ముప్పైవేలకుపైగా చేస్తుంది. ఇంటాయనకు అనుకోని ఇబ్బందివచ్చి ఇల్లు అమ్మేసుకుంటున్నాడు. ఒక కేసులో ఆయనకు నేను చాలా సహాయంచేశాను. కాబట్టి అదిమనకే ఇస్తానని వాగ్దానం చేశాడు. లేకపోతే ఇంటికి చాలాపోటీ ఉంది..."

మురళీధర్ కళ్ళల్లో మెరుపు కనబడింది. "చాలా థాంక్సురా ఇల్లెక్కడుంది. ఈ ఊళ్ళోనేనా?" అనడిగాడు.

"అవును డబ్బుంటే నేనే ఆ ఇల్లు కొనుక్కొనిఉండేవాడిని. అంత చూడముచ్చటగా ఉందాఇల్లు ఒకసారి చూశావంటే..."

మురళీధర్ ఉత్సాహంగా లేచాడు. "నా గురించి నువ్వు తీసుకుంటున్న శ్రద్ధకు చాలాసంతోషంరా. నీ కభ్యంతరం లేకుంటే ఇప్పుడే ఒకసారి వెళ్ళిచూసొద్దాం."

"మరీ అంత కంగారు పనికిరాదు. నేను పనిమీద ఇలా వెడుతున్నాను కాబట్టి వార్త చెప్పిపోదామని వచ్చాను. సాయంత్రమైతే చెల్లాయీ, మేనల్లుడుకూడా వస్తారు. అంతా కలిసి వెళ్ళొచ్చు. మీరంతా బయల్దేరి నేరుగా మా ఇంటి కొచ్చేయండి. అక్కణ్నించి కలిసి టాక్సీలో వెళ్ళి ఇల్లు చూసుకునివద్దాం."

"ఇంతకీ లొకేషను ఎక్కడ?"

"రామనాథపురంలో. కబురు నిన్నమధ్యాహ్నం తెలిసింది. ఇల్లు నిన్నరాత్రి చూశాను. నీ కిప్పుడు చెప్పాను." అంటూ భానోజీరావు బూట్లు శబ్దం చేసుకుంటూ వెళ్ళిపోయాడు.

మురళీధర్ మనస్సు ఆనందంతో నిండిపోయింది. అతను భానోజీరావుని మనసులో పదేపదే అభినందించుకున్నాడు. తన చిరకాలవాంఛితం ఈ దేరబోతోంది.

అతను తన సీటుదగ్గర్నుంచి కదిలివెళ్ళి గుమస్తాలు కూర్చునే హాల్లోకివెళ్ళాడు. వేగంగా అడుగులు వేసుకుంటూ ఒక క్లర్కును సమీపించి "నా హౌస్‌బిల్డింగ్ లోన్ వ్యవహారం ఎంతవరకు వచ్చింది?" అనడిగాడు.

తన స్వంత విషయాలు తెలుసుకోవడానికి మురళీధర్ స్వయంగా తనే జూనియర్స్ దగ్గరకు వెడతాడు. ఆఫీసు వ్యవహారాలకు మాత్రమే అతను వారిని తన గదిలోకి పిలుస్తాడు. ఆ ఆఫీసులో మురళీధర్‌లా ప్రవర్తించే ఆఫీసర్స్ మరెవ్వరూలేరు. అందుకే అతని జూనియర్స్ కతనంటే చాలాగౌరవం.

సమాధానం తక్షణం వచ్చింది."లాస్ట్ ఫేజ్‌లో ఉంది సార్. నిన్ననే నా స్నేహితుడొకడు ఢిల్లీనుంచి వచ్చాడు. అతన్ని మీ విషయం మన హెడ్డాఫీసులో కనుక్కోమని చెప్పాను. అతను చెప్పినప్రకారం నిన్నో, ఈ రోజో ఆ కాగితాలు డిస్పాచ్ అవుతాయి..."

థాంక్స్‌చెప్పి మురళీధర్ తనగదిలోకి వెళ్ళిపోయాడు. ఫైనల్ పేపర్స్ ఈ రోజు ఢిల్లీలో డిస్పాచ్ అయుంటే మరో మూడ్రోజుల్లో తమ ఆఫీసు చేరుకుంటాయి. ఆఫీసులో ఫార్మాలిటీస్ పూర్తికావడానికి ఒకరోజు పడుతుంది. ఆ మర్నాడు చెక్కు తనచేతిలో ఉంటుంది.

సరిగ్గా అయిదోరోజునాటికి తన చేతికి డబ్బువస్తుంది. అనుకోని ఆలస్యమేదైనా జరిగినా మరో రెండ్రోజుల కంటె జాప్యంకాదు.

ఆఫీసునించి అతను చాలా ఉత్సాహంగా ఇంటికి వెళ్ళాడు. అతనిముఖంలో వెలుగు మాసి చాలా ఆశ్చర్య పడింది ఉమ. విషయం విన్నాక ఆమె ముఖంలోనూ వెలుగు వచ్చింది.

"రామనాథపురం చాలా డీసెంట్ లొకాలిటీ అండీ. నిజంగా చాలా అదృష్టమే" అంది ఉమ.

త్వరగా టిఫిన్ తిని రిక్షాలో భానోజీరావింటికి వెళ్ళారు మురళీధర్, ఉమ, రాజులు. అప్పటికే భానోజీరావు దంపతులు. ఇద్దరు పుత్రాళ్ళతోసహా సిద్ధంగా ఉన్నారు. మురళీధర్ రాగానే "శాంతా టిఫిన్ తొందరగా సిద్ధం చేయి." అన్నాడు భానోజీరావు.

"మేము తినే వస్తున్నాం" అన్నాడు మురళీధర్ భయంగా.

"మీ ఇంటికి నేను తినకుండా వచ్చేవాణ్నను కున్నారా?" అన్నాడు భానోజీరావు.

"తిని వచ్చినా భయంలేదు లెండి. కడుపునిండిన వాళ్ళకూ-డా ఆకలి పుట్టించేలా తయారుచేయగలను నేను పదార్థాలను"అంది శాంత. ఒక్క-క్షణం ఆగి, "అప్పుడప్పుడు ఆ పద్ధర్మంగా నన్ను నేను పొగుడుకుంటూంటాను. ఏమీ అనుకోకండేం, ఐనా టిఫిన్ తింటే నా మాటల్లో అతిశయోక్తి లేదని మీరే గ్రహిస్తారు". అని లోపలకు వెళ్ళి ప్లేట్లలో పెసరపుణుకులతో తిరిగివచ్చింది.

"అబ్బ! పెసరపుణుకులు. నాకు భలే యిష్టం" అన్నాడు రాజు అప్రయత్నంగా.

భానోజీరావుతోసహా అందరూ వెంటనే నవ్వారు. నిజంగానే శాంతమాటల్లో అతిశయోక్తి లేదని పుణుకులు తింటూ అనుకున్నారు మురళీధర్, ఉమ.

టిఫిన్ తిన్నాక అందరూ వీధిలోకి వచ్చారు. భానోజీ రావు ఇంటి తలుపులకు తాళం వేశాడు.

అంతా టాక్సీలో రామనాధపురం వెళ్ళారు. టాక్సీ దిగాక భానోజీరావుని మిగతా అందరూ అనుసరించారు. అతను వాళ్ళనొక చిన్న బంగళా ముందుకు తీసుకు వెళ్ళాడు.

ఇంటి చుట్టూ కొద్దిగా ఆవరణ వుంది. ఇల్లు చిన్నదే కానీ, బయటకు చాలా నీటుగా అనుతోంది.

గేటు తీసుకుని అంతా ఇంటి ఆవరణలో ప్రవేశించారు. భానోజీరావు వెళ్ళి ఇంటి తలుపు తట్టాడు.

ఇంటాయన కాబోలు, తలుపు తీశాడు. "వచ్చేరా, రండి రండి!" అన్నాడాయన.

అందరూ ఇంట్లోకి వెళ్ళారు. ఇల్లు చూసుకునే కార్య క్రమం త్వరగానే ముగిసింది. అందరి ముఖాల్లోనూ అంతు లేని తృప్తి కనబడుతోంది.

ఇంటాయనని భానోజీరావు అందరికీ పరిచయంచేశాడు. ఆయన వయస్సు సుమారు నలభైఅయిదు సంవత్సరా లుంటుంది. పేరు లక్ష్మీకాంతం. కేవలం వీళ్ళ కిల్లు చూపించడంకోసమే ఆయనిక్కడుంటున్నాడు. ఆయన మకాం వేరే స్నేహితుడి ఇంట్లో. హైద్రాబాద్‌లో వ్యాపారస్తుడిగా సెటిల్ కాబోతున్నాడాయన. చాలా ఊళ్ళలో ఇలా చిన్నచిన్న ప్రాపర్టీలున్నాయాయనకు. అవన్నీ క్లియరాఫ్ చేసి మొత్తం సొమ్ము వ్యాపారంలో పెట్టదల్చుకున్నా డాయన.

"ఈ ఊళ్ళో సరిగ్గా మరో వారంరోజులుంటాను

నేను. డబ్బు నాకు వారంరోజుల్లో అందజేయాల్సుంటుంది. ఈ ఇంటిగురించి చాలామంది అడుగుతున్నారు. ఇంతకు మించి నేను చెప్పాల్సిందేమీలేదు" అన్నాడు లక్ష్మీకాంతం.

అంగీకార సూచకంగా తల ఊపాడు మురళీధర్. వారంరోజులంటే గడువు తక్కువేనని అతనికి తోచింది. అయినా ఇల్లు యిలాంటిది మళ్ళీ తన చేతిలోనికి రాక పోవచ్చు. ఎలాగూ హౌస్ బిల్డింగ్ లోన్ అయిదారు రోజుల్లో తన చేతికి వస్తుంది,

మాటలకు సంబంధించినంతవరకూ వ్యవహారాన్నప్పటికి పూర్తి చేశాక; మురళీధర్, భానోజీరావు తమ కుటుంబాలతో సహా అక్కణ్ణించి బయటపడ్డారు.

## 6

"అబ్బ! వెధవ ట్రైన్ గంటలేటుట" అతనెవరో భార్య దగ్గర విసుక్కున్నాడు.

"గంట కాదు, రెండు గంటలన్నా ఫరవాలేదు కానీండీ, ఈ వెధవలిద్దర్నీ సముదాయించలేక చస్తున్నాను. వీళ్ళు నిద్రకు పడితే బాగుండును" భర్త నుద్దేశించి విసుక్కుంది భార్య.

పిల్లలిద్దరిలో ఒకడు ఏడుస్తున్నాడు. రెండోవాడు వాణ్ణేడిపిస్తున్నాడు. ఈ ఇద్దరూ కలిసి తల్లి నేడిపిస్తున్నారు. ట్రయిన్ తండ్రి నేడిపిస్తోంది.

"టైమెంతయింది సార్."

ఎవరో అతన్ని పలకరించారు. అతను విసుగ్గా వాచీ చూసుకుని, "ట్రయిన్ రావడానికింకా గంటంపావుం దండీ" అన్నాడు.

"అయ్ సీ. అయితే, మీరూ ఆ ట్రయిన్ కే నన్న

మాట'' అన్నాడు పలకరించిన అతను. తన చేతివాచీ తీసి కరెక్ట్ చేసుకుని, ''మీది రేడియో టైమే కదండీ, రైల్వే టైము నాకు నచ్చదు'' అన్నాడు.

పిల్లల తండ్రి అతనికి టైము చెప్పి, ''మీరూ, ఈ ట్రయిన్ కే నన్నమాట, ఎంతవరకూ?'' అనడిగాడు.

అతను చెప్పి, ''మీ రెంతవరకూ?'' అనడిగేడు.

పిల్లల తండ్రి చెప్పాడు. ''ట్రయిన్లో పధ్నాలుగ్గంటలకీ ప్లాటుఫారంమీద ఎక్స్ట్రా గంటొకటి!'' అని విసుక్కున్నాడు కూడా.

''ఎక్కడ పన్చేస్తున్నారు సార్, సెలవుమీద ఇంటికి వెళుతున్నా రనుకుంటున్నాను.''

''పబ్లిక్ సెక్టార్లో, ఓ పిగ్ మెంట్ ఫ్యాక్టరీ ప్రారంభించారెండి. అందులో పనిచేస్తున్నాను.''

''అదా, దాంట్లోకి రిక్రూట్ మెంట్ జరిగి ఏడాది కాలేదింకా.''

''అవునండీ, నేను కొత్తగా చేరానందులో...''

''ఆశ్చర్యంగా వుందే. ఈ ఊళ్ళో మీకు ఏడాదిలోపులో ఫామిలీతో వుండడాని కిల్లు దొరికిందా?''

''ఈ ఊళ్ళో ఇల్లు దొరకడం కష్టమేకానీ, మా కంపెనీవాళ్ళు లీజ్ కి ఫ్లాట్సు తీసుకున్నారు. ఆఫీసర్సుకని రిజర్వు చేసి వుంచుతారు.''

''బాగానే వుందే, లేకపోతే కష్టం. అయితే మీ ఫ్యాక్టరీవాళ్ళ ఫ్లాట్సనీ ఒక ఏరియాలోనే వున్నాయా.''

''అబ్బే నగరమంతా వున్నాయండీ, మాది కృష్ణారావుపేటలో వుంది.''

''మీ పేరు సార్.''

"నా పేరు సుబ్రహ్మణ్యం, మీ పేరు?"

"నా పేరు రామలింగం. నేను నిరుద్యోగిని. మీ ఎరిరిలో ఎప్పుడైనా జాబ్ వస్తే నన్ను మర్చిపోకండి సార్. నా ఎడ్రస్ మీ కిస్తాను" అన్నాడతను.

సుబ్రహ్మణ్యం ఇబ్బందిగా ముఖం పెట్టి, "అబ్బే, నా చేతుల్లో ఏమీ లేదండీ. అయినా ఊర్నించి రావడానికింకా నెల పడుతుంది నాకు. అప్పుడోసారి కనిపించండి, వీలుంటే ప్రయత్నిస్తాను. ఇంతకీ మీ క్వాలిఫికేషన్."

"బీయస్సీ సెకండ్ క్లాసులో ప్యాసయ్యాను..."

ఇద్దరిమధ్యా చాలాసేపు సంభాషణ జరిగింది. ట్రయిన్ వచ్చేక, "వస్తాను సార్, మనిద్దరివీ క్లాసులు వేరు" అన్నాడు రామలింగం.

ఐతే రామలింగం ట్రయినెక్కలేదు. అతను తిన్నగా తనగదికి వెళ్ళాడు.

రాత్రి పదకొండుగంటలు దాటేక అతను కృష్ణారావు పేటలో సుబ్రహ్మణ్యం ఇంటికి వెళ్ళాడు. ఎవరి కంటా పడకుండానే, చెప్పుకోదగ్గ శ్రమ లేకుండానే తాళంతీసి లోపల ప్రవేశించగలిగాడు. తాళం తీసేముందతను చేతికి గ్లోవ్స్ తొడుక్కున్నాడు. క్రితంసారి చేసిన దొంగతనం సందర్భంలో పోలీసులకు అతని వ్రేలిముద్రలు దొరికాయి. ఆ వ్యక్తికోసం వారు అన్వేషణలో వున్నారు. అందువల్ల ఈ పర్యాయం అతను కొత్తజాగ్రత్త తీసుకున్నాడు.

అతనికి చెప్పుకోదగ్గవేమీ దొరకలేదు. నాలుగు పట్టు చీరలు, రెండు వెండి కంచాలు, రెండు వెండి చెంబులు దొరికాయి. అక్కడేవున్న ఒక ఎయిర్ బ్యాగులోకి వాటిని సర్దుకుని అక్కణ్నించి బయటపడ్డాడు.

ఆ బ్యాగులోని వస్తువుల ఖరీదు సుమారు అయిదువేలు చేయవచ్చు. కానీ, మారుబేరంలో అతనికి రెండువేలకు మించి దొరకదు. ఏం చేయడం, దొరికినదానితోనే తృప్తి పడాలి మరి.

రామలింగం తన గదిలోకి ఎయిర్ బ్యాగు తీసుకు వెళ్ళాడు. అక్కడ అందులోని వస్తువులన్నీ తీసి పెట్టెల లోకి సర్దేశాడు. తర్వాత మళ్ళీ ఎయిర్ బ్యాగు తీసుకుని ఊళ్ళోని నదివద్దకు వెళ్ళాడు. నదీమతల్లికి ఒక నమస్కారం పారేసి ఎయిర్ బ్యాగు నందులోకి విసిరేశాడు.

ఇప్పుడు గ్లోవ్స్ చేతినించి తీసి జేబులోకి తోసేశాడతను. ఆ తర్వాత నెమ్మదిగా నడుచుకుంటూ వెళ్ళాడు. చటుక్కున బుర్రలో ఏదో స్ఫురించింది.

చకచకా అతని కాళ్ళు అలవాటైన ఆ ఇంటివైపు దారితీశాయి. ఆవరణలో అడుగుపెట్టి, చెట్లచాటునించీ నడుచుకుంటూ బాత్ రూంవైపు వెళ్ళాడు.

బాత్ రూంలో లైటు వెలుగుతోంది. కానీ, వెంటి లేటరు తలుపు మూసివుంది.

రామలింగం కసిగా పెదాలు కొరుక్కున్నాడు. 'మిస్టర్ బాపిరాజూ, ఎప్పుడో దొరక్కపోవు. నీ ఇంట్లోనే నా ఆఖరి దొంగతనం కావాలి' అనుకున్నాడు.

## 7

"కారణం తెలియదు సార్. ఇంతవరకూ మీ లోన్‌కు సంబంధించిన ఫైనల్ పేపర్సు ఢిల్లీనుంచి రాలేదు" అన్నాడతను. మురళీధర్ నిరుత్సాహంగా ముఖంపెట్టి తన సీట్లోకి వెళ్ళిపోయాడు. అక్కణ్ణించి అతను భానోజీరావుకు ఫోన్ చేసి పరిస్థితి చెప్పాడు.

"ఇల్లు చేయిదాటి పోనివ్వడం ఇష్టంలేదు. ఈరోజు కాకపోతే రేపయినా నాకు లోన్ రావచ్చును. కానీ, మనకింక మూడ్రోజులే టైవుంది. ఈ మూడ్రోజుల్లోనూ అంత డబ్బు నాచేతి కందడం అనుమానమే. ఇంటాయన మనకు మరికాస్త గడువివ్వకలదేమో చూడు."

"లాభం లేదురా. కేవలం నా కారణంగానే ఆయన నీకు వారంరోజులు గడువిచ్చాడు. లేకపోతే తక్షణం డబ్బు పోసికొనడానికి కనీసం ఇద్దరు ముగ్గురు సిద్ధంగా వున్నారు."

"ఏం చేయమంటావ్ చెప్పు?" అన్నాడు మురళీధర్ నీరసంగా.

"ఎక్కడైనా అప్పు చేయాలి."

"రమారమి పాతిక వేలు కావాలి మనకి. మా ఇంట్లో నగా నట్రా కలిపి రెండుమూడు వేలుకూడా చేయదు. ఏమైనా హామీ లేందే ఎవరిస్తార్రా డబ్బు" అన్నాడు మురళీధర్.

"ఎవరైనా ఇచ్చేమాటయితే నేను నీకు హామీగా వుంటాను. బాధ్యతగల ప్రభుత్వోద్యోగిని కాబట్టి, నా హామీ నీకు అప్పు పుట్టించవచ్చును" అన్నాడు భానోజీ రావు.

"వద్దురా వద్దు. నువ్వు పోలీసినస్పెక్టర్‌వి. నిన్ను హామీగా వుంచి పాతిక వేలు తీసుకోవడం, నీ భవిష్యత్తుకు మంచిది కాదు."

భానోజీరావు ఒక్కక్షణం మౌనం వహించి, "పోనీ, రామారావును కదిపి చూస్తే, తనకు చాలా ఖరీదైన క్లయింట్సున్నట్లున్నారు" అన్నాడు.

"అబ్బే! లాభం లేదురా. వాళ్ళ నాన్న చేసిన అప్పు లింకా వాడు పూర్తిగా తీర్చనేలేదు. లాయరుగా వాడు బాగానే సంపాదిస్తున్నాడు కానీ, తలకు మించిన బాధ్యతలు మోస్తున్నాడు. వాడు వేమీకి పనికిరాడు."

"మరేం చేద్దామనుకుంటున్నావ్?"

"ఆ విషయంలో సలహా అడుగుదామనే ఫోన్ చేశాన్నకు. కానీ, వ్యవహారమంత సులువుగా తేలేలా లేదు. సరేలే మళ్ళీ ఆలోచించి చెబుతాను" అంటూ ఫోన్ పెట్టేశాడు.

అతను ఫోన్ క్రింద పెట్టగానే, అంతవరకూ వినయంగా చేతులు కట్టుకుని నిలబడివున్న ప్యూన్, "రామయ్యగారు మీ కోసం వచ్చారండి, లోపలకు పంపమంటారా?" అనడిగేడు.

"పంపించు" అన్నాడు ముక్తసరిగా మురళీధర్.

గ్లాస్కో పంచె, పెద్దాపురం లాల్చీలతో ఘుమఘుమలాడుతూ రామయ్య ఆ గదిలో ప్రవేశించి, "నమస్కారమండీ" అన్నాడు.

"నమస్కారం, కూర్చోండి!"

రామయ్య కూర్చుని, బాధగా ముఖం పెట్టి, "ఇల్లు కొందామనుకుంటున్నారుట గదా" అన్నాడు.

"అవునండీ, అనుకున్న లోన్ సమయానికి రాలేదు. అర్జంటుగా పాతిక వేల రూపాయలు కావాలి" అన్నాడు అప్రయత్నంగా మురళీధర్.

రామయ్య నర్మగర్భంగా నవ్వి, "అవసరా లందరికీ వస్తుంటాయండీ, మా అవసరాలు మీరు కనిపెడుతూంటే, మీ అవసరాలు కనిపెట్టేవాళ్ళే వుండరంటారా, పాతిక

వేలు మీకు అప్పుగా ఏం కర్మ...?" అంటూ ఆగాడు.

మురళీధర్ రామయ్యా వంక తీవ్రంగా చూడాలని ప్రయత్నించాడు. కానీ, అతని చూపుల్లో తీవ్రత లేదు.

రామయ్యా చాలాకాలంగా మురళీధర్ ప్రాపకంకోసం ఎదురుచూస్తున్నాడు. ప్రభుత్వంనించి పాతికలక్షల రూపాయలకు రావలసిన గ్రాంటుకు సంబంధించిన పేపర్సు మురళీధర్ దగ్గర చిక్కడిపోయాయి. అందులో చాలా లోపాల నతడు పట్టుకున్నాడు. ఆ గ్రాంటు ఇంచుమించు నిలిచిపోయినట్లే. అయితే రామయ్యా ఆశాజీవి. ఆ ఆశే లేకపోతే అతను ధనవంతుడై యుండేవాడే కాదు. మురళీధర్ ప్రస్తుత పరిస్థితు లతనికి తెలిశాయి. ఎంత నిజాయితీపరుణ్నయినా బలహీనక్షణాల్లో లొంగదీసుకో వచ్చునన్న సత్యాన్నతనికి అనుభవం నేర్పింది.

రామయ్యే మళ్ళీ, "మీకు మూడురోజులే గడువుం దనుకుంటాను. చేయి దాటిపోతే మళ్ళీ ఇంత చౌకలో అంత మంచిల్లు దొరకదట గదా!" అన్నాడు.

మురళీధర్ పుంజుకుని, "ఎవరు చెప్పారు మీకీ సంగతులన్నీ" అన్నాడు.

"ఎవరు చెబితే యేం లెండి, నేను సాయపడగలనా, లేదా అన్నది మీరు తేల్చాలి."

మురళీధర్ ఒక్కక్షణం ఆలోచించి, "రామయ్యా గారూ, నాకొక పాతికవేలు అప్పు కావాలి. రెండు వారాల్లో తప్పకుండా తిరిగిచ్చేస్తాను, యివ్వగలరా?" అన్నాడు.

రామయ్యా సూటిగా మురళీధర్ కళ్ళల్లోకి చూసి, "తిరిగివ్వడం గురించి నాకు బాధలేదు. ఒక ప్రయోజనా

న్నాశించి అప్పడుగుతున్నారు మీరు. అప్పివ్వడంలో ఏదైనా ప్రయోజనా న్నాశించడం నా తప్పవదు గదా'' అన్నాడు.

''మీరు కోరిన వడ్డీ ఇస్తాను'' అన్నాడు మురళీధర్ ఆశగా.

''నేను వడ్డీ వ్యాపారస్తుణ్ణి కాను. ఆ మాటకొస్తే అప్పు లివ్వడం నాకు నచ్చదు. సాధారణంగా నేను పెద్దపెద్ద మొత్తాలు బహుమతి రూపంలో నే ఇచ్చుకుంటూంటాను. నా స్వభావమే అంత. నా లాభాలకు కారణమైనవా ళ్ళందరికీ ఎంతో కొంత ముట్టజెప్పాలనుకునే సోషలిస్టు మన స్తత్వం నాది.''

మురళీధర్ ఆ మాటలన్నీ మౌనంగా విని ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు. అయిదు నిముషాల అనంతరం, ''ఏ ప్రయోజనాన్నీ ఆశించకుండా నాకు మీ రప్పివ్వగలరా?'' అనడిగాడు.

''ఇవ్వ లేదు'' అన్నాడు రామయ్య.

''అయితే, మీరిక వెళ్ళవచ్చు'' అన్నాడు మురళీధర్.

రామయ్య లేచి నిలబడి మరోసారి వినయంగా మురళీ ధర్ కు నమస్కరించి, ''రేపు మళ్ళీ తమ దర్శనం చేసు కుంటాను. ఒకోసారి ఆడవాళ్ళు మనకంటె తెలివిగా ప్రవర్తిస్తారు. ఈరోజు నేనన్నమాటలు ఇంటిదగ్గర ఆడ వాళ్ళతోకూడా చర్చించండి. నా దగ్గ రెప్పుడూ రెడీ క్యాషుంటుంది. ఎటొచ్చీ రేపటికయితే మీ కింక రెండ్రో జులే టైముంటుంది'' అన్నాడు.

మురళీధర్ కళ్ళు మూసుకుని, ''మీరు రేపు రావడం అనవసరం. ఇది నా తుది నిర్ణయం. దీన్ని దేవుడుకూడా మార్చ లేడు'' అన్నాడు.

రామయ్య సమాధాన మివ్వకుండా వెళ్ళిపోయాడు.

మురళీధర్ తల పట్టుకున్నాడు. అతనికిప్పుడు చాలా ఆందోళనగా వుంది. ఎన్నడూ లేనిది తన మనసిప్పుడు బల హీనంగా మారిపోయింది. రామయ్య విషయంలో తను చాలా ఖచ్చితంగా వ్యవహరించేవాడు. అతని గ్రాంటుకు సంబంధించిన విషయంలో నిర్ణయం ఎప్పుడో తీసు కున్నాడు. అటువంటిదీ రోజు తన మనసు ఊగిసలాడింది. ఒక ప్రజాకంటకుడికి సహాయపడకూడదన్న నిర్ణయం తీసు కుందుకు కనీసం కొన్ని నిముషాలు పట్టింది.

# 8

"నాకు చాలా భయంగా వుంది ఉమా. నేనిప్పుడు చాలా బలహీనక్షణాల్లో వున్నాను. ఏదైనా ఒకక్షణంలో డబ్బుకోసం ఎటువంటి నేరం చేయడానికైనా వెనుకాడ నేమో ననిపిస్తోంది" అన్నాడు మురళీధర్, ఆ రోజు ఆఫీ సులో జరిగినది భార్యకు చెపుతూ.

ఉమ అంతా విని అతని తలలో వేళ్ళుపెట్టి, "ఏ పరి స్థితుల్లోనూ మీరు నేరం చేయరు, చేయలేరు. ఇప్పుడున్న పరిస్థితుల్లోకూడా రామయ్యను వెళ్ళిపోమని చెప్పగలిగా రంటే అది మీ గొప్ప మనసుకు సాక్ష్యం" అంది.

"లేదు ఉమా, ఆ రామయ్య రేపు మళ్ళీ వస్తాడు. ఈ రోజు వ్యవహరించినంత ఖచ్చితంగా రేపు వ్యవహరించ లేమోనని నాకు చాలా భయంగా వుంది."

ఉమ ఒక్క క్షణం ఆలోచించి, "ఒక పని చేయండి, కనీసం రెండుమూడు రోజులు ఆఫీసుకు సెలవు పెట్టండి. ఇంటిదగ్గరుంటే మీమీద అంత ఒత్తిడి వుండదు" అంది.

"కానీ, డబ్బెలా పుట్టించేది?" అన్నాడు మురళీ ధర్.

"దానిగురించి మీ రెక్కువగా ఆలోచించకండి. మనకు యోగముంటే డబ్బదే వెతుక్కుంటూ వస్తుంది. లేదూ మనదగ్గర డబ్బున్నప్పుడే ఇల్లు కొనుక్కుందాం" అంది ఉమ.

ఇంతలో ఇంటివారబ్బాయి అక్కడికి వచ్చి, "మా నాన్నగారు మిమ్మల్ని పిలుస్తున్నారండీ" అన్నాడు.

"అవునండీ, చెప్పడం మరిచాను. ఈ రోజు రాత్రి వాళ్ళూ రెడుతున్నారు" అంది ఉమ.

ఇంటివాళ్ళూరుకెళ్ళినప్పుడు తాళాలు మురళీధర్ ఇంట్లో యిచ్చి వెడతారు. మధ్యమధ్యలో ఇల్లు కాస్త తుడిపిస్తూండడానికీ, అన్నీ చూస్తూండడానికీ! ఫోన్ వున్న చిన్న హాలుమాత్రం మురళీధర్ సౌకర్యార్థం తలుపులు తీసే వుంచుతారు. తలుపులు తీసి వుంచితే, ఆ హాల్లోంచి మురళీధర్ డ్రాయింగు రూంలోకి సరాసరి దారి!

ఇంటాయన వీళ్ళను పిలిచినదందుకే. రాత్రి పదకొండు గంటలకు వాళ్ళ ప్రయాణం. మళ్ళీ ఇరవై రోజులు గడిచేక వస్తారు. ఇంటావిడ ఉమకోసారి అన్నీ చూపించి చెప్పింది. ఇంటాయన దొంగల భయాన్ని వివరించి చెప్పాడు.

వాళ్ళతో మాట్లాడుతూండగానే మురళీధర్‌కు ఫోన్ వచ్చింది భానోజీరావు దగ్గర్నించి. డబ్బుగురించి ఇంప్రువ్‌మెంట్సు అడిగి, తను మరోసారి ఫోన్ చేసి కనుక్కున్నాడనీ, డబ్బు అనుకున్న తేదీకి సర్దుబాటు చేయక తప్పదనీ చెప్పాడతను. అతనిప్పుడు బయల్దేరి మురళీధర్ ఇంటికే వస్తున్నాడు. డబ్బు ప్రయత్నాల్లో ఇక్కడికైనా వెళ్ళే దేమో తెలుసుకోవడంకోసం ఫోన్ చేశాడతను.

మరో అరగంటలో భానోజీరావు మురళీధర్ యింట్లో వున్నాడు.

"నే నాఫీసుకో మూడ్రోజులు సెలవు పెట్టేయ దల్చుకున్నాను" అన్నాడు మురళీధర్.

"ఎందుకని?"

"నే నిప్పుడు బలహీనక్షణాల్లో వున్నాను. మనిషిని నేరానికి పురికొల్పేవీ క్షణాలే. ఆఫీసులో లంచానికి లొంగుడతా నేమోనని భయం. నాకు డబ్బవసరమని చాలా మందికి తెలిసింది. అవకాశా న్నుపయోగించుకుందుకు ప్రయత్నిస్తున్నారు" అన్నాడు మురళీధర్.

భానోజీరావు అసహనంగా మిత్రునివంక చూశాడు. "అనుక్షణం ఇలా భయపడడం నాకు నచ్చలేదురా, బలమైన వ్యక్తిత్వా న్నేర్పరచుకోవాలి. నేరం చేస్తా నేమోనని ప్రతీ క్షణం బాధపడతావు తప్పితే, ఇంతవరకూ ఒక్క నేరమయినా చేయలేదని గుర్తుంచుకోవేం? బలహీన క్షణాల్లోనే కాదు, ఏ పరిస్థితుల్లోనూ నువ్వు నేరం చేయలేవు. ఇది మిత్రుడిగా మాత్రమే కాదు, ఒక పోలీస్ ఇనస్పెక్టరుగాకూడా నా అభిప్రాయం."

"నీ అభిప్రాయానికి నా ధాంక్స్. కానీ, ఇంతవరకూ నేను నేరం చేయవలసిన అవసరం రాలేదు. అవసరాలే మనిషిని నేరానికి పురిగొల్పుతాయి."

"ఇప్పుడు మాత్రం అంత అవసర మేమొచ్చిందంట?"

"ఇల్లు కొనడం గురించి నే నెంత తపించిపోతున్నానో నీకు తెలియదు. అది నా జీవితాశయం. అందుకిప్పు డొక బంగారంలాంటి అవకాశ మొచ్చింది. దీన్ని చేతులారా జార విడుచుకోవడం నా కిష్టంలేదు."

"మరీ అంత సెంటిమెంటు పనికిరాదురా, యెప్పటికి మరి ఇల్లు కొనలేకపోతావా?"

"అది కాదురా, ఇల్లు కొనాలన్న ఆశయం నాది. నా ఆశయాలకు సరిపడ్డ ఇల్లుంది. ఆ ఇంటి ఖరీదు సరసంగా వుంది. ఆ ఖరీదుకు కొనగల స్తోమతు నాకుంది. ఇటువంటి పరిస్థితుల్లో ఆ ఇల్లు కొనలేకపోయానంటే, ఏదో అపశ్రుతిలా ధ్వనిస్తుంది. అపశకునంలా తోస్తుంది."

"అపశ్రుతులూ, అపశకునాలూ మనిషి కల్పించుకున్నవి. నాకు తెలిసినంతవరకూ నీ అంత అదృష్టవంతుడు లేడు. చల్లని సంసారం. చక్కని సంతానం."

మురళీధర్ బాధగా నవ్వి, "ఏదో పాటలో విన్నట్లు ఆడది కోరుకునే వరాలు రెండూ అవి. మగవాడికి సంబంధించినంతవరకూ ఈ చల్లని సంసారానికీ, చక్కని సంతానానికీ ఒక రమ్యహర్మ్యంకూడా ఏర్పర్చవలసిన బాధ్యత వుంది" అన్నాడు.

వేడివేడి పకోడీలతో వచ్చింది ఉమ. అంతా వాటిని తిన్నారు.

తర్వాత భానోజీరావూ, మురళీధర్ కలిసి నలుగు రైదుగురు వడ్డీ వ్యాపారస్తుల్ని కలిశేరు. అందరూ కూడా పెద్దపెద్ద హామీలు కావాలన్నారు.

## 9

విషయమంతా విని, "అయితే ఇంకా డబ్బు దొరక లేదన్నమాట. నే ననుకున్నాన్లే. గవర్నమెంటప్పివ్వక పోతే, మనకు డబ్బిచ్చేవాళ్ళెవ్వరుంటారని" అన్నాడు రామారావు.

"ఏదో ఉపాయం నువ్వే చెప్పాలి" అన్నాడు మురళీధర్.

ఒక్కక్షణం ఆలోచించి, "బాపిరాజుగారిని కలిశావా?" అన్నాడు రామారావు.

"ఏమిటీ, మావయ్యనా" అన్నాడు మురళీధర్ నమ్మలేనట్లు.

"అవున్రా, ఆయన్ను కలిశావా అనడుగుతున్నాను."

"ఆయన నేవాడొకడున్నాడనీ, నాకు అప్పిస్తాడనీ కనీసం ఊహలోకూడా స్ఫురించలేదు" అన్నాడు మురళీధర్ నిస్పృహగా.

"ప్రయత్నలోప ముండకూడదు ఏ వ్యవహారంలోనూ. ఏ పుట్టలో ఏ పాముందో యెవరు చూచొచ్చారు?" అన్నాడు రామారావు.

"నాయనా, మావయ్య ఇల్లు నిజంగానే ఒక పుట్ట. ఆ పుట్టలో వున్న పాము బాపిరాజు మావయ్య. అందులో అడుగుపెడితే, దొరికేది ఇంత విషంమాత్రమే. కాటు వేయడం తప్ప వేరే చేతకాదు మావయ్యకి."

"మీ మావయ్య సంగతి నాకు తెలియక కాదు. కానీ, ఆయన మీ కుటుంబానికి ఎన్నోవిధాలుగా ద్రోహం చేసి వున్నాడు. ఇప్పుడు నువ్వు యిల్లు కొనుక్కోవడంకోసం యింటింటికీ తిరగవలసిన అగత్యం ఆయన కారణంగానే కదా పట్టింది. అందువల్ల ఆయన మనసులో ఏదో మూల పాపం చేశానన్న చింత ఉండివుండవచ్చు. నువ్వాయన్నప్పుడగ్గానే అడిగిన క్షణం మంచిదైతే ఆ పాపచింత కదిలి, ఆయన మనసు కరిగి, కనీసం వడ్డీ పుచ్చుకునయినా అప్పియ్యవచ్చు. చెప్పలేము. లాయరుగా నాకు చాల మన స్తత్వాలతో పరిచయముంది" అన్నాడు రామారావు

"బాపిరాజుగారంటే, ఒకసారి నువ్వు పదిరూపాయ

లాయన చందా యిచ్చారని జోక్ చేశావు, ఆయనేనా?''
అన్నాడు భానోజీరావు, ఏదో ఆలోచిస్తూ.

''అవా, చాలా తొందరగా గుర్తు చేసుకున్నావురా ట్యూబులైటూ'' అన్నాడు రామారావు.

''అబ్బే! అదికాదు, ఆ జోక్ వేసిన మనిషే ఆయన దగ్గర కప్పు కెళ్ళమని ఎలా చెబుతున్నాడా అని ఆలోచిస్తున్నాను'' అన్నాడు భానోజీరావు.

''కాస్త ఆలస్యంగానే అయినా తెలివిగానే మాట్లాడేవు కానీ, ఈ సలహా నేను ఆపద్ధర్మంగా యిచ్చాను. దేవుడికి దణ్ణం పెట్టి ఊరుకోవడంకంటె నయమే గదా'' అన్నాడు రామారావు.

''దేవుడికి దణ్ణం పెట్టి ఊరుకోవడంకంటె నయమే కావచ్చు కానీ, మావయ్య దగ్గరకు వెళ్ళేముందు దేవుడికి దణ్ణం పెట్టుకు వెళ్ళడం చాలా అవసరం. కానీ, దేవుడికి మావయ్యను మార్చగల శక్తి వుందని అనుకోను'' అన్నాడు మురళీధర్.

''పోనీ, ఫోన్ చేయరాదూ'' అన్నాడు రామారావు.

మురళీధర్ అంగీకారసూచకంగా తల ఊపాడు.

మురళీధర్ ఫోన్ చేశాడు. నెంబరు ఎంగేజయుంది.

''చూశావా, ఇలాంటి వార్త మావయ్యదగ్గరకు తీసుకెళ్ళడం ఫోనుకికూడా ఇష్టంలేదు. ఎంగేజయుంది'' అన్నాడు మురళీధర్.

''ఏడిశావ్ లే. అయిదునిముషా లాగి మళ్ళీ ప్రయత్నించు. మీ మావయ్యతో అంతకంటె యెక్కువసేపు యెవడు మాట్లాడుతాడులే?'' అన్నాడు రామారావు.

మురళీధర్ కాస్సేపాగి మళ్ళీ నంబరు డయల్ చేశాడు. ఫోన్ రింగవుతోంది.

“హలో!” అవతలనించి కంఠం వినిపించింది.

“ఎవరది మావయ్యేనా?” అన్నాడు మురళీధర్.

“అయాం మిస్టర్ బాపిరాజు. మావయ్యంటే నా కర్థం కావడంలేదు.”

“నేను మురళిని మావయ్యా” అన్నాడు మురళీధర్.

“అరే-నువ్వా, ఏమిటి విశేషం?”

ఇద్దరూ కాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నాక నెమ్మదిగా అసలు విషయంలోకి వచ్చి తనిప్పుడు ప్రస్తుతం ఎదుర్కొంటున్న డబ్బుసమస్య విషయం ప్రస్తావించి, ఈ పరిస్థితుల్లో తన్నాదుకోగలిగినవాళ్లెవరూ లేరన్నాడు.

“బాగానే వుంది కానీ, మేనల్లుడివని నమ్మి నీకు ఏ హామీ లేకుండా పాతిక వేలిచ్చా ననుకో. నువ్వు తప్ప కుండా ఆ బాకీ తీర్చేస్తావు. కానీ, ఈ విషయం బయటకు పొక్కకుండా మానదు. అప్పుడు బంధుత్వం కలుపు కుంటూ చాలామంది నా దగ్గరకొచ్చి అప్పడుగుతారు. ఇవ్వకపోతే బంధువుల్లో నిష్ఠూరం. ఇస్తే కొంప గుల్ల. కాబట్టి, హామీగా యేమైనా విలువైనదుంటే చూడు.”

“విలువైనదేముంది నా దగ్గర. ఏ హామీ లేకపోవడం వల్లనే కదా నీ దగ్గరకొచ్చింది! నా కిప్పుడున్న విలువైన వస్తువు స్నేహముక్కటే — ఇద్దరు ప్రాణస్నేహితు లున్నారు. వాళ్ళదగ్గర అభిమానమే కానీ, డబ్బులేదు మరి...”

అవతల ఫోన్‌లో ఒక్క నిముషంసేపు మాట రాలేదు. తర్వాత “వాళ్ళేం చేస్తున్నారు?” అన్న ప్రశ్న వినిపించింది. మురళీధర్ చెప్పాడు.

“సరే. ఐతే రేపు ఉదయం పదిగంటల ప్రాంతంలో

వాళ్ళను వెంటబెట్టుకుని నా దగ్గరకు రా. అన్నీ అప్పుడు మాట్లాడుకుందాం."

అవతల ఫోన్ క్లిక్‌మంది. మురళీధర్ మిత్రులకు వివరాలన్నీ చెప్పాడు.

# 10

"అరే మీ వ్రేలిన ఉంగరం లేదే" అంది ఉమ.

మురళీధర్ కంగారుపడ్డాడు. "అది కాస్త వదులైంది ఉమా, చిన్నదారం కట్టాలి దానికి. బహుశా బెడ్రూంలో పడివుంటుంది. ఎందుకంటే నేను స్నానంచేసి తల దువ్వుకునే ముందు నా వ్రేలినే వుందది."

ఉమ బెడ్రూంలోకి పరుగెత్తి వెళ్ళింది. అయిదు నిముషాలు వెతికినా కనబడలేదుంగరం.

"అది నాకు జయప్రదమైన ఉంగరం" అనుకున్నాడు మురళీధర్. టైమప్పుడే తొమ్మిదిన్నర కావస్తోంది. మిత్రులు ముగ్గురూ విడివిడిగా బస్సులో బయల్దేరి బాపిరాజు ఇంటిముందు కలుసుకోవాలనుకున్నారు. ఆ కారణంగా హడావుడి పడుతున్నాడు మురళీధర్.

"సరేలే ఉమా, బస్సు టైమవుతోంది. నేను వెళ్ళొస్తాను. దొరికితే జాగ్రత్తగా దాచివుంచు" అని కేకపెట్టి బయల్దేరి వెళ్ళిపోయాడు మురళీధర్.

సుమారు పదిగంటల ప్రాంతంలో మిత్రులు ముగ్గురూ అనుకున్న ప్రకారం బాపిరాజు ఇంటిముందు కలుసుకున్నారు.

"ఏ కార్యానికైనా ముగ్గురు బయల్దేరకూడ దంటారు" అన్నాడు రామారావు సాలోచనగా.

"మనం ముగ్గురం కలిసి బయల్దేరలేదుగా. విడివిడిగా ఇక్కడికి వచ్చి కలుసుకున్నాం" అన్నాడు మురళీధర్.

ముగ్గురూ బాపిరాజు ఇంట్లో ప్రవేశించారు. కాలింగ్ బెల్ మ్రోగించగానే, బాపిరాజే స్వయంగా తలుపు తీసి "వచ్చారా-రండి, కూర్చోండి" అన్నాడు.

ముగ్గురూ సోఫాల్లో కూర్చున్నారు. బాపిరాజు ముఖంలో ఏవిధమైన భావాలూ కనబడ్డంలేదు. మనిషి ముక్తసరిగా వున్నాడు. మిత్రులు ముగ్గురూ యిబ్బందిగా సోఫాల్లో కదులుతూ ఒకరివంక ఒకరు చూసుకుంటు న్నారు.

"ఎలా వుంటోంది మావయ్యా ఒంట్లో" అన్నాడు మురళీధర్.

"తిండిలేక జబ్బుచేయడానికి పేదవాడినీ కాను, జబ్బు చేస్తే వైద్యం చేయించుకోలేని మధ్యతరగతివాణ్ణీ కాను. నా ఆరోగ్యానికేం?" అన్నాడు బాపిరాజు.

ఆ జవాబుకు మిత్రులు ముగ్గురూకూడా షాక్ తిన్నారు.

బాపిరాజు లేచి నిలబడి, "ఉండండి, టీ తీసుకొస్తాను" అన్నాడు. నెమ్మదిగా నడుచుకుంటూ లోపలకు వెళ్ళాడు.

బాపిరాజు మనోభిప్రాయమేమిటో అర్థంకాక మిత్రులు ముగ్గురూ మథనపడుతున్నారు. వాటంచూస్తే వచ్చిన పని సానుకూలపడేలా లేదు.

ఒక ట్రేలో టీ కప్పులతో బాపిరాజు తిరిగివచ్చాడు. "నా ఇంట్లో నౌకర్లుండరు. డబ్బు సంపాదించడంమాత్రమే కాక దాన్ని సక్రమంగా ఖర్చుపెట్టడం తెలిసిన నాబోటి గాడి దగ్గరే లక్ష్మి వుంటుంది" అంటూ ముగ్గురికీ టీ ఇచ్చాడు. తను టీ తీసుకోలేదు.

"నువ్వు తీసుకోవా మావయ్యా" అనడిగాడు మురళీధర్.

"ముందు మీరు తీసుకోండి. అయేక చెబుతాను" అన్నాడు బాపిరాజు.

ముగ్గురూ టీ తాగడమయ్యేక, "నాతో రండి" అన్నాడు బాపిరాజు. ముగ్గురూ ఆయన్ననుసరించారు. ఆయన నెమ్మదిగా వాళ్ళను డైనింగ్ రూంలోకి తీసుకు వెళ్ళాడు. అక్కడ అందమైన డైనింగ్ టేబిల్ మీద నాలుగు వెండి కంచాలున్నాయి. వాటికి పక్కన వెండి గ్లాసుల్లో మంచినీళ్ళున్నాయి.

"నాతో సరిసమానమైనవారికి పదిగంటల సమయంలో నేనిచ్చే ఆతిధ్యం సాధారణంగా ఇలా వుంటుంది. అల్పులకి హాల్లో టీ నీళ్ళే!" అన్నాడు బాపిరాజు.

భానోజీరావు ముఖం ఎర్రబడింది. మురళీధర్ పిడికిళ్ళు బిగిశాయి. రామారావు ఇద్దరినీ శాస్త శాంతపరిచాడు. "ఇంకా మీరు చెప్పదల్చుకున్నదేమైనా వుందా?" అనడిగాడు రామారావు.

"ఉంది. చాలా వుంది. ఒకప్పుడు నా మేనల్లుడు మురళీధర్ నాకంటె చాలా ఉచ్ఛదశలో వుండేవాడు. కానీ, వాడి నాన్న మహాదాత. అడిగినవాడికి లేదనలేడు. నోటుమీదకంటె మాటమీద నమ్మకం. ఫలిత మేమిటి? ఆస్తి, హారతికర్పూరంలా హారించుకుపోయింది. ఈనాడు వీడు నన్నప్పడిగే స్టేజికి దిగిపోయాడు. ఏ హామీ చూప లేనివాడికి, ఎందుకూ కొరగానివాడికి చూస్తూ చూస్తూ పాతికవేలు అప్పివ్వడానికి నేను మురళీధర్ బాబులా చవటను కాను. మహాలక్ష్మి భర్తను. మురళీధర్ తండ్రి డబ్బును తృణప్రాయంగా చూడగలగడానికి కారణం వేరే లేదు. అతనా డబ్బును వారసత్వంగా పొందాడు తప్పితే, కష్టపడి సంపాదించలేదు. నాకులా కష్టపడి,

తెలివితేటలుపయోగించి డబ్బు సంపాదించినవాడు, డబ్బుని తేలిక చేయలేదు.

"మావయ్యా, నన్ను మీ ఇంటికి రమ్మని పిలిచినది అవమానించడానికా లేక..." ఉద్రేకపడుతూ అడిగాడు మురళీధర్.

"ఇది నీకు అవమానం కాదురా, జ్ఞానబోధ. మూసుకుపోయున్న నీ కళ్ళు తెరిపించడంకోసం. మనుషుల్ని నమ్మి నందుకు నీ బాబు నిన్నే గతికి తీసుకొచ్చాడో చూశావా? ముష్టి పాతికవేలు ముగురు కలిసి వారంరోజుల్లో సమకూర్చలేని స్థితికి. ఏ క్షణాన అప్పుకోసం నా యింటికి టెలిఫోన్ చేశావో అప్పుడే జరిగిందిరా నీకు అవమానం. నీలాంటి ఊరూ పేరూ లేనివాడికి అప్పివ్వడానికి నా ఆస్తి వారసత్వంతోటీ, లాటరీ టిక్కెట్లతోటీ సంపాదించింది కాదురా, కష్టపడి సంపాదించాను. కర్మం జాలక, ఏ లాటరీ అయినా తగిలి అప్పనంగా డబ్బొస్తే, నీకు తప్పకుండా ఇంటికి కబురుచేసి మరీ అప్పిస్తానులే..." అన్నాడు బాపిరాజు.

"మావయ్యా, నువ్వింత దుర్మార్గుడివని నేను కలలో కూడా అనుకోలేదు. అప్పడిగితే లేదని ఒక్కముక్క చెప్పడానికి నన్నూ, నా మిత్రుల్నీ నీ ఇంటికి పిల్చి మరీ అవమానించేవు" అన్నాడు ఆవేశంగా.

"చూశావా, నా మాటలకు మరో ఉడుకురక్తమైతే ఉద్రేకపడి నన్ను చంపినంత పనిచేసేది. డబ్బు లేనివాడి రక్తంలో ఉడుకుమాత్రం ఎక్కణ్ణించి వస్తుంది? అందుకే, మరెన్నడూ నా గుమ్మం తొక్కకుండా వుంటావని, ఇలా చేశాను. మానేస్తావా, ఇంకా ఆశ వుందా?"

"ఛ - నీలాంటి మనిషిమీద నా ఆశ? నేను మళ్ళీ నీ గుమ్మం ఎక్కితే, అది నీ ప్రాణం తీయడానికి మాత్రమే

నముకో..." అన్నాడు మురళీధర్. తన మిత్రుల వంక తిరిగి, "పదండి, పోదాం!" అన్నాడు.

ఆ ఇంట్లోంచి బయటకు అడుగులు వేస్తూంటే బాపిరాజు నవ్వు వినబడుతోంది. ఆయన విరగబడి నవ్వుతున్నట్లున్నాడు. చాలా గట్టిగా ఆగకుండా వినిపిస్తోంది.

మురళీధర్ పిడికిళ్ళు బిగుసుకుంటున్నాయి. ముఖం ఎర్రబడి పోతోంది. రామారావతని వీపు నిమిరి, "టేకిట్ ఈజీ" అన్నాడు.

మురళీధర్‌కు నోట మాటకూడా రాలేదు. భానోజీరావు మాత్రం, "ఛా - జీవితంలో ఇలాంటి వ్యక్తిని చూడవలసొస్తుం దనుకోలేదు" అన్నాడు.

"ఏమైనా ఎల్లుండిదాకా టైముంది కాబట్టి, ఇల్లక్కర్లేదన్న విషయం ఎల్లుండి ఉదయమే చెప్పవచ్చు" అన్నాడు రామారావు.

ఎవ్వరూ మాట్లాడలేదు. మౌనంగానే మిత్రులు విడిపోయారు.

మురళీధర్ ఇల్లు చేరి మౌనంగా బెడ్రూంలోకి వెళ్ళి, "ఏమైందండీ - కాయా, పండా" అనడిగిన ఉమ ఒడిలో తలపెట్టుకుని ఏడ్చేశాడు.

# 11

టైమ్ చూసుకున్నాడు మురళీధర్. పదకొండు గంటలయింది. ఇంత రాత్రివేళ తనకు ఫోనెవరు చేస్తారు?

ఫోన్ అలా మ్రోగుతూనే వుంది.

ఇంటాయన ఊళ్ళోలేని కారణంగా మురళీధర్ పక్క, ఫోనున్న హాల్లోకి మార్చేశాడు. ఉమ, రాజు అతని పక్కనే నిద్రపోతున్నారు.

మురళీధర్ లేచి ఫోన్ తీశాడు "హలో,"

"ఎవరది, కాస్త మురళీధర్‌ను పిలవండి బాబూ."

"నేనే మురళీధర్‌ని" గంభీరంగా అన్నాడు మురళీధర్.

"నువ్వేనా మురళీ, అవసానదశలో వున్నాను. ఈ ముసలి పీనుగుమీద దయతల్చి ఒక్కసారి రాగలవా?"

"ఎవరది మాట్లాడుతూంట?"

"నేనేరా, నీ మావయ్యని. నా కంఠం విని ఫోన్ పెట్టేయకు. ఉదయం నా ప్రవర్తనకు నేను సిగ్గుతో చచ్చిపోతున్నాను. నువ్వు మళ్ళీ నా గుమ్మం తొక్కనన్నావు. కానీ, నీ మంచి మనసు తెలిసినమీదట ఈ ఫోన్ చేస్తున్నాను. ఒక్కసారి బయల్దేరి రావూ? చాలా కష్టంలో వున్నాను. నువ్వు రాకపోతే చచ్చిపోతానేమో కూడా."

కంఠం చాలా దీనంగా వుంది. మురళీధర్ మనసు ఊగిసలాడింది. 'ఏమిటి చేయడం - వెళ్ళడమా, మానడమా?' అని ఆలోచిస్తున్నాడతను.

"మురళీ–త్వరగా రారా, ఆలోచించకురా, నా తప్పులన్నీ క్షమించరా..." ఆ తర్వాత మరి మాటలు వినపడలేదు. చిన్నగా మూలుగు, టెలిఫోన్ క్లిక్‌మన్న శబ్దం.

మురళీధర్‌కు అనుమానం కలిగింది. మావయ్య ఇంట్లో ఏదో జరుగుతోందని అతనికి అర్థమైంది. ఎంత దుర్మార్గుడైనా, ముసలివాడు; ఆపదలో వున్నాడు. మీదుమిక్కిలి బంధువు. మరి ఆలోచించలేదతను. ఫోన్ పెట్టేసి, భార్యను లేపాడు. కళ్ళు నులుముకుంటూ లేచిందామె.

"మావయ్య ఫోన్ చేసి పిలిచాడు నన్ను. అర్జంటుగా వెళ్ళాలి. నేను వెడుతున్నాను, తలుపులు జాగ్రత్తగా వేసుకో."

ఉమ కింకా పూర్తి మెలకువ రాక అయోమయంగా

చూస్తోంది. ఈలోగా మురళీధర్ బట్టలు వేసుకుని, బూట్లు తొడుక్కున్నాడు. వీధిలోకి నడుస్తూండగా ఉమకు పక్క మీద మెరుస్తూ ఉంగరం కనిపించింది.

ఆమె హడావుడిగా వీధిలోకి వెళ్ళి, భర్తని పిలిచింది. అతను వెనక్కి వచ్చాడు. "మధ్యాహ్నం నాకు బెడ్ రూంలో దొరికిందని ఇచ్చానా, మళ్ళీ ఇది మీ పక్కమీద పడుంది" అంటూ ఉంగరం అందించింది.

"అచ్చొచ్చిన ఉంగరమిది. ఉదయం నా వ్రేలికిది వుండివుంటే, బహుశా మావయ్య నన్నవమానపర్చి వుండేవాడు కాదేమో, పోనీలే. ఇప్పుడైనా వెళ్ళిన పని జయప్రదం కావచ్చు" అన్నాడతను.

"ఇంతకూ, యెందుకింత హడావుడిగా బయల్దేరుతున్నారు?"

"ఏంలేదు, మావయ్య యెందుకో ఫోన్‌లో పిలిచాడు" అంతకు మించి ఉమకు అప్పుడు చెప్పడం మురళీధర్ కిష్టంలేదు.

ఉమకు పరిస్థితి అర్థం కాలేదు. కానీ, భర్త కనుచూపు మరుగు కాగానే తలుపులు మాత్రం వేసుకుంది.

మురళీధర్ వడివడిగా అడుగులు వేస్తున్నాడు. అతనికి రిక్షా ఒకటి యెదురుగా వచ్చింది. అతను రిక్షాఅతన్ని పలకరించి బాపిరాజుగారింటికి కడతాదేమో అడిగాడు. నాలుగురూపాయ లడిగాడు రిక్షావాలా.

"చాలా ఎక్కువ!" అన్నాడు మురళీధర్.

"చూడండి బాబూ, అర్థరాత్రి – అందులోనూ ఎదురుగాలి..."

అప్పుడే మురళీధర్ గమనించాడు. ఇందాకట్నించీ విపరీతంగా గాలి వీస్తోంది. వాతావరణం చూస్తూంటే

వాన వచ్చేలా వుంది. రిక్షాఅతను చెప్పేదాకా, తన ఆలోచనల్లో వాతావరణాన్ని గమనించనే లేదు.

చేరమాడగా ఓ అరరూపాయ తగ్గింది. మురళీధర్ రిక్షా ఎక్కాడు. రిక్షా యెదురుగాలిలో కూడా వేగంగానే పోతోంది. రిక్షాఅతను చాలా బలంగా వున్నాడు.

ఉరుములు ఫెళ ఫెళ మంటున్నాయి. ఉండుండి మెరుపులు తళుక్కు మంటున్నాయి. గాలి వింత రకం సవ్వడులు చేస్తోంది. మురళీధర్ రిక్షా ఈ వాతావరణంలో బాపిరాజు గారింటికి వెడుతోంది. మురళీధర్ బుర్రలో ఆలోచనలు అ స్తవ్య స్తంగా వున్నాయి.

ఏం జరిగింది మావయ్య ఇంట్లో? నానా దుర్భాషలూ ఆడి తరిమేసిన మావయ్యకు, హఠాత్తుగా తనమీద ప్రేమ ఎలా పుట్టుకొచ్చింది? ఆయన తన్ను పిలవడంలో ఉద్దేశ్యమేమిటి? అవసానదశలో వున్నాననీ, చాలా కష్టంలో వున్నాననీ, చిన్న మూలుగు మూలిగి అర్థాంతరంగా ఫోన్ పెట్టేశాడు. అక్కడ ఆ పరిస్థితుల్లో యెవరున్నారు? మావయ్య ఒక్కడేనా, లేక?

ముసలివాడు కష్టంలో వున్నాడనగానే తన బుర్ర పని చేయలేదు. కానీ, చాలా పొరపాటు చేశాడు. తనుకూడా భానోజీరావునుకూడా తీసుకురావాల్సింది...

రిక్షా ఆగింది. మురళీధర్ దిగి రిక్షాఅతనికి డబ్బులిచ్చాడు. నాలుగడుగులు వేశాడు. అతనిప్పుడు బాపిరాజుగారింటిముందు నిలబడి వున్నాడు. హాల్లో యింకా దీపం వెలుతురున్నట్లు బయటకు కనబడుతోంది.

మురళీధర్ మారు ఆలోచన చేయకుండా ముందడుగు వేశాడు. మరోక్షణంలో అతని చేయి బాపిరాజు యింటి కాలింగ్ బెల్‌ను అదిమింది.

తలుపులు తెరుచుకున్నాయి. బాపిరాజే స్వయంగా తలుపులు తెరిచాడు. మనిషి పిడిరాయిలా వున్నాడు. నవ్వుతున్నాడు. "లోపలకు రా, నీతో చాలా మాట్లాడాలి" అన్నాడు.

మురళీధర్ లోపలకు వెళ్ళాడు. ఇద్దరూ చెరో సోఫాలో కూర్చున్నారు.

"ఉదయం నా ప్రవర్తనకు నేను చాలా సిగ్గుపడుతున్నాను. ఏ సైతాన్ నన్నావహించిందో తెలియదు" అన్నాడు బాపిరాజు.

"మీ ప్రవర్తన నాకూ చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. నా స్నేహితుల యెదుట నన్నూ, వాళ్ళనీకూడా అవమానించావు..." అన్నాడు మురళీధర్ అదోలా.

"అయితే, నా తప్పును నువ్వు క్షమించగలవా?"

"అంత పెద్ద మాటలెందుకు లెండి, మీ అంత సైక్రాడ్, నా అంత సైక్రాడ్?"

"అలాగనకురా, నన్ను క్షమించేననరా."

"చూడు మావయ్యా, మనం చిన్న పిల్లలం కాదు. జీవితం బొమ్మలాటా కాదు. మీ రన్నమాటలన్నీ నా గుండెల్ని పిండేస్తున్నాయి. మీ రిప్పుడు సింపుల్‌గా క్షమించమని అడుగుతున్నారు ... అయినా నా క్షమలో మీకు నిమిత్తమేముంది?"

"ఉంది. మంచితనం విలువ ఈ రోజునే నా కర్థమైంది. అసలీ రోజున ఏం జరిగిందో తెలుసా?"

"అబ్బ - ఇంకా నిద్దరోలేదా...!" బాపిరాజు భార్య విసుక్కుంటూ అక్కడికి వచ్చి, "ఎవరూ, నువ్వా నాయనా, ఆయన కసలే బ్లడ్ ప్రెషర్. ఉదయం పెట్టిన బాధ చాలదనుకునా, ఇప్పుడు మళ్ళీ వచ్చావు" అంటూ

విసుక్కుంది మురళిని చూసి.

"నువ్వెళ్ళి పడుకో, నేనుకూడా అరగంటలో వచ్చి పడుకుంటాన్లే. అర్ధరాత్రి మెలకువగా వుండడం నీ ఆరోగ్యానికి మంచిది కాదు" అన్నాడు బాపిరాజు భార్యనుద్దేశించి.

"అమ్మయ్యా" అని నిట్టూర్చి, "నేను పొద్దున్న నిన్ను వెటకారం చేశానా? ఏ లాటరీలోనైనా డబ్బొస్తే, నిన్ను పిలిచి మరీ డబ్బిస్తానని. మధ్యాహ్నానికి నాకు లాటరీలో లక్షరూపాయల బహుమతి వచ్చినట్లు తెలిసింది. ఈ వార్త నాకు సంతోషాన్ని కలిగించినప్పటికీ, తీయవలసిన చోటనే దెబ్బతీసిందికూడా. ఎంత ఐశ్వర్యమున్నా, నీబోటి మంచి వాళ్ళసాటి వస్తార్రా నాబోటివాళ్ళు. నీ మంచితనం, దేవుడిచేత నాకు లక్షరూపాయ లిప్పించింది. అందులో కేవలం పాతికవేలు నేను నీ కివ్వబోతున్నాను. నువ్వు కాదనకూడదు" అన్నాడు బాపిరాజు.

ఊహించని ఈ ఔదార్యానికి తెల్లబోయాడు మురళీధర్. అతనికి నోట మాట రాలేదు.

"ఆలోచించకురా, నేను మామూలుగా పిలిస్తే నువ్వు రావనే అనుమానంతో ఫోన్లో అలా చెప్పాను. ఆఖరికి మూలిగాను. నువ్వీ డబ్బు తీసుకోని పక్షంలో నేను మానసికంగా చచ్చిపోయినట్లే లెక్క!"

మురళీధర్ చటుక్కున, "అంతమాటనకు మావయ్యా" అన్నాడు.

"నీ గురించి లెక్క సిద్ధంగా వుంచాను. సరిగ్గా పాతికవేలు. దీంతో నీ అవసరం గడుపుకో, మళ్ళీ తిరిగి ఇవ్వాల్సిన పనిలేదు" అన్నాడు బాపిరాజు.

"నీ మాట కాదనలేను. కానీ, అప్పుగా అయితేనే

తీసుకుంటాను.''

బాపిరాజుకూడా ఒక్క క్షణం ఆలోచించి, ''సరే - నీ యిష్టం'' అన్నాడు.

తర్వాత బాపిరాజు మురళీధర్‌ని ఇనప్పెట్టె వున్న గదిలోకి తీసుకువెళ్ళాడు. ఇనప్పెట్టె తలుపులు తీసి యెంచి సరిగ్గా పాతిక వేల రూపాయలు యిచ్చాడు. మొత్తం రెండువందలఏభై వందరూపాయల నోట్లు. చిన్న పోలిథీన్ బ్యాగులో పెట్టి, ''జాగ్రత్తగా వెళ్ళు'' అన్నాడు.

మురళీధర్ చటుక్కున వంగి బాపిరాజు కాళ్ళకి దణ్ణం పెట్టాడు. ''నీది మంచి మనసు మావయ్యా, ఒక బలహీన క్షణంలో నిన్ను చంపాలన్న ఆలోచనకూడా నాకు వచ్చింది'' అన్నాడు.

బాపిరాజు అతన్ని లేవనెత్తి, ''నీచేత దణ్ణం పెట్టించుకునే అర్హతకూడా నాకు లేదు. మనిషి జీవితానికి డబ్బు ఒక్కటే ప్రధానం కాదు. బ్రతికితే మీ నాన్నలా బ్రతకాలి. చాలా ఆలశ్యంగా ఒక జీవితసత్యం తెలుసుకున్నాను. ఇన్నాళ్ళ బాపిరాజు ఈ రాత్రి చచ్చిపోయాడు. కొత్తజన్మ ఎత్తుతాడు మరి'' అన్నాడు.

# 12

హఠాత్తుగా హాల్లో ఏదో చప్పుడైంది.

బాపిరాజు, మురళీధర్ కంగారుగా హాల్లోకి వచ్చారు. తలుపులు తీసివున్న కారణంగా హాల్లోకి విపరీతంగా గాలి వేస్తోంది. గోడమూలగా వున్న ఒక చిన్న బల్లమీదనుంచి దొర్లుకుంటూ చిన్న ఇనుపగొట్టాం క్రింద పడింది. ఆ చప్పుడే ఇద్దరూ విన్నారు. కాని, ఆ బల్లచాటున నక్కిన రామలింగం వారి కంట పడలేదు.

''ఈ గొట్టామేమిటి మావయ్యా'' అంటూ తీశాడు

దాన్ని మురళీధర్, "అబ్బా, చాలా బరువుగా వుందే" అన్నాడతను.

"అది గొట్టాం కాదు. ఏదో పురాతన వస్తువంటే కొన్నాను. దానిమీద మంచి బొమ్మవుంది చూడు" అన్నాడు బాపిరాజు.

నిజమే. కానీ, పెద్ద విశేషంగా తోచలేదు మురళీధర్‌కి. అతను నెమ్మదిగా ఆ గొట్టాన్ని బల్లమీదుంచాడు.

బాపిరాజు మురళీధర్‌ని సాగనంపడానికి రోడ్డుదాకా వచ్చాడు. మురళీధర్ కనుచూపు మరుగయ్యేవరకూ చేయి ఊపుతూనే వున్నాడు.

మురళీధర్ ఉత్సాహంగా ఈల వేసుకుంటూ నడుస్తున్నాడు. అతనికి కనుచూపుమేరలో ఎక్కడా రిక్షా కనబడలేదు. పదినిముషాలు నడిచేసరికి వాన తుంపర ప్రారంభమైంది. మరో అయిదు నిముషాల్లోనే అది బ్రహ్మాండమైన వానగా మారిపోయింది.

మురళీధర్ దారుణంగా తడిసిపోతున్నాడు. ఏం చేయాలో అతనికి తోచలేదు. ఒక సందు మొగలో పెద్ద అరుగుల ఇల్లు కనబడిం దతనికి. చటుక్కున అక్కడికి పరుగెత్తాడు.

అప్పటికే అతను పూర్తిగా తడిసిపోయాడు. అరుగు మీద అతని శరీరంనుంచీ, బట్టలనుంచీ ధారగా నీళ్ళు కారుతున్నాయి. అలా కారిన నీళ్ళు అరుగుమీద అటూ, ఇటూ ప్రవహించినట్లున్నాయి. అక్కడ పడుకునివున్న ఒక వ్యక్తి ఉలిక్కిపడి లేచాడు. అక్కడ నిలబడివున్న మురళీధర్‌ని చూసి, "ఎవరది?" అన్నాడు.

మురళీధర్ ఉలిక్కిపడి ఆ వ్యక్తిని చూశాడు. ఎవరో అపరిచితుడు. "ఈ దారిని పోతూ వానలో చిక్కడి

ఇక్కడ తలదాచుకుంటున్నాను" అన్నాడు.

ఆ అపరిచితుడు లేచి నిలబడి, "ఇంత రాత్రివేళ దారిని పడిపోవడమేమిటి? అయ్యో! బాగా తడిసిపోయారే" అన్నాడు. మురళీధర్ ఏమీ మాట్లాడలేదు.

"ఇంట్లో నిద్రపట్టక పక్క అరుగుమీద వేసుకున్నాను. లోపల వున్నది కొత్త దంపతులు లెండి-మా అమ్మాయీ, అల్లుడూ. అయినా వాళ్ళను డిస్టర్బ చేయక తప్పదు" అంటూ అపరిచితుడు వెళ్ళి తలుపు తట్టాడు. అలా నాలుగైదుసార్లు తట్టాక తలుపులు తెరుచుకున్నాయి. విడీవిడని మత్తుకళ్ళతో ఒక అమ్మాయి, "ఎందుకు నాన్నా" అంటోంది. అపరిచితుడు విషయం వివరించాడు.

మురళీధర్ కి తుడుచుకుందుకు తువ్వాలు దొరికింది. కట్టుకున్న బట్టలు పిండుకుని, మళ్ళీ కట్టుకునేటందుకు మరుగు దొరికింది. వాన తగ్గేవరకూ కాస్త తోడు దొరికింది.

అత నిల్లు చేరుకునేసరికి సరిగ్గా రెండు గంటలయింది.

"ఎవరది?" అని అడిగి భర్త కంఠస్వరం విన్నాక నే తలుపు తీసింది ఉమ. భర్తను చూస్తూనే ఆత్రుతగా విశేషాలడిగింది ఉమ.

తలుపులు వేసి లోపలకు వెళ్ళాక జరిగినదంతా చెప్పి, పాలిథీన్ బ్యాగు అందించాడు తను. ఉమ ఆ సంచీని కళ్ళకద్దుకుని దేవుడి గదిలో వ్రేలాడుతున్న శ్రీ వేంకటేశ్వర స్వామి పటానికి వెనుక వుంచింది.

మురళీధర్ తడిబట్టలు విప్పి, పొడి లుంగీ కట్టుకున్నాడు. "అదృష్టం ఈ విధంగా మన్ని వెతుక్కువస్తుందని నేనూహించలేదు ఉమా!"

భార్యాభర్తల కారాత్రి హాయిగా నిద్ర పట్టవలసిందే కానీ, ఎందువల్లనో అలా జరగలేదు. ఇంట్లో పాతిక వేల

రూపాయల క్యాషున్నదన్న భయంకూడా అందు క్కారణం కావచ్చు.

# 13

ఉమ వెళ్ళి తలుపులు తీసేసరికి, పోలీస్ దుస్తులలో భానోజీరావు కనిపించాడు. అదంత పెద్ద విశేషం కాక పోయినా, అతని వెనుక మరికొందరు కానిస్టేబుల్సుకూడా వుండడం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది.

"ఆయనకు బాగా జ్వరంగా వుందన్నయ్యా" అంది ఉమ లోనికి నడుస్తూ.

"అదేం, నిన్నటివరకూ బాగానే వున్నాడుగా."

"ఏముంది, ఎంత బాగావున్నా వానలో తడిస్తే పడదు కదా, ఈయనకు..."

"నిన్న వాన పడందే" అన్నాడు భానోజీరావు లోపలకు ప్రవేశిస్తూ.

"పడకేం, రాత్రివేళ పడిందిగా."

భానోజీరావు ఉలిక్కిపడి, "రాత్రి ఒంటిగంటకు వానపడితే, వీడెందుకు తడిశాడు" అన్నాడు.

"అదే, బాపిరాజుగారింటికెళ్ళి వస్తూనూ" అంది ఉమ.

భానోజీరావు తల పట్టుకుని, "అయితే, వీడు బాపిరాజుగారింటికి వెళ్ళాడన్నమాట" అని, కానిస్టేబుల్సుతో "యూ డూ యువర్ డ్యూటీ" అన్నాడు.

"ఏమిటి?" అంది కంగారుగా ఉమ.

"మీ ఆయన అర్ధరాత్రివేళ బాపిరాజుగారింటికి వెళ్ళి పాతిక వేలు క్యాష్ పట్టుకొచ్చాడా?" అనడిగేడు భానోజీరావు.

"మీకెలా తెలుసు!" అంది ఉమ.

భానోజీరావు కానిస్టేబుల్సుని ఆగమని చెప్పి, "ఏదీ ఆ

డబ్బు చూపించు" అన్నాడు. ఉమ లోపలకు వెళ్ళి డబ్బు తీసుకువచ్చి భానోజీరావు కిచ్చింది. భానోజీరావు డబ్బు లెక్క పెట్టాడు. ఆ నంబర్లు చూశాడు. ఉమవంక జాలిగా చూసి, "నీ కొక్క టే సలహా ఇవ్వగలను. తక్షణం లాయర్ రామారావుగారికి ఫోన్ చేయి. నేను నీ భర్తను అరెస్టు చేస్తున్నాను" అన్నాడు.

ఉమ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "అసలేం జరిగింది?"

"ఏం జరిగిందో నాకు తెలియదు. కానీ, నా డ్యూటీ నాచేత నీ భర్త రాత్రి బాపిరాజుని హత్యచేసి పాతిక వేల రూపాయలు క్యాష్ ఎత్తుకొచ్చాడని అనిపిస్తోంది. ఈ విషయంలో నేను పూర్తిగా నిస్సహాయుణ్ణి" అన్నాడు.

"బాపిరాజుగారు హత్య చేయబడ్డారా?"

"ఆ విషయం రాత్రి నీ భర్త చెప్పలేదా?"

"అలా కూర్చో అన్నయ్యా" అంది ఉమ. అతను కూర్చున్నాక రాత్రి తన భర్త తనకు చెప్పిన వివరాలన్నీ ఓపిగ్గా చెప్పింది ఉమ.

అన్నీ విని భానోజీరావు నిట్టూర్చాడు. "ఎవరు నమ్ముతారమ్మా ఈ కట్టు కథ! బాపిరాజులాంటి కఠినాత్ముడు అర్ధరాత్రివేళ పిలిచి నోటులేకుండా పాతికవేలప్పిచ్చాడంటే! నువ్వు కాక మరెవ్వరైనా చెపితే నవ్వివుండేవాణ్ణి."

"ఆయన అబద్ధమాడ రన్నయ్యా" అంది ఉమ.

"ఆ సంగతి నాకూ తెలుసును. కానీ, బాపిరాజు ఔదార్యం చూపించలేడన్నది అంతకంటె పచ్చి నిజం. అయినా ఆయన మీ ఆయన కెప్పుడు ఫోన్ చేశాడు?"

"నేను వినలేదన్నయ్యా, నిద్రపోతున్నాను. ఆయనే నన్ను లేపి తన కిలా ఫోన్ వచ్చిందనీ, వెడుతున్నాననీ

అన్నారు'' అంది ఉమ.

''కనీసం తనకు ఫోన్ వచ్చిందన్నందుకైనా సాక్ష్యం లేదన్నమాట'' అన్నాడు భానోజీరావు నీరసంగా.

''ఇంటివాళ్ళూ ఊళ్ళోలేరు. అందువల్ల మేము ఫోన్ వున్న గదిలోనే పడుకుంటున్నాం'' అంది ఉమ.

''విధి వీడిమీద పగ బట్టినట్లుంది. అసలు వీడికే ఫోన్ కాలూ రాలేదు. ఉదయం బాపిరాజు చేసిన అవమానం వీడి మనసును బాధిస్తూంటే, పాతిక వేల అవసరం పీకుతూంటే, రాత్రి పదకొండు గంటలవేళ ఒక నిర్ణయానికి వచ్చి, వీడు బాపిరాజు యింటికి బయల్దేరాడు. ఆవేశంలో ఆయన్ను హత్యచేసి అవసరమైన పాతిక వేలూ తీసుకుని వచ్చేశాడు.

''అన్నయ్యా'' అంది ఉమ బాధగా.

''అని నేను కాదమ్మా, నా డ్యూటీ అంటుంది. కాదని ఎవరైనా ఋజువు చేయగలిగితే సంతోషించగలిగేది నా కంటె ఎవరూ వుండరు'' అన్నాడు భానోజీరావు. మళ్ళీ ఒక్క క్షణం ఆగి, ''హత్యాసాధనమైన ఇనుప గొట్టంమీద హంతకుడి వేలిముద్రలున్నాయి. నా ఆశ ఒక్క ఈ దాని మీదనే వున్నాయి'' అన్నాడు.

# 14

''మురళీధర్‌కి పాతిక వేలు కావాలి. ఎలాగైనా ఆ డబ్బు సంపాదించాలన్నది అతని ఆశయం. ఈ ఆశయ సిద్ధికోసం తనలోని బలహీనతలు వెలికి వచ్చి తనచేత నేరం చేయిస్తాయేమోనని అతను చాలా భయపడుతున్నాడు. లంచానికి లొంగిపోతానేమోనని భయపడి ఆఫీసుకు వెళ్ళడంకూడా మానేశాడు.

డబ్బిస్తానని యింటికి పిలిచి బాపిరాజు మురళీధర్‌ని

దారుణంగా అవమానించాడు. ఆవేశంగా అతని యిల్లు వదిలిపెడుతూ, మళ్ళీ నీ గుమ్మం తొక్కితే అది నీ ప్రాణాలు తీయడానికే నన్నాడు మురళీధర్.

అతను మళ్ళీ బాపిరాజు గుమ్మం తొక్కాడు. బాపిరాజు ప్రాణాలు పోయాయి.

బాపిరాజు తనకు ఫోన్ చేశాడన్న విషయాన్ని మురళీధర్ ఋజువు చేయలేదు. అర్ధరాత్రి అతను బాపిరాజు యింటికి వెళ్ళాడు. బాపిరాజు మరణించాడు. మురళీధర్‌ని బాపిరాజు భార్య చూసింది. బాపిరాజును చంపడానికి ఉపయోగించిన ఇనుపగొట్టంమీద మురళీధర్ వ్రేలిముద్రలే వున్నాయి. బాపిరాజు ఇంట్లో మాయమైన పాతిక వేలూ మురళీధర్ ఇంట్లో వున్నాయి.

మురళీధర్ చెప్పే విధంగా బాపిరాజు ఔదార్యాన్ని చూపించిన సంఘటనలు మచ్చుకొక్కటైనా వున్న వివరాలు లేవు.

హత్య జరిగిన సమయానికి వాన పడుతోంది. మురళీధర్ వానలో తడిశాడు. అతను వానలో బాగా తడిస్తే జ్వరపడతాడు. మర్నాడతను జ్వరపడడం, అతను వానలో బాగా తడిశాడన్న విషయాన్ని స్పష్టం చేస్తుంది.

రామారావు తను కాగితంమీద వ్రాసుకున్న వివరాలన్నీ మరోసారి బాధగా చూసుకున్నాడు. ఈ పరిస్థితుల్లో తను చేయగలిగిన దేమీలేదు. నిజానికి హత్యను నిరూపించడానికి యిటువంటి ఆధారాలు సంపాదించడానికే తను ప్రయత్నిస్తాడు. కేసును పటిష్టం చేయడానికీ ఆధారాలు చాలు.

మురళీధర్‌ని కలుసుకుందుకు పోలీస్ స్టేషన్‌కు వెళ్ళాడు రామారావు. భానోజీరావు ముభావంగా పలకరించాడు.

"ఏమంటున్నాడు మురళీధర్?" అడిగాడు రామా రావు.

అదోలా నవ్వి, "తను అమాయకుణ్ణని నమ్మమంటాడు" అన్నాడు భానోజీరావు.

"నువ్వేమంటావు?"

"అమాయకుడని నమ్మడానికి అభ్యంతరం లేదు. కానీ, అమాయకులు మాత్రం హంతకు లెందుకు కాకూడదు?"

"ఏరా - నువ్వు నమ్ముతున్నావా, మురళి హత్య చేశా డంటే" రామారావు బాధగా అడిగాడు.

భానోజీరావు టేబిల్ మీంచి ఒక ఫైలు తీసి, "ఇది చూడు. మురళి మన మిత్రుడని మరిచిపో. నీ అభిప్రాయం చెప్పు" అన్నాడు.

"ఆ ఫైలు చూడవలసిన అవసరంలేదు. వివరాలన్నీ నాకు తెలుసు" అన్నాడు రామారావు.

"నీ అభిప్రాయం చెప్పుమరి."

"కాకతాళీయంగా యెన్నో విషయాలు జరిగుంటే తప్ప, మురళీధర్ నిర్దోషి అనలేము. ఇన్ని విషయాలు కాకతాళీయంగా జరగడం నా అనుభవంలో ఇంతవరకూ రాలేదు. చిన్నతనంనుంచీ మురళీధర్‌ని యెరుగుదును కాబట్టి, అందరకూ సమంజసంగా కనబడే నిర్ణయానికి రావడం కష్టంగా వుంది" అన్నాడు రామారావు.

భానోజీరావు మాట్లాడలేదు. రామారావే మళ్ళీ, "ఒక పర్యాయం వెళ్ళి మురళితో మాట్లాడి వస్తాను" అన్నాడు. భానోజీరావో క్షణం ఆలోచించి, "నిజం ఒప్పేసుకుంటే శిక్ష తగ్గుతుందనికూడా చెప్పు" అన్నాడు.

రామారావుకు మురళీధర్‌ని చూస్తే కడుపు తరుక్కు పోయింది. ఈ వేషంలో అటువంటి అవతారంలో అతన్ని

చూస్తానని అతననుకోలేదు.

"మురళీ!" అన్నాడతను బరువుగా.

"రామారావ్, ఏమిటి విశేషాలు?" అన్నాడు మురళీధర్ విషాదంగా.

"నిజం ఒప్పేసుకుంటే, శిక్ష తగ్గుతుందని చెప్పమంటున్నాడు భానోజీరావు."

"నువ్వుకూడా నేను హంతకుడని నమ్ముతున్నావా రామారావ్. నిజంగా నేను నిర్దోషిని."

"అలాగంటే అందరూ నవ్వుతున్నారు. ఎలా ఋజావు చేయడం?"

"ఋజావు చేసుకోవలసుంటుందని ముందుగా నాకు తెలియదు గదా! లేకపోతే జాగ్రత్తపడి వుండేవాడిని. నీకు గుర్తుందో లేదో కానీ, మనం స్నేహితులం ముగ్గురం ఒకసారి మూడు అబద్ధాల గురించి మాట్లాడుకున్నాం. ఈ నాడందులో రెండు నిజాలయ్యాయి. బాపిరాజు ఔదార్యం చూపించాడు, భానోజీరావు నన్నరెస్ట్ చేశాడు. కానీ, లోకం నమ్ముతున్న నిజాలు వేరుగా వున్నాయి. భానోజీరావు నన్నరెస్ట్ చేశాడు, నేను హత్య చేశాను. వీటిల్లో అసలు నిజమూ, అసలు అబద్ధమూ తెలిసినవాళ్ళు ముగ్గురం. ఒకడు బాపిరాజు మావయ్య, ఈ లోకం విడిచి వెళ్ళిపోయాడు. రెండు భగవంతుడు. ఉలకడు, పలకడు. మూడు నేను. నా మాట నమ్మరు."

రామారావు మౌనంగా అంతా విని, "నేనింకా నిన్ను రక్షించాలనే ప్రయత్నంలోనే వున్నాను. అన్నీ వివరంగా మరొక్కసారి చెప్పు. ఒక్క సంఘటనకూడా తప్పకూడదు" అన్నాడు. మురళీధర్ ఓపికగా అంతా చెప్పాడు.

"నువ్వు దారిలో వాన పడ్డప్పుడొక ఇంట్లో ఆగానని చెబుతున్నావే, ఆ సంఘటనకూడా నిన్ను రక్షించదు. ఎందుకంటే వాళ్ళెవ్వరూ నిన్ను సరిగ్గా ఏ టైముకు కలుసుకున్నారో చెప్పలేక పోతున్నారు. ఎక్కడా యే హావ్వూ లేదు. నువ్వు మాత్రం అధైర్యపడకు. నేను ప్రయత్నాలు చేస్తూంటాను."

రామారావు మురళీధర్‌తో మాట్లాడి సెలవు తీసుకుని వెళ్ళిపోయేక భానోజీరావు మరోసారి కలిశాడతన్ని.

"ఒరేయ్, స్నేహితుడిగా నా సలహా విను. నీచేత నేరం ఒప్పించలేనందుకు పోలీసుశాఖ 'సన్నసమర్థుడిగా లెక్కడుతుంది. అయినా అందుకు భయపడ్డంలేదు నేను. నిన్ను మరొకరి చేతికి ఒప్పగించాలేమోనని హడలిపోతు న్నాను. నేరస్థులచేత నేరాన్నొప్పింప చేసేందుకు పోలీసు శాఖ అవలంబించే పద్ధతులు నీకు తెలియవు. నువ్వు ఆ దారుణ హింసకు గురికావడం ఊహలోకూడా నేను సహించలేను. నువ్వు నిజంగా హంతకుడివి కాదనుకో. అసలు హంతకుడు తనకు తాను స్వయంగా వచ్చి బయట పడి, హత్య ఎలా జరిగినదీ వివరిస్తే తప్ప, ఈ పరిస్థితుల్లో నువ్వు నేరస్థుడివి కాక తప్పదు. నీ భార్యాబిడ్డలకు వచ్చిన లోటులేదు. వాళ్లు ప్రస్తుతం మా ఇంట్లోనే వుంటున్నారు. చెల్లాయినీ, మేనల్లుణ్ణీ కంటికి రెప్పలా చూసుకుంటాన్నేను. వెంటనే నేరం ఒప్పేసుకుంటే, శిక్ష తగ్గించడానికి ఏమైనా సహాయపడగలుగుతాను నేను - నీ మేలు కోరి చెబుతున్నాను. నేరం ఒప్పేసుకో!"

"ఒప్పుకోకపోతే..."

"నేను రంగంలోంచి తప్పుకుంటాను. మా పోలీసుశాఖ నీచేత ఎలాగూ నేరాన్ని ఒప్పించగలదు. కానీ, నీ భార్యా

బిడ్డలకు నీడ కల్పించే అవకాశం నేను కోల్పోవచ్చు."

మురళీధర్ అతన్ని మరేమీ ప్రశ్నించలేదు. శూన్యంలోకి చూశాడు కాసేపు. తర్వాత "ఎన్నోసార్లు పుస్తకాల్లో చదివాను. చట్టానికి చెవులే కానీ, కళ్ళు లేవని. అది ఇంత భయంకరంగా నా జీవితంలో నిజమవుతుందని కలలోకూడా ఊహించలేదు. ఒరేయ్ భానోజీరావ్! భగవంతుడనేవాడుంటే, ఒక నిరపరాధికి నిష్కారణంగా శిక్ష విధించబడిందని మీరంతా గ్రహించే రోజు తప్పక వస్తుందిరా. అంతవరకూ భగవంతుడు నా కాయుష్షు ఇస్తాడేమో చూడాలి. అదంతా ఎందుకులే కానీ, బాపిరాజు మావయ్య హత్య గురించి నీకు తోచిన విధంగా రాయి. నువ్వెక్కడ సంతకం పెట్టమంటే అక్కడ పెట్టేస్తాను" అన్నాడు.

భానోజీరావు ముఖంలో సంతోషం కనబడింది. అతను తృప్తిగా నిట్టూర్చాడు.

ఆ తర్వాత సుమారు నెలరోజులకు కోర్టు విచారణ ముగిసి, మురళీధర్‌కు యావజ్జీవ కారాగారశిక్ష విధించబడింది.

# 15

"ఎలా చిక్కిపోయాడో" అన్నాడు బసవరాజు రాజుని చూసి బాధగా.

బసవరాజు ఉమకున్న ఏకైక బంధువు. వరుసకు అన్నయ్యవుతాడు. ఉమ వివాహం అతని చేతులమీదుగానే జరిగింది. మురళీధర్ జైల్లో వున్నాడని తెలిసి వచ్చాడు. రాజుకి ఆ ఏడాది చదువు పూర్తయేవరకూ ఉమ ఆ ఊళ్ళోనే వుండడానికి నిర్ణయించుకుంది. ఆమెకు ధైర్యంగా వుండడంకోసం ఓ నెలరోజులపాటు ఆమెవద్ద గడప

డానికి భార్యాబిడ్డలతో సహా అక్కడికి వచ్చేశాడు. అతను భానోజీరావుకు కృతజ్ఞతలు చెప్పాడని, ఉమ బాధ్యతలు తను వహిస్తానని చెప్పాడు.

“ఇంకా యిప్పుడు కాస్త నయం. తండ్రిదగ్గర బాగా చేరిక వాడికి. ఆయన లేకుండా యెప్పుడూ భోంచేసేవాడు కాదు. ఆయన అరెస్టయిన నాలుగురోజులసలు వీడు పచ్చి మంచినీళ్ళుకూడా ముట్టలేదు. మరి దక్కుతాడనుకోలేదు నేను.”

ప్రస్తుతం బసవరాజు, అతని భార్య, ముగ్గురు పిల్లలు, ఉమ, రాజు బజారుకు వెళ్ళడంకోసం ఒక బస్ స్టాపులో నిలబడి వున్నారు. హఠాత్తుగా రాజు తల్లిదగ్గరగా వచ్చి నెమ్మదిగా, “అమ్మా, అక్కడ నిలబడి వున్నాయన చేతి ఉంగరం నాన్నది” అన్నాడు.

ఉమ ఉలిక్కిపడింది. హత్య జరిగిననాటి రాత్రి తిరిగి వచ్చిన మురళీధర్ చేతివ్రేలికి ఉంగరం లేదు. ఎక్కడ పడిపోయిందో అతనికి గుర్తులేదు. ఆ ఉంగరం హత్య జరిగిన ప్రాంతంలో ఎవ్వరికీ దొరకలేదు.

ఉమలో ఏదో ఆశ తళుక్కుమనగా, ఆమె కొడుకు చూపించిన వ్యక్తిని పరిశీలనగా చూసింది. అతని కుడి చేయి వ్రేలాడుతూ వుంది. ఆ చేతి చూపుడువ్రేలుకుంది ఉంగరం.

అది ప్రత్యేకమైన ఉంగరం. దానిమీద త్రిమూర్తుల బొమ్మ స్పష్టంగా కనపడుతుంది. ఉంగరం సైజుకూడా పెద్దదే. ఆ త్రిమూర్తుల బొమ్మను తీసేస్తే, ఉంగరంమీద మురళీధర్ పేరుకూడా వుంటుంది. ఆ వ్యక్తి చేతివ్రేలికి అటువంటి ఉంగరమే వుంది.

రాజుకి ఆ ఉంగరం గురించి బాగా తెలుసు. అతని

కడం టే ఎంతో యిష్టం. ఆ కారణంగా యెన్నోసార్లు తండ్రి దగ్గర్నుంచి తీసుకుని, కాసేపు ఆడుకుని మళ్లీ ఇచ్చేస్తూండేవాడు. కొడుకంటే విపరీతమైన ప్రేమ గల మురళీధర్ అడిగినప్పుడల్లా అభ్యంతరం చెప్పకుండా ఉంగరాన్నిస్తూండేవాడు. ఇప్పుడు రాజు దాన్ని దగ్గర కంటూ వెళ్ళి చూసొచ్చాడు. అతను పొరబాటు పడడు.

ఉమ నెమ్మదిగా బసవరాజుకి ఆ వ్యక్తిని చూపించి, "అతనెవరో, ఏం చేస్తూంటాడో తెలుసుకోవాలి. బాపి రాజుగారిని చంపిన హంతకుడతనే అయినా ఆశ్చర్యం లేదు" అని చెవిలో చెప్పినట్లు చెప్పింది.

బసవరాజు చకితుడై, "నీకేం మతికానీ పోలేదుకదా" అన్నాడు.

"నాకు పోయింది మతికాదు. మంచితనంమీద నమ్మకం. మళ్లీ ఇప్పుడిప్పుడే నాలో ఆశలు చిగురిస్తున్నాయి. సరిగ్గా హత్య జరిగిననాటి రాత్రి మాయమైన ఉంగరం, ఆయన ఉంగరం, ఆ వ్యక్తి వ్రేలికి వుంది. ఏమో, అదృష్టం బాగుంటే, ఎలాంటి రహస్యం బయటపడుతుందో."

బసవరా జులిక్కిపడి, "బస్సు వస్తోంది. మీరు ఇంటికే వెళ్ళండి. నేను ఇతని ఆచూకీ తెలుసుకు వస్తాను" అన్నాడు.

ఒకగంట తర్వాత బసవరాజు ఇంటికి వచ్చాడు.

"అతని చిరునామా సంపాదించాను" అన్నాడు.

"భానోజీరావుగార్కి వెంటనే కబురు చెప్పాలి" అంది ఉమ.

"వాడికి అనుమానం రాకుండా వాణ్ణనుసరించి వెళ్లాను. వాడి మకాం తెలియగానే, వెంటనే భానోజీరావుగారికి అన్నీ వివరంగా ఫోన్ చేసి చెప్పేశాను. ఆయన తను వ్యవ

హారం చూస్తానన్నారు'' అన్నాడు బసవరాజు.

మర్నాడుదయం భానోజీరావు స్వయంగా ఉమ ఇంటికి వచ్చాడు. అతను వస్తూనే ఉత్సాహంగా రాజుని గట్టిగా కౌగలించుకుని ఎత్తేసుకున్నాడు.

''ఏమిటన్నయ్యా యిది!'' అంది ఉమ అర్థం కాక.

''ఎంత అదృష్టవంతుడమ్మా వీడు, తండ్రికి జైలుశిక్ష తప్పించాడు!'' అన్నాడు.

ఉమకు సంతోషంతో మాట రాలేదు. తమాయించుకుని, ''వివరంగా చెప్పండన్నయ్యా!'' అంది.

''ఏముంది! అసలు హంతకుడు అవలీలగా దొరికేశాడు. నిన్న మీ అన్నయ్యగారి టెలిఫోన్ విన్నాక నాకు నమ్మకం లేకపోయినా ఆ ఇంటికి మఫ్టీలోవున్న కానిస్టేబుల్ని కాపలా వుంచి, ఇంట్లోనివాడు బయటకు పోగానే ఇల్లు సోదా చేయమన్నాను. అనుమానించదగ్గ వస్తువులు దొరికితే వెంటనే పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేయమన్నాను. వాడి గదిలో చాలా దొంగవస్తువులు దొరికాయి. అదలా గుంచితే ఆ వెధవకి డైరీ రాసే అలవాటుంది. అందులోని వివరాలు ఇటీవల నగరంలో జరిగిన ఎన్నో చిల్లర దొంగతనాల వివరాలు తెలియబర్చడమే కాక, బాపిరాజు హత్య జరిగిననాటి రాత్రి వాడా ఇంట్లో ప్రవేశించి అనుకోకుండా బాపిరాజుగారి తలమీద మ్రోది పారిపోయిన వివరంకూడా తెలిసింది. వాడి వ్రేలిముద్రలు తీసుకుని చూస్తే, నగరంలో ఇదివరకు జరిగిన కొన్ని దొంగతనాల సందర్భంలో దొరికిన వ్రేలిముధ్రలతో సరిపోయాయి. మేము వెతుకుతున్న దొంగ నీ మూలంగా, నీ రాజు మూలంగా దొరికిపోయాడు. కాకతాళీయంగా మీ రాజు ఆ ఉంగరాన్ని చూసి వుండకపోతే, వీడిప్పటిలో మా

చేతికి చిక్కి వుండేవాడు కాదు..."

"ఇంతకీ వాడి వ్రేలికా ఉంగరమెలా వచ్చింది? హత్యాప్రదేశంలో దొరికిన ఉంగరాన్నంత ధైర్యంగా పెట్టుకుని తిరగ గలుగుతున్నాడు వాడు?" అన్నాడు బసవరాజు.

"అదే తమాషా" అన్నాడు భానోజీరావు. "బాపిరాజుగారింటినుంచి బయటపడ్డాక వాన కారణంగా తాత్కాలికంగా కాసేపు ఒకరి యింట్లో బసచేశాడు మురళి. అక్కడ తువ్వాలుతో ఒళ్ళుకూడా తుడుచుకున్నాడు. ఆ ఇంట్లో మురళి ఉంగరం పడిపోయింది. తర్వాతెప్పుడో ఆ విషయాన్ని గమనించిన ఆ యింట్లోని వాళ్ళే ఉద్దేశ్యంతో నైతేనేం ఆ ఉంగరాన్ని దాచివుంచారు. బాపిరాజును హత్యచేసిన చిల్లరదొంగ ఒకరోజు రాత్రి ఆ ఇంట్లో జొరబడి దొంగతనం చేశాడు. వాడికక్కడా ఉంగరం దొరికింది..."

ఉమ ఆనందతరంగాల్లో తేలిపోతూ, "ఇంతకీ ఆయన కచ్చొచ్చిన ఉంగరమది. అదే ఇప్పుడు" అంటూంటే, "అయినా, నే నెప్పుడూ ప్రతీ విషయంలోనూ కాస్త లేటనీ, ట్యూబులైటుననీ మురళి వేళాకోళం పట్టిస్తూండేవాడు. ఇప్పుడూ అంతే ఐంది" అన్నాడు భానోజీరావు.

ఆ తర్వాత కొన్నిరోజులకు మురళీధర్ జైలునుండి విడుదలై తిరిగివచ్చిన సందర్భంగా, మిత్రులు ముగ్గురూ భానోజీరావింట్లో పార్టీ చేసుకున్నారు. ఎటొచ్చీ ఆ పార్టీలో ఈ పర్యాయం, అసాధ్యపు టబద్ధాల ప్రస్తావన రానేలేదు.

—: ఐపోయింది :—

# సప్లిమెంట్ పోటీ - 26

191, 192, 193, 194, 195 — అంకెలను తీసుకొని మీకు నచ్చిన వరుసక్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 75 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలుచేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు జనవరి' 77 నెల మాసపత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని, వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవ్యాఖ్యలతో 30పై.లు స్టాంపులుపంపాలి.

మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్.క త్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి ఇవ్వబడుతుంది. *



# క్రైమ్‌లో తమాషాలు

## అర్జెంట్ కేసు!!

బోర్డు కట్టి నెలరోజులు అయినప్పటికి ఏ కేసూ రాక పోవడంతో ఇహ తనకు కేసులు రావేమో అన్న దిగులుతో, మంచంపై వాలి పడుకున్నాడు అర్జంట్ శ్రీ.

ఎవరో తలుపు తట్టడంతో లైట్ స్విచ్ వేసి, గడియ తీశాడు.

హడావుడిగా ఆ గదిలోనికి ప్రవేశించాడు ఓ సూట్‌వాలా చేతిలో సూట్‌కేస్‌తో. ప్రవేశించిందే తడవుగా "సార్! మీరు నాకు ఒక సహాయం చేయాలి. ఈ సూట్‌కేస్‌ను త్రీ స్టార్ హోటల్‌లోని ఓ వ్యక్తికి అందించి, అతనివద్ద నున్న పార్శెల్ తీసుకురావాలి, ఇందులో లక్ష రూపాయలు క్యాష్ ఉంది. బయట నా చవర్‌లెట్ కారు తీసుకువెళ్ళండి. కారును చూస్తూనే నల్లని సూట్‌లో నున్న ఓ బోడిగుండు వ్యక్తి మీ వద్దకు వస్తాడు. అతనికి ఈ సూట్‌కేస్ ఇచ్చి, అతనివద్దనున్న పార్శెల్ తీసుకురండి. అందుకుగాను మీకు మూడువేల రూపాయలు ఫీజు ఇచ్చుకుంటాను" అంటూ గబగబా చెప్పి ఊపిరి పీల్చుకున్నాడు సూట్‌వాలా.

అప్పటివరకు ఊపిరి బిగబట్టి వింటున్న "అర్జెంట్ శ్రీ" ఇదేదో బ్లాక్‌మెయిలింగ్ కేస్ అనుకుంటూ, సూట్‌కేస్ చేతిలోనికి తీసుకొని వచ్చి కారులో కూర్చొని లక్ష రూపా

యలుపైన విలువచేసే కారులో, లక్షరూపాయలు క్యాష్‌తో ప్రయాణం చేసే అదృష్టం కలిగినందుకు సంతోషిస్తూ అర్జంట్‌గా బయలుదేరాడు "అర్జెంట్ శ్రీ".

మెయిన్‌రోడ్డుపై పోలీసు ఇన్‌స్పెక్టర్‌కు తన బలగంతో కారు ఆపి, "మీ లైసెన్సు చూపించండి." అన్నాడు.

"సారీ....ఇది నా క్లయింట్ కారు" అంటూ తను వెళు తున్న పని వివరించాడు అర్జంట్ శ్రీ.

"భలేవాడివయ్యా....ఇది డిస్ట్రిక్ మేజిస్ట్రేటుగారి కారు. ఈ రోజు సాయంత్రం దొంగిలించబడింది."

"నో....నో కావాలంటే నా ఆఫీసుకు వచ్చి నా క్లయింట్‌ను అడగండి." అంటూ పోలీసు వాహనములో తన ఆఫీసుకు చేరుకున్నాడు అర్జంట్ శ్రీ.

ఇరవై వేల రూపాయలతో అందంగా అలంకరించు కున్న ఆఫీసులో పదిపైసలు విలువచేసే వస్తువు గూడా లేకపోవడంతో చేతిలోని సూట్‌కేస్‌ను గభాల్న ఓపెన్ చేసాడు.

కట్టలు కట్టలుగా క్రిందపడ్డాయి పాత న్యూస్‌పేపర్లు. అది చూస్తూనే కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి "అర్జంట్ శ్రీ"కి. ఏడ్చి ముఖం తుడుచుకోవడానికి ఆ గదిలో చిన్నగుడ్డ ముక్క కూడా లేకపోవడంతో, కట్టుకున్న లుంగీని పైకెత్తి కళ్ళు తుడుచుకున్నాడు అర్జంట్ శ్రీ.

—బెల్లంకొండ నాగేశ్వరరావు, గుంటూరు.



